మహాసభల ప్రత్యేక సంచిక

# ఐక్యఉపాధ్యాయ


సం: 7
9,10

సెప్టెంబరు అక్టోబరు 1981




చెన్నుపాటి నగర్

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ భీమవరం.

తృతీయ విద్యా వైజ్ఞానిక మహాసభలు
ఆగష్టు 16.17.18.



పతాకాభివందనం

శాల్యూట్! శాల్యూట్! యు.టి.ఎఫ్ పతాకా!
ఐక్యోద్యమ అరుణారుణ శలాకా!





ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక

HE LARGEST CIRCULATED EDUCATIONAL MONTHLY

రు 2

# బహుమతి ప్రదాన దృశ్యాలు












IUVO2A177

# సందేశాలు

**C. SUBRAHMANIAN,**
General Secretary,
T. T. G. G. T. Association,
MADRAS.

Dear Comrade,

Onbehalf of the Tamilnadu Govt. Collegiate Teachers Association. I wish your conference a grand success. I am unable to go over there, on account of some urgent work in connection with our struggle., However I have written to the president of our Association to attend your conferencə if he is free of engagements.

Thanking you,

Yours faithfully,

*(Sd.) C. SUBRAHMANIAN*

**E. M. S. NAMBOODRIPAD,**
General Secretary;
Communist Party of India (Marxist)
NEW DELHI

I have received your letter informing me about the Third Educational Conference of your Federation I am sure that the delegates assembled and the guests partic'pating in the Conference will give serious thought to the various burning and urgent problems facing the Students, Teachers and the entire public of India. I wish you success in your endeavour.

With regards,

Yours sincerely,

*(Sd.) E M. S. NAMBOODRIPAD*

**Justice A. GANGADHARARAO,**
HYDERABAD

I am happy that your Federation could unite teachers in all three regions of the State and it is working for the cause of education & advancement of teachers, Without any particular political affiliation. Apart from discussing the problems facing the teachers, it should be your endeavour to inculcate a scientific, socialistic and democratic out-look among the teachers. You should also try to bring about reforms in the educational system, so that it should ultimately help the development of the harmonious personality of the child.

I wish your Conference all success.

Yours sincerely,

*(Sd.) A. GANGADHARARAO*

**P. VENKATAREDDY,**
Dy. Minister for Labour, India,
NEW DELHI.

I am happy to know that third Educational Conference of Andhra Pradesh United Teachers Federation is going to be held during the third week of August, 1981 at Bhimavaram in Andhra Pradesh, a place of historical and cultural importance.

There is a wide-spread opinion that Education is for a job and not for wisdom. This is deplorable. Education without wisdom serves no usefulpurpose. The aim of Education should be to radiate that light of wisdom in every young Indian. The Teachers have a special responsibility to inculcate in our younger generation higher values and ideas which developmental and moral calibre and generate a sense of pride in being indian. Both the Government and the academic community have a lot to be in this regard.

I hope the Conference will discuss all the problems concerning the teaching profession and educational system and syllabus and come up with positive points for implementation.

I wish the Conference all success.

*(Sd.) P. VENKATAREDDY*

# మహాసభల విజయానికి అన్నివిధాలా తోడ్పడిన

# ఆహ్వానసంఘ ప్రముఖులు



శ్రీ జి. రంగరాజు, ప్రెసిడెంట్
డి. యన్. ఆర్. కాలేజి, కమిటీ



శ్రీ వి. కె. డి. వి. సత్యనారాయణరాజు (కనకరాజు)
ఆహ్వాన సంఘాధ్యక్షులు



శ్రీ జె. సీతారామభద్ర[illegible] ...డెంట్
డి. [illegible]. ఆర్. కా[illegible], [illegible]టీ



శ్రీ డి. శివరామరాజు
(యం. యల్. సి)



శ్రీ దంతులూరి కృష్ణంరాజు



శ్రీ యన్. బంగార్రాజు, ప్రిన్సిపాల్
డి. యన్. ఆర్. కాలేజి



శ్రీ కె. పుల్లంరాజు, షైప.



శ్రీ కె. వి. ఆర్. యస్.
సుబ్బరాజు, కోలమూరు

## కార్యవర్గం



IKYA UPADHYAYA

Life Subscription 150 00
Yearly ,, 15 00
Single copy 1-25

Ikya Upadhyaya
Palapartivari street
Vijayawada-2
520 002

Grams : "UTIYEF" Phone : 63606

# ఐక్య ఉపాధ్యాయ

సంపాదకవర్గం :
మైనేని వెంకటరత్నం
(ప్రధాన సంపాదకుడు)
దాచూరి రామిరెడ్డి
అప్పారి వెంకటస్వామి
మోతుకూరి నరహరి
పి. వి. సుబ్బరాజు

సంపుటి 7 సెప్టెంబరు, అక్టోబరు 1981 సంచిక 9, 10

## అభినందనలు!

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ తృతీయ విద్యా వైజ్ఞానిక మహాసభలు భీమవరంలో 1981 ఆగస్టు 16 17, 18 తేదీలలో 10 వేల మంది ప్రతినిధులతో అత్యంత జయప్రదంగా జరిగాయి. ఇది యు.టి.యఫ్. ఉద్యమ చరిత్రలో మరో మైలురాయి.

1974 అక్టోబరు 20, 21 రాజమండ్రిలో మొదటిమహాసభలు వేయిమందిప్రతినిధులతో, 1977 ఆగస్టు 17,18 ఖమ్మంలో ద్వితీయ మహాసభలు ఆరువేలమంది ప్రతినిధులతో అపూర్వంగా జరిగాయి.

నాటికి నేటికి యు.టి.యఫ్. పురోగమనాన్ని అంచెలంచెలుగా యీ మహాసభలు అద్దం పట్టాయి. వీటిద్వారా తన సమీకరణ శక్తినీ, సంఘబలాన్ని యు టి.యఫ్. ప్రస్ఫుటంగా ప్రదర్శించింది.

అత్యవసర పరిస్థితులలో కూడా ఉపాధ్యాయులకు అండగా నిలిచి, అవకాశవాద విధానాలను ఎండగట్టి, సూత్రబద్ధవైఖరితో నికరంగా నిలిచింది 20 సూత్రాలకు దాసోహమనక, విద్య ఉమ్మడి జాబితాలో అంటే ఉబ్బిపోక, అగ్రిమెంట్లతో డైరెక్ట్ పేమెంటుకు ఆహ్వానం పలుకక, ప్రతి పరీక్షా సమయంలోను పీడితులపక్షాననిలిచి వీరోచితంగా పోరాడింది యు టి.యఫ్.

సి.డి. ఆర్డినెన్సు, పనిగంటల బడిదినాల పెంపు, నేటివిటి ఉత్తర్వు. నిర్బంధ రిటయిరుమెంటు, ఉద్యోగుల మధ్య వ్యత్యాసాలు అపరిష్కృత సమస్యలు, అవకతవక జీత నిర్ణయాలు, అగ్రిమెంట్ల రద్దు, కో-ఆర్డినేషన్ ఆంక్షల రద్దు, రిటయిరుమెంటు వయసు పెంపు లాంటి అనేకానేక సమస్యలపై సమరశీల పోరాటాలు సాగించి సత్ఫలితాలు సాధించిన సంఘమిది.

ప్రాంతీయ హద్దులు దాటి, కేటగిరీ విభేదాలు త్రోసి, మేనేజిమెంట్ల వైరుధ్యాలు నెట్టి, సమైక్య ఉద్యమ నిర్మాణంచేసిన మొదటి సంస్థ; ఉపాధ్యాయ ఉద్యోగ సంఘాల సమైక్య ఉద్యమానికి అహరహం కృషి చేస్తున్న అగ్రగామి సంస్థ యు టి యఫ్.

పెరుగుతున్న ధరలు, తరుగుతున్న వేతనాలు, జీవిత సుడిగుండంలో ఆశించినవిరామం, అవసరాలు తీరక, కరువులతో బరువులతో కష్టాలకడగళ్ళలో బ్రతుకులేదుర్భరంకాగా, బ్రతుకుకై, బాధావిముక్తికై కార్మిక, కర్షక, సామాన్య ప్రజానీకంతో చేయికల్పి సామాజిక స్పృహతో కృషిచేస్తున్న పోరాటసంస్థ ఇది.

ఉద్యమ నిర్మాణంలో, పోరాటాల పోకడలలో, పత్రికా నిర్వహణలో, బోధోపకరణ పుస్తకాలు, డైరీలు, సాహిత్య ప్రచురణలలో, అన్నిటా వరవడులు పెట్టి అజేయంగా పురోగమిస్తూ, మార్గదర్శకత్వం చూపుతున్న సంస్థ యు.టి.యఫ్.

అందుకే మహాసభలకు ఆ సమీకరణ, ఆఉత్సాహం, ఆవూపు, ఆవరవడి, ఆ పరవడి ! దానికితోడువిద్యాభిమానుల సహకారం, ప్రజాసంఘాలచేయూత, ప్రజల ఆదరణ, పెద్దల ఆశీస్సులు కూడ లభ్యమై మహాసభల జయప్రదానికి తోడ్పడినాయి.

మహాసభలు జరిగినతీరు, ఉన్నత సాంప్రదాయాలు, ఉత్తమ క్రమశిక్షణ, విద్యావిధానం బాగుకై అహరహం సాగిన గోష్ఠులు, చర్చలు, తీర్మానాలు, నిర్ణయాలు అందరి హర్షామోదాలు అమితంగా పొందినయ్.

మహాసభల జయప్రదానికి అద్వితీయంగా కృషిచేసినఆహ్వాన సంఘానికి, విరాళాలిచ్చి తోడ్పడిన ఉపాధ్యాయులు, దాతలు, విద్యాభిమానులకు, అహోరాత్రులు శ్రమించిన ప్రతినిధులకు, సకల సౌకర్యాలు ఏర్పాటుచేసిన ప్రజాసంఘాలు, అధ్యాపకులు, విద్యార్థులు, వలంటీర్లు, కార్యకర్తలు, పురప్రముఖులు, పెద్దలు, అందరికీ కృతజ్ఞతాభి వందనాలు తెల్పుకొంటున్నాం.




అధ్యాపకలోకం, అశేష ప్రజానీకం అపూర్వంగా ఆదరించి మాపై వుంచిన గురుతర బాధ్యతలు సదామననం చేసుకొంటూ; అమరజీవి చెన్నుపాటి అడుగుజాడలో, ఆశయాల వెలుగులో, జాతి ప్రగతికి, విద్యారంగ పురోభివృద్ధికి, అధ్యాపక సంక్షేమానికి కృషి చేస్తూ, సమస్త శక్తులు కేంద్రీకరించి తన చారిత్రక కర్తవ్యాన్ని నిర్వర్తిస్తుందని యు.టి.యఫ్. ఈసందర్భాన ప్రతిన చేస్తున్నది.

### చందాదార్లకు చక్కని అవకాశం

పేపరు, ప్రింటింగు, బైండింగ్, ఇతరఖర్చులు అన్నీ పెరిగిన కారణంగా ఐక్యఉపాధ్యాయ పత్రికరేట్లు ఈ క్రింది విధంగా పెంచటం అనివార్యమయింది.

జీవిత చందా రూ. 150-00

సం॥రం చందా రూ.15లు విడికాపీరూ 1-25

అయితే క్యాంపెయిన్లలో చందాదారుగా చేరువారికి 1982 జనవరి 31 వరకు పాతరేట్లే వర్తిస్తాయి. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని మాతో సహకరించ కోరుతున్నాము.

సంపాదక వర్గం




ప్రజాతంత్ర ఉపాధ్యాయ ఉద్యమ ఐక్యవేదికగా ఆవిర్భవించిన అనతి కాలంలోనే అపూర్వమైన అభివృద్ధి సాధించిన ఆంధ్ర ప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ తృతీయ విద్యా వైజ్ఞానిక మహాసభలు ఆగష్టు 16, 17, 18 తేదీలలో భీమవరం డి.యస్.ఆర్. కాలేజీ ఆవరణలో చెన్నుపాటి నగర్ పేరుతో ప్రత్యేకంగా నిర్మించిన పెండాల్‌లో ఉత్సాహోత్తేజాల మధ్య అపూర్వంగా జరిగాయి.

రాష్ట్రంలో అన్ని జిల్లాలనుండి వచ్చిన ఉపాధ్యాయులు పది వేల మందికి పైగా యీ మహాసభల్లో పాల్గొన్నారు. వారిలో వేయి మందికి పైగా మహిళల్ని పాల్గొనటం ప్రత్యేక విశేషం. బెంగాల్, కేరళ, పంజాబ్, మద్రాసుల నుండి సౌహార్ద ప్రతినిధి వర్గాలు రావటంతో ఈ మహా సభలకు మరింత విశిష్ఠత ఏర్పడింది.

## ఆదర్శవంతమైన ఏర్పాట్లు

ఆగస్టునెల సాధారణంగా వర్షాకాలం. దీనికితోడు బంగాళా ఖాతంలో వాయుగుండం ఏర్పడిందనీ, భారీవర్షాలు కురుస్తాయనీ వాతావరణ శాస్త్రజ్ఞుల ప్రకటనలు పత్రికల్లో, రేడియోలో వచ్చాయి. మేఘావృతమైన ఆకాశం, ఈదురుగాలులు దానికి సాక్ష్యంగా కన్పించాయి. దీనితో వేలాదిమంది పాల్గొనే యీ మహాసభలు ఎలా జరుగుతాయో అన్న ఉద్విగ్నతతో కూడిన ఆందోళన ఇటు కార్యకర్తలలోను, అటు శ్రేయోభిలాషులలోను వ్యక్తమయింది. కాని సమసమాజ స్థాపన లక్ష్యంగా, సామాజిక స్పృహతో మమైకమై పని చేసే వారికి ఎటువంటి అవరోధాలు ఉండవన్నట్టుగా.... ప్రకృతి కూడా సహకరించి యీ మహాసభల్ని దిగ్విజయం చేసింది.

దంతులూరి నారాయణరాజు (డి.యస్.ఆర్.) కళాశాలలో ఈ మహాసభలకు ఆహ్వాన సంఘంవారు, కార్యకర్తలు చక్కని ఏర్పాట్లు చేశారు. పచ్చని పచ్చిక తివాచీలా కప్పిన విశాల ఆవరణ, వేలాది మందికి వసతినిచ్చిన పెద్దపెద్ద గదులు — అన్నీ మహాసభలకు అనువుగా తీర్చిదిద్దబడ్డాయి. కళాశాల పాలకవర్గం, ప్రత్యేకించి అధ్యక్షులు శ్రీ రంగరాజుగారు, కార్యదర్శి శ్రీ సీతారామభద్రరాజుగారు, ప్రిన్సిపాల్ శ్రీ బంగార్రాజుగారు, అధ్యాపక అధ్యాపకేతర బృందమంతా ఈ ఏర్పాట్లలో ఎంతగానో సహకరించారు. మహిళా ప్రతినిధులకు హాస్టల్‌లోనే భోజన సౌకర్యం కల్పించటం, అడుగడుగునా మంచి చెడులు పర్యవేక్షించి సరిజేయటం.... ఈ విధంగా మహాసభలు తమవిగా భావించటంతో ఎన్నో అడ్డంకులు తొలగి, వేలాది ప్రతినిధులు నిర్దిష్ఠకాలంలో భోజనాలు ముగించుకొని సభల్లో పాల్గొనటానికి వీలయింది.

## మహా ప్రవాహంలా ప్రతినిధులు

నేల యీనిందా అన్నట్టు 15వ తేదీ ఉదయానికే రైళ్ళల్లో, బస్సుల్లో ప్రతినిధుల రాక ప్రారంభమయింది. ఒక్కో జిల్లా ప్రతినిధులు తమ తమ బ్యానర్లతో నినాదాలు చేసుకొంటూ సభా స్థలికి రావటంతో పట్టణ వాతావరణం కోలాహలంగా మారిపోయింది. దానికి తగినట్టు పట్టణ కూడళ్ళలన్నీ స్వాగతం చెప్పే బ్యానర్లతో రంగు కాగితాల తోరణాలతో అతిథుల్ని ఆహ్వానించాయి. అల్లూరి సీతారామరాజు, కందుకూరి, గురజాడల పేరిట మహా సభాంగణంలో ఏర్పరచిన ముఖద్వారాలు ఆశయోత్సాహాన్ని చాటుతూ ఆవరణకే వన్నె తెచ్చాయి. మహబూబ్‌నగర్, అనంతపురం, నల్గొండ మొ॥ జిల్లాల నుండి స్పెషల్ బస్సుల్లో జయ జయ ధ్వానాలు చేస్తూ ఎంతో దీక్షతో ప్రతినిధులు రావటం జరిగింది. ఆ విధంగా 16వ తేదీ తెల్లవారే సరికి భీమవరం పట్టణమే ఉపాధ్యాయ పట్టణంగా మారిపోయింది.

## మహాసభల ప్రారంభం

జిల్లా ఉద్యమ నిర్మాత, సీనియర్ కార్యకర్త, రాష్ట్రశాఖ ఉపాధ్యక్షులయిన శ్రీ పి.వి. సుబ్బరాజు ఉద్యమ పతాకాన్ని, భీమవరం మునిసిపల్ కమీషనర్ శ్రీ యస్. కృష్ణమూర్తినాయుడు



జాతీయపతాకాన్ని ఆవిష్కరించటంతో మొదటిరోజు సభాకార్యక్రమం ప్రారంభమయింది. పతాకవందన సందర్భాన ఉద్యమ, జాతీయ గేయాలు ఉత్తేజకరంగా పాడబడినవి. వేలాది ప్రతినిధులు



ఉద్యమ పతాక ఆవిష్కరణ, సందేశమిస్తున్న
శ్రీ పి. వి. సుబ్బరాజు, ఉపాధ్యక్షుడు, రాష్ట్ర శాఖ.

పతాకాభివందనంచేసి, యు టి యఫ్. జిందాబాద్!' అంటూ ఉచ్చై స్వరంతో నినదించి ప్రారంభ నగారా ప్రయోగించారు. అమరులైన కార్యకర్తలకు జోహార్లు పలికారు.

చెన్నుపాటి ఫొటోతో, యు. టి. యఫ్. బ్యానర్లతో కళకళ లాడే వేదికపైకి, రాష్ట్రశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ ఏ. వెంకట స్వామి అతిథుల్ని ఆహ్వానించి సభకు పరిచయం చేశారు. ప్రారంభ సభకు రాష్ట్ర అధ్యక్షుడు శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించారు. దేశభక్తి గేయాలతో, ఉద్యమ గేయాలతో, స్వాగతగేయాలతో సభ ప్రారంభింపబడింది. ఈ మధ్యకాలంలో మరణించిన ప్రముఖులకు ఉద్యమ కార్యకర్తలకు సంతాప సానుభూతులు తెల్పుతూ సభ మౌనం పాటించి, శ్రద్ధాంజలి ఘటించింది.

## జాతి నిర్మాతలుగా అధ్యాపకులు

మొదట ఆహ్వాన సంఘ అధ్యక్షుడు శ్రీ ఐ కె.డి.వి. సత్యనారాయణరాజు (కనకరాజు) ప్రతినిధులకు స్వాగతం చెప్తూ, ఉపాధ్యాయులు జాతి నిర్మాతలుగా మరింత కర్తవ్యనిష్ఠ ప్రదర్శించా'లని ఉద్బోధించారు.

శ్రీ డి. రామిరెడ్డి తమ తొలిపలుకుల్లో 'విద్యారంగ పరిస్థితిని మహాసభల లక్ష్యాన్ని వివరించి, పౌరహక్కుల రక్షణకు, అధికధరల నిరోధానికి, శాస్త్రీయ వేతన విధానం అమలుకు, నిరక్షరాస్యతా నిర్మూలనకు ఇతర ఉద్యోగ సంఘాలతో, ప్రజా సంఘాలతో కలసి పోరాడాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పారు.

ఉన్నత విద్యాశాఖా డైరెక్టర్ శ్రీ వి. రామచంద్రన్ సభను ప్రారంభిస్తూ విద్య సఫలంకావాలంటే విద్యారంగానికిచెందినవారంతా




మహాసభల్ని ప్రారంభిస్తున్న శ్రీ వి. రామచంద్రన్
ఉన్నత విద్యాశాఖా డైరెక్టర్

విద్యార్థులు.... ఉపాధ్యాయులు.... తలిదండ్రులు.... ప్రభుత్వం అంతా సహకరించాలన్నారు. జాతీయ జీవనంలో ఉపాధ్యాయునికి ప్రముఖపాత్ర ఉన్నదన్నారు. బాలబాలికల విద్యాభ్యాసానికి నర్సరీ విద్య పునాది అనీ, దానికి తగు ప్రాముఖ్యత ఇవ్వాలని సూచించారు. విద్యా ప్రమాణాల పెంపుదలకోసం, పాఠశాలల్లో కనీస సౌకర్యాల కల్పనకోసం ప్రభుత్వపరంగా కృషి జరుగుతున్నదన్నారు. కొఠారీ కమిషన్ సిఫార్సుల అమలుకు అన్ని వర్గాలవారి సహకారం అవసరమని, ఈ మహాసభల నిర్ణయాలు దానికి తోడ్పడాలని కోరారు. విద్య అనేది తరగతి గదుల్లోనే కాకుండా బాహ్యప్రపంచంలో నేర్చుకొనేదిగా ఉంటుందనీ సమాజ ప్రభావం విద్యార్థులపై కూడా పడుతుందనీ, క్రమశిక్షణ కాపాడటం ఉపాధ్యాయుల ఒక్కరి పైననే లేదనీ, తల్లిదండ్రులు సమాజం కూడా శ్రద్ధవహిస్తేనే అది సాధ్యపడుతుందనీ, పాఠ్యేతరాంశాలైన ఆటపాటలు, కళానైపుణ్యం, వారివారి ప్రత్యేకాభిరుచులకు విద్యావిధానంలో తగు ప్రాముఖ్యత ఉండాలనీ ఉద్ఘాటించారు. కొన్ని దేశాల్లో విద్యార్థులు చాలినంతమంది లేక విద్యాలయాలు మూతబడుతుంటే మనదేశంలో చదువుకోదల్చిన బాలబాలికలకు కనీసవసతులుకూడా కల్పించలేక పోతున్నామని విచారం వ్యక్తం చేశారు. ఏదిఏమైనా కొఠారి కమిషన్ నివేదిక విద్యారంగంలో తేదల్చిన మార్పులకు కరదీపిక వంటిదని, దాని వెలుగులో విద్యాభివృద్ధి సాధించాలని ఉద్బోధించారు.

## ప్రముఖుల సందేశాలు

పిదప ఆంధ్రప్రదేశ్ ప్రయివేటు కళాశాలల యజమానుల సంఘ ప్రధాన కార్యదర్శి డి.యన్.ఆర్. కాలేజికరస్పాండెంట్ అయిన శ్రీ జి.యస్. రామభద్రరాజు సందేశమిస్తూ, సిలబస్‌ను అవసరాలకనుగుణంగా మార్పు చేస్తూ ఉండాలని, ప్రస్తుతం రాష్ట్రంలో ఉపాధ్యాయుల శిక్షణపట్ల తగినంత శ్రద్ధ చూపడంలేదనీ, ప్రభుత్వం దానికి ప్రత్యేక డైరెక్టరేట్ ఏర్పాటు చేయాలని, యూనివర్శిటీలలో ఉపాధ్యాయ శిక్షణకు ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయటం అవసరమేమో పరిశీలించాలని సూచించారు. తమ కళాశాల ఆవరణలో పెద్దయెత్తున మహాసభలు జరుపుతున్నందుకు అభినందించారు.

రాష్ట్ర రైతు సంఘ అధ్యక్షులు శ్రీ ఉద్దరాజురామం సందేశమిస్తూ విద్యాభివృద్ధి, ఉపాధ్యాయుల సంక్షేమాల గురించి ప్రభుత్వం ఏమి చెప్పినా దేశంలో అక్షరాస్యులు 30 శాతం దాటలేదంటే సిగ్గు




సందేశమిస్తున్న శ్రీ ఉద్దరాజు రామం

పడాలన్నారు. విద్యారంగంలో ఏ మార్పు జరిగినా ప్రాథమిక విద్యాస్థాయినుండి క్రమపద్ధతిలో రావాలన్నారు. గ్రామాల్లోని వివిధ పాఠశాలల స్థితి దయనీయంగా ఉన్నదని ఆవేదనవ్యక్తం చేశారు. స్వాతంత్ర్యోద్యమంతో పాటు నినదించిన 'జాతీయ విద్యావిధానం' ఇంకా గగనకుసుమంగానే ఉన్నదనీ, 34 ఏళ్ళ స్వాతంత్ర్య కాలంలో కూడా దాని రూపురేఖలు అస్పష్టంగా ఉన్నాయన్నారు. ఏదిఏమైనా జాతి నిర్మాతలుగా ఉపాధ్యాయవర్గం తమ గురుతర బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించాలనీ, అవిధంగా ప్రజా విశ్వాసం పొందితేనే ఉద్యమపరంగా కూడా అండదండలు లభిస్తాయని కర్తవ్యప్రబోధం చేశారు.

—

పిదప శ్రీ డి. శివరామరాజు (ఉపాధ్యాయ యం.యల్.సి.) శ్రీ పి. శ్రీరామమూర్తి (ఫెఫ్టో చైర్మన్) సందేశాలిస్తూ, విద్యాభివృద్ధికి సమస్యాపరిష్కారానికి ఉపాధ్యాయ ఉద్యమం మరింత సమైక్యంగా పురోగమించాలని, ఐక్య ఉద్యమాల్లో యు.టి.యఫ్. ప్రముఖపాత్ర నిర్వహిస్తున్నదనీ, మహాసభలు దిగ్విజయం కావాలని తమ శుభాకాంక్షల్ని తెలియజేశారు.

యస్.యఫ్.ఐ. రాష్ట్ర కార్యదర్శి శ్రీ వి. ఉమామహేశ్వర రావు సందేశమిస్తూ, ఉపాధ్యాయుల డిమాండ్లలో సగభాగంపైగా



సందేశమిస్తున్న శ్రీ వి. ఉమామహేశ్వరరావు (యస్.యఫ్.ఐ)

విద్యార్థుల డిమాండ్లు కూడా ఉన్నాయనీ, అరాచక ప్రవృత్తికీ, క్రమశిక్షణా రాహిత్యానికి నేటి వ్యవస్థే కారణమనీ, కుల, మత తత్వాలు ప్రేరేపించే పాఠ్యాంశాలు, వెలువడే చెత్త సాహిత్యం, బూతుపత్రికలు విద్యార్థుల్ని అపమార్గం పట్టిస్తున్నాయనీ, నిరుద్యోగ పెనుభూతం యువతరంలో నిరాశా నిస్పృహల్ని పెంచి అరాచకాన్ని, అస్తవ్యస్తస్థితినీ కల్గిస్తున్నదనీ, భవిష్యత్తును నిర్మించుకోవటానికి విద్యార్థులు జరిపే పోరాటాలపైన ప్రభుత్వం తన వర్గప్రయోజనాలు కాపాడుకోవటానికి నిర్బంధాల్ని ప్రవేశపెడుతున్నదనీ, రహస్య సర్క్యులర్లు జారీ చేస్తున్నదనీ, ఉపాధ్యాయ ఉద్యమం విద్యార్థి ఉద్యమం పరస్పరం తోడ్పాటు నందించుకొంటూ ముందుకుపోవాలనీ ఉద్బోధించారు.

ఆ తరువాత మహాసభల నిర్వహణకు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి ప్రతిపాదించిన యీ క్రింది కమిటీలు ఏకగ్రీవంగా ఆమోదింపబడ్డాయి.

అధ్యక్షవర్గం :— సర్వశ్రీ డి. రామిరెడ్డి, కె. నారాయణరావు, యస్. సీతారామాచారి, జి. లక్ష్మయ్య, కె. రాఘవరాజు.

సారధ్య సంఘం :— సర్వశ్రీ ఎ. వెంకటస్వామి, యం. వెంకటరత్నం, యం. నరహరి, వి. సూర్యనారాయణరాజు, యస్. ఆర్. పోలిశెట్టి.

అర్హతల కమిటీ : సర్వశ్రీ టి. అంజిరెడ్డి, వి. యల్. నరసింహారావు, యస్. విజయకుమార్. పి. కృష్ణమూర్తి, సి. హెచ్. లక్ష్మినారాయణ.

## ప్రతినిధులసభ

ఆ తర్వాత శ్రీ యస్. సీతారామాచారి అధ్యక్షతన జరిగిన ప్రతినిధుల సభను శ్రీ డి. శివరామరాజు ప్రారంభిస్తూ, స్వాతంత్ర్యం వచ్చి 34 సంవత్సరాలయినా విద్యావిధానంలో మౌలిక మార్పు జరుగలేదనీ, మంత్రులు మారినపుడల్లా పనికిమాలిన ఏదో ఒక మార్పు ప్రవేశపెడుతున్నారనీ, కమిటీలు వేయటం, రిపోర్టులు ఇవ్వటం, వాటిని అమలు జరుపకపోవటం మామూలయిందనీ, విద్యార్థుల సంఖ్యకు అనుగుణంగా ఉపాధ్యాయ నియామకం జరిపాలనీ, దానికి ఈ మహాసభల్లో తగు కార్యక్రమం రూపొందించి ముందుకు పోవాలన్నారు.

ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి సంఘకార్యకలాపాల నివేదిక ప్రవేశపెడుతూ యు. టి. యఫ్. రాష్ట్రవ్యాప్తంగా దాదాపు నలభై వేల సభ్యత్వంతో, నిత్య కార్యక్రమాలతో సజీవ సంస్థగా పురోగమిస్తున్నదనీ, ప్రతి పరీక్ష సమయంలోనూ పీడితో



రిపోర్టు ప్రవేశపెడుతున్న
శ్రీ ఎ. వెంకటస్వామి, ప్రధాన కార్యదర్శి (యు. టి. యఫ్)

పాధ్యాయుల పక్షాన నిలబడి పోరాడుతున్నదనీ, కార్యకర్తల నిరంతర దీక్ష.... నిర్మాణ పటిష్ఠత, త్యాగనిరతి, ఆశయోత్సాహం, సూత్రబద్ధ వైఖరీ సంఘ పంచ ప్రాణాలనీ, బలహీనతల్ని అధిగమించి అన్ని శాఖలూ పురోగమించి సమైక్య ఉద్యమాన్ని మరింత పటిష్ఠంగా రూపొందించాలనీ అన్నారు.

ఐక్యఉపాధ్యాయ ప్రధాన సంపాదకుడు శ్రీ మైనేని వెంకటరత్నం పత్రికా నివేదిక సమర్పిస్తూ పాఠకుల అపారఆదరణ, కార్యకర్తల నిర్విరామకృషి ఫలితంగా పత్రిక సర్క్యులేషన్ 11 వేలకు వృద్ధి అయిందనీ, ప్రత్యేకించి జీవిత చందాలు 2500 పూర్తిగా వస్తున్నవనీ, సంవత్సరాంతానికి ఆసంఖ్య మూడువేలకు పెరుగుతుందనీ వివరించి, పత్రికాభివృద్ధికి తోడ్పడిన వారందరికీ జేజేలు పలికారు.



వస్తు ప్రదర్శన ప్రారంభిస్తున్న
శ్రీ టి. రామచంద్రరావు డి. ఇ. ఓ

మధ్యాహ్నం వస్తు ప్రదర్శనను జిల్లా విద్యాశాఖాధికారి
శ్రీ టి. రామచంద్రరావు ప్రారంభించారు. ఆ ప్రద
ర్శనలో రకరకాల టీచింగ్ ఎయిడ్స్, విజ్ఞాన సాంఘిక శాస్త్రాలకు
చెందిన ఛార్టులు, ప్రయోగాలు, గణిత బోధనకుపయోగించే సులభ
పద్ధతులు, వివిధ ప్రముఖుల జీవితచిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. ఆ
విధంగా ఆ ప్రదర్శనలో ఉపాధ్యాయుల మేధోశక్తి నిరూపితం
చేస్తూ శ్రీ డి. నాగమల్లేశ్వరరావు, శ్రీసత్యనారాయణరాజు (లెక్చరర్
డి.యన్ ఆర్. కాలేజి) ఆధ్వర్యం వహించి ఆకర్షణీయంగా రూపొం

ించారు. వేలాది ప్రతినిధులు, విద్యాభిమానులు దానిని దర్శించటం జరిగింది.

ఆ తర్వాత జరిగిన ప్రతినిధులసభలో శ్రీ యన్. సీతారామాచారి నిబంధనావళిసవరణలను, శ్రీ వి. సూర్యనారాయణరాజు పాలసీ స్టేట్‌మెంట్ సవరణల్ని ప్రతిపాదించారు

## విద్యాగోష్ఠి

సాయంత్రం జరిగిన విద్యాగోష్ఠికి శ్రీ యం. జె. మాణిక్యారావు (ఉపాధ్యాయ యం. యల్. సి.) అధ్యక్షత వహి౦చి సంక్షోభంలో ఉన్న విద్యారంగాన్ని, దాని పరిష్కారమార్గాన్ని ప్రతినిధుల దృష్టికి తెచ్చారు. నిరుద్యోగం పెట్టుబడిదారుల బిడ్డ అనీ, ఒకేషనలైజేషన్ ప్రవేశపెట్టినంతమాత్రాన ఆ సమస్య తీరదనీ, దోపిడీ వ్యవస్థపోయి సోషలిస్టువ్యవస్థ వచ్చినప్పుడే అందరికీ విద్య, అందరికీ పని లభిస్తుందంటూ, ఇటీవలి తమ హంగరీ పర్యటన అనుభవాల్ని తెల్పారు.




విద్యాగోష్ఠిలో అధ్యక్షోపన్యాసమిస్తున్న
శ్రీ యం. జె. మాణిక్యారావు. (యమ్. ఎల్. సి)

కేరళ ప్రతినిధి వర్గ నాయకుడూ నలభై వేల సభ్యత్వానికి ప్రాతినిధ్యం వహించే 'కేరళ గవర్నమెంటు టీచర్స్ అసోసియేషన్ (కె.జి.టి.ఎ.) అధ్యక్షుడు అయిన శ్రీ దేవదాసు గోష్ఠిని ప్రారంభిస్తూ, తమ రాష్ట్రంలో ప్రయివేటు విద్యాసంస్థలకు చెందిన సంఘం



విద్యాగోష్ఠిని ప్రారంభిస్తున్న
శ్రీ దేవదాసు అధ్యక్షుడు కె. జి. టి. ఎ. కేరళ.

తో కూడ భుజం భుజం కలిపి పోరాటం సాగిస్తున్నామనీ, లక్షా పాతికవేల మంది యీ సంఘాల వెనుక సమీకరింపబడ్డారనీ, ప్రజా సంఘాలతో, ఉద్యోగ సంఘాలతో తమకు సమన్వయం ఉన్నదనీ; నిరక్షరాస్యతా నిర్మూలనకు, జాతి జీవితంలో మౌలిక మార్పులుతెచ్చి కొత్త వెలుగులు నింపటానికి దారిద్ర్యం, ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదల, అర్థనెన్ను, నిర్బంధాలవంటి సమస్యల పై దేశవ్యాప్తంగా అంతా కలిసి పోరాడాలని ఉద్బోధిస్తూ, కేరళ రాష్ట్ర ఉపాధ్యాయ వర్గం పక్షాన తమ హార్దిక శుభాకాంక్షల్ని అ౦దించారు.

పిదప డా॥ ఎ. పి. విఠల్ 'సోషలిస్టు దేశాలు—బాలలు' అనే అంశంపై ప్రసంగిస్తూ 'పిల్లలంటే పువ్వులనీ—ఆ పువ్వుల్నీ—భావి సౌభాగ్య చిహ్నాల్ని మనం సోషలిస్టు దేశాల్లోనే చూస్తామని వివిధ ఉదాహరణలలో వివరించారు సోషలిజం ఆదర్శంగా చెప్పుకొంటున్న మనదేశంలో బిడ్డల దీన పరిస్థితిని సభికుల దృష్టికి తెచ్చారు, ఆదర్శకుటుంబాలూ—మాతృమూర్తులూ— ముఖ్యంగా స్త్రీ పురుష




విద్యాగోష్ఠిలో ప్రసంగిస్తున్న డా॥ ఎ. పి. విఠల్

సమానత్వము— దోపిడీలేని సామాజిక స్థితి కళ్ళకు కట్టినట్టు ప్రత్యక్ష కథలా చెప్తూఉంటే —ప్రతినిధులు తాము కూడా సోషలిస్టు దేశాల్లో పర్యటిస్తున్న అనుభూతి పొందారు. జేబుదొంగలుగా—బికారులుగా— ఏ పోషణా, ఆదరణా లేక దీనావస్థలో ఉన్న మన పిల్లలకీ —సోషలిస్టు దేశాల పిల్లలకీ ఉన్న తేడాని అతి స్పష్టంగా ప్రతినిధులు గుర్తించటం జరిగింది. వ్యంగ్యాత్మక విమర్శ, హాస్యం మేళవించిన ధోరణిలో సాగిన శ్రీ విఠల్ ప్రసంగం సభికుల్ని ఎంత ఆకర్షి౦చిందో— తన్మయంలో ముంచి౦దో—హృదయాలు కదిలించి చెరగని ముద్రల్ని వేసిందో—అడుగడుగునా సాగిన హర్షధ్వానాలు సాక్ష్యాలుగా పలువురిని ఆకర్షి౦చటం జరిగింది.

తరువాత శ్రీ ఫి. శ్రీరామ్మూర్తి (ఫేప్టో చైర్మన్) 'విద్య-ఆర్థిక విధానం' అనే అంశంపై ప్రసంగిస్తూ 'మానవుని అభ్యుదయ ప్రయాణంలో బానిస విముక్తి ప్రధాన ఘట్టమనీ, విదేశీ, స్వదేశీ ప్రభుత్వాల దోపిడీ విధానం రూపుమాపాలంటే ప్రపంచ మానవుల సంఘీభావం మరింత ముందుకు సాగాలనీ, చైనా రష్యాల అధ్వ




విద్యాగోష్ఠిలో ఉపన్యసిస్తున్న
శ్రీ పి. శ్రీరామమూర్తి, ఫేప్టో చైర్మన్

ర్యంలో అనేక సోషలిస్టు దేశాలు మౌలిక మార్పుల్ని తెచ్చి ప్రజా జీవనం సుఖవంతంగా తీర్చిదిద్దుతున్నాయంటూ, పెట్టుబడిదారీ దేశాల్లో పెరిగే నిరుద్యోగాన్నీ, జాతి వివక్షతకు చెందిన ఘర్షణల్ని సభికుల దృష్టికి తెచ్చారు.

వలస వ్యవస్థనుంచి విముక్తి చెందిన భారతదేశ పరిస్థితిని వివరించి జాతీయోత్పత్తి అభివృద్ధికి దోహదంచేసే విధంగా విద్యా విధానం అమలుపరిస్తేనే ప్రయోజనకర మవుతుందన్నారు.

కాని అంతమాత్రంతోనే దేశ సమస్యలల్నీ పరిష్కారం కావనీ, కీలకమైన ఆర్థిక, సామాజిక మార్పులకోసం మనం పోరాడాలనీ, ప్రస్తుత ఆర్థికస్థితినీ, ప్రభుత్వ వైఫల్యాన్నీ వివరించి, దానిని సరిజేయటంకోసం కార్మికవర్గంతో కలిసి ఉపాధ్యాయ, ఉద్యోగ వర్గాలు సుసంఘటిత ఉద్యమాలు నడపాలని ఉద్బోధించారు.




విద్యాగోష్ఠిలో ఉపన్యసిస్తున్న
డా॥ యం. రామారావు

తరువాత డా॥ రామారావు (ప్రజా వైద్యశాల, విజయవాడ) 'హెల్త్ ఎడ్యుకేషన్' అనే అంశంపై ప్రసంగిస్తూ– విద్య అయినా, వైద్యం అయినా దేశ ఆర్థిక, సామాజిక పరిస్థితులతో ముడిపడి ఉన్నదనీ, శాస్త్రీయ అవగాహనలేక మూఢాచారాల్లో దుర్భరదారిద్ర్యంతో, జనారోగ్య పరిస్థితుల్లో, విద్యా, వైద్యసదుపాయాలు అందుబాటులో లేని ప్రస్తుత పరిస్థితి మార్పుకోసం మేధావివర్గాలు తీవ్రంగా ప్రయత్నించాలన్నారు. పోషకాహారం అందించనిదే బిడ్డల అభివృద్ధి, స్థాయి పెంపుదల జరగటం అసంభవమన్నారు చదువుకోవాలనే ఆకాంక్ష ఉన్నా భౌతిక, దైహిక పరిస్థితులు అడ్డం వస్తున్నాయనీ.... అందుకనే మధ్యలో చదువు మానుకొనేవారి సంఖ్య పెరుగుతున్నదన్నారు. పీడిత ప్రజల అండదండల్తో ఉద్యమాలు ముందుకు పోవటం ప్రస్తుత కర్తవ్యమన్నారు.

## సాంస్కృతిక ప్రదర్శనలు

ఆ రాత్రి జరిగిన సాంస్కృతిక ప్రదర్శనల్ని శ్రీ పి పాండు రంగారావు (ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్, ఆలిండియా రేడియో, విజయ వాడ) ప్రారంభిస్తూ, 'కళలు సాంఘిక చైతన్యాన్ని పెంచేవిగా ఉండాలని, ఆధునిక యుగంలో ప్రచార సాధనాలైన పత్రికల్ని, రేడియోని విద్యాభివృద్ధికి బాగా ఉపయోగించుకోవాలని, కాని వేలాదిధనం ఖర్చు పెట్టి రూపొందించిన 'పాఠశాలల కార్యక్రమాన్ని' చాలా కొద్ది పాఠశాలలే వినియోగించుకొంటున్నవనీ, దానికి మీ ఉద్యమం సహకరించాలనీ విజ్ఞప్తి చేశారు.




వైజ్ఞానిక ప్రదర్శనలకు అధ్యక్షత వహించిన
శ్రీ డి. ధైర్యానందం, ప్రారంభిస్తున్న శ్రీ పి. పాండురంగారావు

అధ్యక్షత వహించిన శ్రీ డి. ధైర్యానందం (కార్యదర్శి, ఆంధ్ర ప్రజానాట్యమండలి) ప్రసంగిస్తూ మూఢాచారాలకు, దోపిడీకి వ్యతిరేకంగా తమతమ రచనలద్వారా, కళాప్రదర్శనలద్వారా భావి తరాన్ని ఉపాధ్యాయులు రూపొందించాలని ఉద్బోధించారు.

జానపదగేయాలు, వివిధకళాప్రదర్శనలు, అల్లూరిసీతారామరాజు బుర్రకథ రాత్రి ప్రొద్దుపోయేదాకా సభికుల్ని అలరించి చైతన్య పరిచాయి.

ప్రయాణబడలిక ఉన్నా, వానవచ్చి కొద్దిసేపు చీకాకు పరిచినా వేలాది ప్రతినిధులు నివేదికలు, ప్రసంగాలు తదేకంగా విని, వస్తు వైజ్ఞానిక ప్రదర్శనల్ని సందర్శించి మొదటిరోజు సభాకార్యక్రమాన్ని దిగ్విజయం చేశారు.

## చర్చలు–ఆమోదం

రెండవ రోజు శ్రీ జి. లక్ష్మయ్య అధ్యక్షతన ప్రతినిధుల సభ ప్రారంభమయింది. నివేదికలపై చర్చలలో పలువురు పాల్గొని సంఘాభివృద్ధికి, పత్రికాభివృద్ధికి, ఉద్యమ పటిష్టతకు తగు సూచనలు చేశారు. ప్రధాన కార్యదర్శి సమాధానానంతరం నివేదికలన్నీ ఆమోదింపబడ్డాయి.



ఎడ్యుకేషనల్ సింపోజియంకు అధ్యక్షత వహించిన
శ్రీ యం. మాధవరావు (M.L.C.)

## ఎడ్యుకేషనల్ సింపోజియం

పిదప శ్రీ యం. మాధవరావు (యం. యల్. సి.) అధ్యక్షతన 'ఎడ్యుకేషనల్ సింపోజియం' ప్రారంభమయింది. అధ్యక్షులు తమ తొలిపలుకులలో విద్యారంగం రోగిష్ఠిగా మారిందనీ, శస్త్రచికిత్స చేస్తేతప్ప ఆ జబ్బు నయంకాదనీ, దానికి ఈ విద్యాగోష్ఠి, మహాసభలూ తోడ్పడాలని తన ఆశాభావాన్ని వెల్లడించారు.




ఎడ్యుకేషనల్ సింపోజియం ప్రారంభిస్తున్న
శ్రీ టి. వెంకారెడ్డి

జాయింట్ డైరెక్టర్ శ్రీ వెంకారెడ్డి 'పరీక్షలు–మార్పులు' అన్న అంశంపై మాట్లాడుతూ, ఉపాధ్యాయులకు ఇన్సర్ వీస్ ట్రైనింగ్ కోర్సుల వంటివి నిర్వహించాలనీ, విద్యావిధానంలో మార్పులు తేవాలనే దృష్టితో నూతన సిలబస్ ప్రవేశ పెట్టామనీ, పాఠ్యపుస్తకాలు యీ నెలాఖరులోగా అందించగలమనీ, మారుతున్న కాలంతో మనమూ మారాలనీ, 6, 7 తరగతుల సిలబస్‌లో చేసిన మార్పులు సరియైనవేననీ, 1947 నాటి విద్యార్థికన్నా, నేటి విద్యార్థి ఎంతో విషయ పరిజ్ఞానంగలవాడని చెపుతూ ఉపాధ్యాయవర్గం సంస్కరణల అమలుకై సెహకరించాలని కోరారు. పాఠ్యగ్రంథాల సంగతి ఎత్తగానే కొందరు ప్రతినిధులు లేచి, పాఠశాలలు తెరిచి మూడునెలలైనా పుస్తకాలు అందించకపోతే చదువు చెప్పటం ఎలాగనీ, వచ్చిన పుస్తకాలు కూడా నల్ల బజారులో అధిక రేట్లకు అమ్ముతున్నారనీ, వివరాలు తెల్పి తమ ఆవేదన వ్యక్తంచేశారు.




ఎడ్యుకేషనల్ సింపోజియంలో ఉపన్యసిస్తున్న
డా॥ వై. రాధాకృష్ణమూర్తి

డా॥ వై. రాధాకృష్ణమూర్తి 'మేధావులు–రాజకీయాలు' అనే అంశంపై చేసిన సుదీర్ఘప్రసంగం ప్రతినిధుల్ని ఎంతో చైతన్యపరిచి ఆలోచనాపరుల్ని చేసింది. మంద్రగంభీరస్వరంతో .... ఉద్వేగ భరితంగా.... ప్రసంగిస్తూ చివరికి కుక్షింభర రాజకీయవేత్తల కలుషిత హస్తాల్లో శేకు దేశం నలిగిపోతున్నదనీ, పదవీ వ్యామోహం.... పైసలకోసం దాహం.... సంకిలాలసత మనరాజ్యాన్ని ఏలుతున్నవనీ దానికి సాక్ష్యం మాజీఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యంఇటీవలి ప్రసంగమేనని, భావితరాలను రూపొందించే మీరు నిర్భయంగా నిలబడి మంచి కోసం పోరాడాలనీ ఉద్బోధించారు.

డా॥ సి. హెచ్. సత్యనారాయణ 'సమాజానికి ఉపయోగపడే విద్య' అనే అంశంపై ప్రసంగిస్తూ విద్యావిధానంలో మౌలిక




ఎడ్యుకేషనల్ సింపోజియంలో ఉపన్యసిస్తున్న
డా॥ పి. డి. సత్యనారాయణ

మార్పులు రావాలనీ, ప్రభుత్వం ఏకపక్షంగా కాకుండా, విద్యారంగానికి చెందిన వారందరితో చర్చించి మార్పుల్ని ప్రవేశపెట్టాలని అన్నారు. ఆరోగ్యశాస్త్రం, లైంగికశాస్త్రం, కుటుంబ నియంత్రణలకు చెందిన పాఠ్యాంశాలు పాఠ్యప్రణాళికలో చేర్చాల్సిన అవసరం ఉందని సూచించారు. క్రమబద్ధ పురోగతిని ఉదాహరణలతో వివరించారు.

## సారస్వత సభ

ఆ మధ్యాహ్నం జరిగిన సారస్వతసభకు శ్రీ మైనేని వెంకటరత్నం అధ్యక్షత వహించారు శ్రీ ఎ. శ్యామసుందరరావు (ఫ్యాప్టో




సారస్వతసభకు అధ్యక్షత వహించిన
శ్రీ మైనేని

శక్రటరీ జనరల్ ) ఆ సభను ప్రారంభిస్తూ ఉపాధ్యాయుడుగా తాను ఆశిసున్న సాహిత్యపరమైనమార్పుల్ని వివరించారు. పాఠ్యగ్రంథాల్లో రూపొందించే భాషవిషయంలో విప్లవాత్మకధోరణి అవసరమన్నారు. భావ విప్లవం, భాషావిప్లవం కూడా ఉద్యమాలలో భాగంగా ఉండాలన్నారు.




సారస్వత సభను ప్రారంభిస్తున్న
శ్రీ ఎ. శ్యామసుందరరావు (M.L.C.)
ఫ్యాప్టో జనరల్ శక్రటరీ

అధ్యక్షుడు నవలా సాహిత్యంపై శ్రీ వి. వి. పంపనవ్యాసాన్ని సభకు వినిపించారు. దానిలో వైరితలను వేసున్న ఇటీవలి నవలల స్వరూప స్వభావాల్ని, అవిచూపే అర్థదారుల్ని నిశితంగా విమర్శిస్తూ, ఆణిముత్యాల్లా మిణుకుమిణుకుమనే కొన్ని నవలల్ని శ్రీ పి. వి. ప్రస్తుతించారు.

సారస్వతసభలో ఉపన్యసిస్తున్న
శ్రీ యం. నరహరి

శ్రీ యం. నరహరి (రాష్ట్ర కార్యదర్శి) 'సాహిత్యం–ప్రయోజనం' అనే అంశంపై ప్రసంగిస్తూ సమాజ వ్యవస్థకు ప్రతిబింబంగా సాహిత్యం ఉంటుందనీ, పాలకవర్గాల ప్రయోజనాల్ని కాపాడే రచనలు ఆయా కాలాల్లో వెలువడ్డాయనీ, ఆయాకాలాలకు అనుగుణంగా అప్పటి రచనల్ని మనం విశ్లేషించాలనీ, నాటి తల మేలుకలయికల్ని మనం అర్థం చేసుకోవాలనీ, సాహిత్యం సాంఘిక ప్రయోజనాన్ని, సామాజిక స్పృహని రేకెత్తించేదిగా ఉండాలని వివిధ ఉదాహరణలతో సుదీర్ఘ ప్రసంగం చేశారు.

వివిధ రచనల్లోని ఘట్టాల్ని ఆయన సోదాహరణంగా.... రసవంతంగా వివరించి.... యు. టి. యఫ్. కార్యకర్తల సాహితీప్రియత్వాన్ని, పాండితీ ప్రతిభల స్థాయినీ వేలాది ప్రతినిధుల హర్షధ్వానాలమధ్య గుర్తింపజేశారు. సమాజానికి ఉపయోగపడే సాహితీ ప్రక్రియల్లో 'ఐక్య ఉపాధ్యాయ' ఎలా రూపొందుతున్నదీ.... తద్వారా వందలాది రచయితలకు ఎలా ప్రోత్సాహం లభిస్తున్నదీ అధ్యక్షుడు తమ తుదిపలుకుల్లో తెల్పి, ఆయా రచయితలకు అభినందనలు తెల్పారు.

తర్వాత 'మహిళలు–సాహిత్యం' అనే అంశంపై శ్రీమతి డి. కమలావిశ్వనాథ్ ప్రసంగించారు.

సారస్వతసభలో ఉపన్యసిస్తున్న
శ్రీమతి డి. కమలావిశ్వనాథ్

మాక్సింగోర్కీ రచనల్ని 'నగరం' పేరుతో శ్రీ కె. కేశవరెడ్డి తెనిగించిన గ్రంథాన్ని ప్రధాన కార్యదర్శి శ్రీ వెంకటస్వామి ఐక్యఉపాధ్యాయ ప్రచురణల కానుకగా ఆవిష్కరించారు. ఆ సందర్భాన శ్రీ కేశవరెడ్డి మాట్లాడుతూ గోర్కీ రచనలలోని ఉత్కృష్టతను వివరించి, మంచిపుస్తకాలను చదవాల్సిన అవసరాన్ని తెల్పారు. నేడు వస్తున్న చెత్తపుస్తకాలు కుళ్ళు సమాజానికి ప్రతిబింబంగా వున్నాయని, యువతరాన్ని అపమార్గానికి మళ్ళిస్తున్నాయనీ వివరించి చదువూ–సాహిత్యం వ్యాపార సాధనాలుగామార్చే దోపిడీ వ్యవస్థను నిరసించారు

## ఉత్సాహవంతమైన ఊరేగింపు

ఆ సాయంత్రం పదివేలమందితో జరిగిన ఊరేగింపు పట్టణ ప్రజల్లో విపరీత సంచలనం తెచ్చింది. మేడల మీద, వాకిళ్ళలోను, ఆఫీసులముందు, రోడ్డుకిరువైపుల వేలాది ప్రజలు నిలబడి ఆ ఊరేగింపును ఉత్సుకతతో చూస్తూ సంభ్రమాశ్చర్యాలు వెల్లడించారు.

చదువూ–సంధ్యా కావాలంటే.... పోరాటం.... పోరాటం!
పెరిగే ధరలు తగ్గాలంటే.... పోరాటం.... పోరాటం!
నిరుద్యోగం పోవాలంటే.... పోరాటం.... పోరాటం!

—అన్న ప్రజల జీవన సమస్యలకుచెందిన నినాదాలతో

బ్లాక్ బిల్లు—నశించాలి!
చీకటిరాజ్యం—పోవాలి!
ప్రజాస్వామ్యం—వర్ధిల్లాలి!

అన్న ప్రజాస్వామిక హక్కుల నినాదాలతో
ఉస్తాద్ సహీ తాలీం సహీ
దునియాకే ఉస్తాద్ ఏక్ హై!

లాంగ్‌లివ్ లాంగ్‌లివ్ [illegible] యూనిటీ లాంగ్‌లివ్ లాంగ్‌లివ్ యు.టి.యఫ్. లాంగ్‌లివ్ .... అంటూ తెలుగులో, హిందీలో, ఇంగ్లీషులో సాగే రకరకాల నినాదాలతో ఊరేగింపు చైతన్య ప్రవాహంలాసాగి ఎంతో ఉత్తేజాన్ని కలిగించింది. అటువంటి ఊరేగింపు భీమవరం పట్టణంలో కనీవినీ ఎరుగనిదని అభిజ్ఞులు వ్యాఖ్యానించారు.

వివిధ రాష్ట్రాల ప్రతినిధులు, రాష్ట్రస్థాయి కార్యకర్తలు ఊరేగింపు అగ్రభాగాన నడవగా, 23 జిల్లాల ప్రతినిధులు తమ తమ జిల్లాల బ్యానర్లు ప్రదర్శిస్తూ, వాటి వెనక నినాదాలిస్తూ క్రమబద్ధంగా, సైనికుల్లా సాగారు. ఉపాధ్యాయినులు రంగురంగుల వస్త్రాలతో, ఉత్తేజకర నినాదాలతో ఊరేగింపుకే కళ తెచ్చారు. కార్మికవాడలలో ఉపాధ్యాయుల–కార్మికుల ఐక్యత వర్ధిల్లాలని నినదించినపుడు అమా

## హైదరాబాదులో యు. టి. యఫ్. భవనం

రాజధానిలో రాష్ట్రవ్యాప్త కార్యకలాపాల నిర్వహణకు సబ్ ఆఫీస్ ఎంతో అవసరమని, అక్కడ యు. టి. యఫ్. భవనం నిర్మించాలని కార్యకర్తలు ఎన్నాళ్ళనుండో కోరుతున్నారనీ. ఖమ్మం మహాసభల ద్వారా విజయవాడలో కేంద్ర కార్యాలయాన్ని 'చెన్నుపాటి భవన్' పేరుతో నిర్మించుకొన్నామని, హైదరాబాదు యు.టి.యఫ్. భవనానికి యీ మహాసభలు ప్రాతిపదిక కావాలనీ, ప్రధాన కార్యదర్శి తీర్మానం ప్రవేశపెట్టగానే ప్రతినిధులు మిన్నుముట్టే హర్షధ్వానాలతో దానికి తమ ఆమోదాన్ని తెల్పటం జరిగింది.

విరాళాలకు పిలుపు ఇవ్వగా రు. 1031 లు అప్పటికప్పుడు కార్యకర్తలు అందించటం జరిగింది. మరో రెండు వేలు వాగ్దానాలు కూడా వచ్చాయి.

## నూతన రాష్ట్రకార్యవర్గ ఎన్నికలు

ఆ మధ్యాహ్నం శ్రీ కె. రాఘవరాజు పర్యవేక్షణలో నూతన కార్యవర్గ ఎన్నికలు జరిగాయి. రాష్ట్రశాఖ అధ్యక్షులుగా శ్రీ డి.రామి



8వ నూతన కౌన్సిల్‌కు అధ్యక్షత వహించిన
శ్రీ కె. రాఘవరాజు (అధ్యక్షుడు వ. గో జిల్లాశాఖ)

రెడ్డి, ప్రధానకార్యదర్శిగా శ్రీ ఎ. వెంకటస్వామి తిరిగి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 13 మందితో సబ్‌కమిటీని, 23 జిల్లాలకు చెందిన కార్యవర్గ సభ్యుల్ని, ముగ్గురితో ఆడిట్ కమిటీని, ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకుడుగా శ్రీ పైనేని వెంకటరత్నాన్ని, మరి నల్గురు ఉపసంపాదకుల్ని నూతన కౌన్సిల్ ఎన్నుకొన్నది.

## ముగింపు సభ

ఆ సాయంత్రం జరిగిన ముగింపు సభకు శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించగా, పశ్చిమబెంగాల్ ప్రాథమిక సెకండరీ విద్యా




ముగింపు సభకు అధ్యక్షత వహించిన
శ్రీ డి. రామిరెడ్డి (అధ్యక్షుడు రాష్ట్రశాఖ)



ముగింపు సభలో ఉపన్యసిస్తున్న
శ్రీ పార్థదే. అనువదిస్తున్న శ్రీ యం. నరహరి.

మంత్రి సమావేశాన్ని ప్రారంభించారు. బెంగాల్ రాష్ట్రంలో పేద ప్రజల సముద్ధరణకోసం విద్యారంగాన్ని ప్రజాతంత్రయుతం చేశామని, దానిలో భాగంగా పేద, దళిత వర్గాల పిల్లలకు ఒక పూట ఆహారాన్ని అందించే కార్యక్రమం తీసుకొన్నామని, పదవ తరగతిదాకా అందరికీ ఉచిత విద్య అందిస్తున్నామనీ తెల్పి, ప్రజలనుండి దానికి వచ్చిన ప్రోత్సాహన్ని వివరించారు.

స్థానిక శాసనసభ్యులు శ్రీ రామచంద్రరాజు, జిల్లాప్రజానాయకుడు శ్రీ అల్లూరి సత్యనారాయణ విద్యారంగంపై తమ అభిప్రా



శ్రీ అల్లూరి సత్యనారాయణ



స్థానిక శాసనసభ్యులు
శ్రీ రామచంద్రరాజు

యాన్ని తెల్పి, మహాసభ నిర్వాహకుల్ని అభినందించారు.

పిదప వ. గో. జిల్లాపరిషత్ డిప్యూటీ డెవలప్‌మెంట్ ఆఫీసరు శ్రీ ఆర్. వి. యస్. సూర్యనారాయణరాజు వత్రికా క్యాంపెయిన్లలో, సాంస్కృతిక ప్రదర్శనల్లో, వస్త్రప్రదర్శనల్లో విజేతలైన వారికి బహుమతి ప్రదానం చేశారు.

వ. గో. జిల్లా ప్రధాన కార్యదర్శి సభల్ని దిగ్విజయం చేసిన వారందరికీ అభినందనలు తెలిపారు. ఈ విధంగా పతాకావిష్కరణ మొదలు బహుమతి ప్రదానం దాకా మహాసభలు నూతనచైతన్యాన్ని అందిస్తూ దిగ్విజయమయ్యాయి.

## అపూర్వ సహకారం

ప్రజలతో ఇంతగా ఏకం కాగల్గుతున్న కారణంగానే వివిధ వర్గాలవారు మహాసభల దిగ్విజయానికి అహోరాత్రులూ కృషిచేశారు. వ్యవసాయ కార్మికులు, బట్టు కార్మికులు, ముఠాకార్మికులు, రైతులు యువజనులు, విద్యార్థులు దాదాపు 200మంది ప్రతినిధులకు భోజనాలు

ఏర్పాటు చేయటంలో చేసినకృషి చిరస్మరణీయమైనది. ఆ కార్మికుల్లో 50 మందికి పైగా ఫ్రీ బండకుం గమనార్హం. రోటరాక్ట్, లయన్స్, లియోక్లబ్‌లే కాకుండా ఉద్యోగులు, డాక్టర్లు, లాయర్లు వంటి ఉన్నత వర్గాలవారు కూడా యథోచితంగా తోడ్పడ్డారు. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ సత్యన్నారాయణరాజుగారు అనారోగ్యాన్నికూడా లెక్కచేయకుండా ఆ మూడు రోజులూ మహాసభలలో పాల్గొన్నారన్నా, కళాశాల



మహిళల భోజనశాల దృశ్యం



భోజనశాల దృశ్యం

యాజమాన్యం ముఖ్యఅతిథులకు భోజనాలు, వసతులు ఏర్పాటుచేయటమేగాక రు 3000/- విరాళంగాఇచ్చారన్నా మహాసభలువారినిఎంతగా కదిలించాయో అర్థంచేసుకోవచ్చు. అంతేగాకుండా శాసనమండలిలో ఉన్న ఉపాధ్యాయప్రతినిధుల్లోసగంమంది, సోదరసంఘాలనాయకులు ఈ మహాసభల్లో పాల్గొంటాన్నిబట్టి ఉపాధ్యాయుల్లో యు.టి యఫ్ కు గల స్థానం నిరూపితమయింది.

## అపార ఆదరణ

మహాసభలు జరిగిన మూడురోజులకు రాష్ట్ర విద్యాశాఖ డైరెక్టర్లు ఆన్‌డ్యూటీ సౌకర్యం కల్పించి సహకరించారు. ప్రత్యేకంగా ప. గో. జిల్లా విద్యాశాఖాధికారి జిల్లాలోగల, అన్ని పాఠశాలలను కాంపెన్‌సేటరీ శెలవు అవకాశం కల్పించారు. భీమవరంలోగల అన్ని కళాశాలలకు ఉన్నత విద్యాశాఖ డైరెక్టర్ శెలవులిస్తూ ప్రత్యేక ఉత్తర్వులిచ్చారు.

జిల్లాలో, ముఖ్యంగా భీమవరంతాలూకాలో ఎందరో విద్యాభిమానులు ఉదారంగా విరాళాలిచ్చారు. రైస్‌మిల్లర్స్ బియ్యం రూపంలోనూ, ధనరూపంలోనూ విరాళాలిచ్చి సహకరించారు. కొబ్బరికాయలు, అరటి ఆకులు, కూరగాయలు, పాలు, పెరుగు మొదలగు వస్తురూపేణా ఉభయ గోదావరి జిల్లాలనుండి విశేష సహకారం అందింది. అన్నిటికంటె మించి కార్యకర్తల త్యాగనిరతి, నిర్విరామ కృషి మహాసభల దిగ్విజయానికి విశేషంగా తోడ్పడింది.

ఐక్య ఉపాధ్యాయ

అంతేగాక, విజయవాడ ప్రజావైద్యశాల డాక్టర్ శ్రీ వెంకటరావు సభలు జరిగిన మూడురోజులు వైద్యసౌకర్యం అందించారు.

శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారి అధ్వర్యాన వివిధ ప్రజాసంఘాల కార్యకర్తలు రాత్రింబవళ్లు శ్రమించి భోజన సౌకర్యాలు కల్పించారు.

## మహాసభల ప్రత్యేకత

సభలలో కేవలం వృత్తి సంబంధమైన విషయాలపైననేగాక విద్యా గోష్ఠులద్వారా వివిధ విద్యా సమస్యల్ని చర్చించటం. వానికి చెందిన డాక్యుమెంట్లు అందించటం ఈ మహాసభల విశిష్టత. దానికనుగుణంగా 'ఈశ్వరీభాయి పటేల్ కమిటీ నివేదిక, భారతదేశంలో ఉపాధ్యాయుల స్థితిగతులు' అనే డాక్యుమెంట్లు ప్రతినిధులకు అందించబడ్డాయి.

హక్కుల్ని సాధించుకోవాలనీ, అదే సందర్భంలో బాధ్యతల్ని విస్మరించరాదనీ యీ మహాసభ అడుగడుగునా ప్రబోధించింది. మహాసభలోపాడిన దేశభక్తిగేయాలు, ఉద్యమ గేయాలు ప్రతినిధుల్ని ఉర్రూతలూగించినయ్.

చివరికి మహాసభలు ఇచ్చిన సందేశాన్ని రాష్ట్రం నలుమూలలా చాటాలనీ, ఉద్యమాన్ని మరింత పటిష్ఠం చేయాలనీ, సామాజిక శ్రేయస్సే తమ శ్రేయస్సనే నిర్ణయాలతో ప్రతినిధులు ఉత్తేజం పొందటం జరిగింది ఇవి 'అఖిల భారత మహాసభలా? అంటూ ఇతర రాష్ట్రాల ప్రతినిధివర్గాన్ని చూసిన ఓ హోటల్ యజమాని ఆశ్చర్యం వెళ్ళబుచ్చేంత ఘనంగా యీ మహాసభలు అన్ని వర్గాల ప్రజలపై తన ప్రభావాన్ని చాటాయి.

అంతేగాక ఆలిండియా రేడియో, విజయవాడ వారు రికార్డు చేసిన ప్రారంభ సమావేశాన్ని ఆగస్టు 17 సాయంత్రం, అలాగే శ్రీ మైనేని వెంకటరత్నం రికార్డుచేసినమహాసభల సమీక్షను 18సాయంత్రము ప్రసారంచేసి మహాసభల ప్రత్యేకతను దశదిశలా చాటారు.

అలాగే హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ప్రజాశక్తి, విశాలాంధ్ర, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక మొదలగు దినపత్రికలన్నీ ప్రముఖంగా శీర్షికలిచ్చి మహాసభల విశేషాల్ని, ప్రసంగాల్ని ప్రచురించాయి.

## అమోఘ భవిష్యత్తు

మూడు రోజులపాటు జరిగిన యీ మహాసభలు ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో మరో మైలు రాయిని సృష్టించడమేగాక ప్రజాతంత్ర ఉద్యమానికి, అదే విధంగా దేశవ్యాప్త ఉద్యమానికి కొండంత బలాన్నిచ్చాయి. తన కార్యక్రమాల ద్వారా సామాన్య ఉపాధ్యాయులకు అండగా నిలిస్తే, వారిలో విశ్వాసం కలిగిస్తే, వారు ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడతారనేది యీ మహాసభలో రుజువయింది. కార్యకర్తల నిర్విరామ కృషి, అపారదీక్ష, నిర్దిష్టమైన శాస్త్రీయ అవగాహన, విశ్వాసం, సూత్రబద్ధ వైఖరీ యు.టి యఫ్.కు అపార భవిష్యత్తును సృష్టించినయ్.

ఈవిధంగా విద్యాభిమానుల సహకారంతో, దాతల ఆదరణతో, కార్యకర్తల నిర్విరామకృషితో మూడురోజులపాటు జరిగిన ఈ మహాసభలు ఉపాధ్యాయ ఉద్యమచరిత్రలో గర్వింపదగిన సువర్ణాధ్యాయాన్ని చేర్చాయి. * * *



## వస్తుప్రదర్శనల్లో వెల్లివిరిసిన సృజనాత్మక శక్తి

ఉపాధ్యాయులలో నిబిడీకృతమైన ఎన్నో కళాశక్తులు భీమవరం మహాసభల సందర్భంగా వస్తుప్రదర్శన రూపంలో బయటపడినయి. ఆ ప్రదర్శనను జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ టి. రామచంద్రరావు ప్రారంభించారు.

కళాశాలకు చెందిన రెండు విశాలమైన గదుల్లో వస్తుప్రదర్శన ఏర్పాటుచేయబడింది. దీనిని శ్రీ డి. నాగమల్లేశ్వరరావు, శ్రీ టి. సత్యనారాయణరాజుగారు నిర్వహించారు.

### ప్రదర్శన విశేషాలు

చరిత్రకెక్కిన గాంధీ, లెనిన్ జీవితాలు, స్వాతంత్ర్యోద్యమ నాయకుల జీవితాలుగల ఆల్బంలు, ప్రపంచ రాజ్యాలు వాటిపూర్తి సమాచారం విపులంగా ప్రదర్శింపబడింది.

వివిధరాష్ట్రాల మహిళల అలంకరణచిత్రాలు ప్రత్యేక ఆకర్షణ. బహుళార్థసాధక ప్రాజెక్టును ఎంతో సహజంగా నిర్మించడమే గాక యంత్రాలను నడిపిచూపడం ప్రత్యేకత. సముద్రం ఒడ్డున ఉండే లైట్‌హౌస్ చక్కగా నిర్మించబడింది. అందరినీ ఆకర్షించి ఆశ్చర్యంలో ముంచిన విషయాలు....

బియ్యపు గింజలపైన, మినప బద్దలపైన తాజ్ మహల్, యు. టి. యఫ్. జెండా, కోడిపుంజులు రంగులలో చిత్రీకరణ భూతద్దంలో చూస్తేగానీ ఇవి కన్పించవు. ఆ కళా సృష్టి నైపుణ్యాన్ని చూసిన వారంతా సంభ్రమాశ్చర్యచకితులయ్యారు.

ఇంతేగాక స్టాంపుల కలక్షన్, కథాచిత్రలేఖనాలు, చేతివ్రాత పత్రికలు, ఐక్య ఉపాధ్యాయ ముఖ చిత్రాల గెటప్‌లు, గణితంలో గమ్మత్తులు ఈ ప్రదర్శనలో ఏర్పాటు చేయబడినయి.

ఉపాధ్యాయులలో గల నిబిడీకృత శక్తుల్ని ప్రోత్సాహిస్తే దేనినైనా సాధించగలరనేందుకు వస్తుప్రదర్శన ఒక ప్రబలనిదర్శనం.

## సందేశాలిస్తున్న వివిధ సంఘ నాయకులు

శ్రీ అమితవ సేన్
A. B. T. A. పశ్చిమబెంగాల్

శ్రీ గోకులానందరాయ్ పశ్చిమబెంగాల్

శ్రీ పూరకన్వల్ సింగ్ P. G. T. A. పంజాబ్

శ్రీ సూర్యనారాయణమూర్తి, అస్సాం

శ్రీ వై. వి. సుబ్బారావు మద్రాసు

శ్రీ దంతులూరి A. P. E. T. F

శ్రీ సాంబిరెడ్డి, గవర్నమెంట్ కాలేజీ లెక్చరర్స్ అసోసియేషన్

## వివిధ అనువాద రచనల ద్వారా పత్రికకు సంఘానికి తోడ్పడుతున్న మన రచయితలు

శ్రీ పి. శంకరయ్య, యం.ఏ బి.యిడి,
ప్రకాశంజిల్లా

శ్రీ కె. కేశవరెడ్డి, బి. ఎ, బి. యిడి,
గుంటూరుజిల్లా

శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం, యం. ఏ.
నెల్లూరుజిల్లా

# రాష్ట్ర కార్యవర్గం, సంపాదకవర్గం, ఆడిట్ కమిటి సభ్యుల ఎన్నిక

## నూతన కార్యవర్గం

అధ్యక్షుడు : శ్రీ డి. రామిరెడ్డి, ఉపాధ్యక్షులు : శ్రీయుతులు కె. నారాయణరావు, ఎన్. శీతారామాచారి, కె తిరుపాలు, జి.లక్ష్మయ్య టి. అంజిరెడ్డి.

ప్రధాన కార్యదర్శి : శ్రీ ఎ. వెంకటస్వామి.

కార్యదర్శులు శ్రీయుతులు యస్. ఆర్. పోలిశెట్టి, ఎం. వరహరి, వి. సూర్యనారాయణరాజు, పి. సత్యనారాయణ, ఎస్. విజయ్ కుమార్,

కార్యవర్గం : శ్రీయుతులు యస్. బాలసుందరరావు (శ్రీకాకుళం), బి. వి. వి. గోపాలాచార్యులు (విజయనగరం), ఎ బాబూరావు (విశాఖ), పి. బి. ముత్యాలరావు (తూ॥గో), కె. రాఘవరాజు (ప॥గో) యం. ఏసురత్నం (కృష్ణా), యం. రాయన్న (గుంటూరు), టి.బాలకృష్ణమూర్తి (ప్రకాశం), పి. హెచ్. లక్ష్మీనారాయణ (నెల్లూరు) వి. ఆంజనేయులురెడ్డి (చిత్తూరు), కె. రామమూర్తి (కడప), టి నాగన్న (కర్నూలు), వై. వెంకటాచలం (అనంతపురం), వి. మల్లిఖార్జునరావు (ఖమ్మం), కె. భద్రయ్య (వరంగల్), పి. హెచ్. పిచ్చిరెడ్డి (నల్గొండ), యన్. రాములు (హైదరాబాదు), ఎం.మార్కు (రంగారెడ్డి), కె. యాదగిరాచార్య (మహబూబ్‌నగర్), పి. మాణిక్ ప్రభు (ఆదిలాబాద్), యం. రాంరెడ్డి (మెదక్), పి. అమరేశ్వరరావు (నిజామాబాదు), కె. నారాయణ (కరీంనగర్).

## సంపాదకవర్గం

శ్రీ మైనేని వెంకటరత్నం (ప్రధాన సంపాదకుడు) శ్రీ డి. రామిరెడ్డి, శ్రీ ఎ. వెంకటస్వామి, శ్రీ పి. వి. సుబ్బరాజు, శ్రీ యం. వరహరి.

## ఆడిట్ కమిటీ

శ్రీ టి. కొండాచారి, శ్రీ యస్. జానకిరామారావు, శ్రీ యం ఎ. కుమార్‌దత్.

# ది.2-10-81న భీమవరంలో ఆహ్వాన సంఘంచే ఆమోదింపబడిన ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ తృతీయ విద్యా వైజ్ఞానిక మహాసభల ఆర్థిక నివేదిక

| జమలు | | | | ఖర్చులు | |
|---|---|---|---|---|---|
| 1) పశ్చిమగోదావరి | 1,38,000-00 | 12) విశాఖ | 1,130-00 | ప్రయాణాల ఖాతా | 32,771-00 |
| 2) తూర్పుగోదావరి | 1,38,000-00 | 13) నిజామాబాద్ | 1,055-00 | భోజనముల ఖాతా | 81,628-18 |
| 3) నెల్లూరు | 9,550-00 | 14) చిత్తూరు | 526-00 | వైద్య, ఆరోగ్యవసతులు | 3,516-80 |
| 4) కృష్ణా | 6,065-00 | 15) కర్నూలు | 501-00 | వైజ్ఞానిక ప్రదర్శనలు | 1,269-85 |
| 5) నల్గొండ | 5,890-00 | 16) అనంతపురం | 501-00 | ప్రింటింగు, పోస్టల్ | 25,247-50 |
| 6) గుంటూరు | 5,500-00 | 17) విజయనగరం | 500-00 | మొత్తము | 1,44,433-33 |
| 7) ప్రకాశం | 4,550-00 | 18) మహబూబ్ నగర్ | 500-00 | నిల్వలు (కేటాయింపు) | |
| 8) ఖమ్మం | 2,900-00 | 19) కరీంనగర్ | 500-00 | జిల్లాశాఖలకు | 50,000-00 |
| 9) హైదరాబాద్ | 2,200 00 | 20) కడప | 441-00 | రాష్ట్రశాఖకు | 13,957-67 |
| 10) వరంగల్ | 1,345-00 | మెదక్,రంగారెడ్డి,శ్రీకాకుళం | 100-00 | | |
| 11) ఆదిలాబాద్ | 1,337-00 | మొత్తం = | 2,08,391-00 | మొత్తం | 2,08,391-00 |

గమనిక:— పై జమలలో ఉచితంగా వచ్చిన బియ్యం, కాయగూరలు, కొబ్బరికాయలు, అరటిఆకులు, బెల్లం, నిమ్మకాయలు మొదలగునవి చేర్చబడలేదు. అలాగే డెలిగేట్ ఫీజు సంఘ జనరల్ ఫండ్‌కు జమచేసి, హైదరాబాదు భవననిధికి కేటాయించబడినది.

వి.కె డి.వి.సత్యనారాయణరాజు (అధ్యక్షులు)
ఎ. వెంకటస్వామి (ప్రధానకార్యదర్శి)
టి. కొండాచారి (ఆడిట్ కమిటి కన్వీనర్)

## పశ్చిమ గోదావరిజిల్లా సమితుల వారి విరాళాల వివరములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఆకివీడు | 32,013-00 | నల్లజర్ల | 7,919-00 | పాలకొల్లు | 4,054-00 | చింతలపూడి | 658-00 |
| విస్సాకోడేరు | 22,971-00 | పెనుమంట్ర | 7,306-00 | పెరవలి | 3,982-00 | కొవ్వూరు | 290-00 |
| భీమవరం | 19,662-00 | గణపవరం | 6,707-00 | తాడేపల్లిగూడెం | 2,086-00 | పోలవరం | 116-00 |
| మొగల్తూరు | 10,239-00 | పెదపాడు, భీమడోలు | 8,012-00 | ఏలూరు | 3,076-00 | గోపాలపురం | 93-00 |
| పోడూరు | 8,005-00 | | | నరసాపురం | 700-00 | సమిశ్రగూడెం | 11-00 |

1982 U.T.F. డైరీ

రు. 12-00

అక్టోబరు (నెం 1 నెల) వరకు డైరీ విడుదలవుతుంది. నవంబరు మొదటి వారంలో పంపబడును. (రిజిష్టరు పోస్టు రు. 3-00 అదనం)



INTELLECTUALS

16

INTELLECTUAL

# మేధావులు - రాజకీయాలు

—డా॥ వై. రాధాకృష్ణమూర్తి

[భీమవరం మహాసభల్లో 'ఎడ్యుకేషనల్ సింపోజియం'లో పాల్గొన్న డా॥ రాధాకృష్ణమూర్తిగారి ప్రసంగ పాఠమిది. ప్రతినిధుల్ని ఉత్సాహోత్తేజాల్లో ముంచెత్తటమేగాక.... ఆలోచనాతరంగాల్లో తేల్చి కర్తవ్యోన్ముఖుల్ని చేసిన ప్రతిభావంతమైన ఈ ప్రసంగ పూర్తి పాఠాన్ని పాఠకులకు అందిస్తున్నాం—సం॥]



'మేధావులు–రాజకీయాలు' అనే అంశం వివాదాస్పద మయింది. రాజకీయాలు ఎవరికి అవసరమో, ఎవరికి అవసరం లేదో – దీని మీద పలు భిన్నాభిప్రాయాలు వెల్లడవటము మనం చూస్తున్నాం. అందుకనే దీన్ని వివాదాస్పదమైన అంశంగా భావిస్తున్నాను.

నా ముఖం రంగు మీరు చూస్తూనే ఉన్నారు .... అది 'నలుపు', నా అభిప్రాయాలు 'ఎరుపు' అన్నది మీలో చాలామందికి తెలిసి ఉండవచ్చు. మీ జండా రంగుకూడా 'ఎరుపే' గనుక నేను కొంత సమాధానపడుతున్నాను. కాని నా అభిప్రాయాలకు కొంతమంది పెద్దల కనుబొమలు పైకిలేస్తే ఆశ్చర్యపడనక్కరలేదేమో అనికూడా భావిస్తున్నాను.

## మేధావులంటే...

ఇక విషయానికివస్తే 'మేధావులు' అనేపదాన్ని ఇంటలెక్చ్యువల్స్ (INTELECTUALS), 'ఇంటర్‌జెన్సియా' (INTELIGENIIA)అన్న రెండు ఆంగ్లపదాలను సమానంగా మనం వాడటం జరుగుతున్నది.

'ఇంటలెక్చ్యువల్స్' అనేపదాన్ని మేధస్సుతో పనిచేసే వ్యావకాలున్నవాళ్ళకీ, ఉన్నతమైన అవగాహనశక్తి గలవాళ్ళకి మనం వాడుతున్నాం. కాని 'ఇంటల్‌జెన్సియా' అనేది కొంచెం రష్యన్ ఆరిజెన్స్ కల్గినపదం. విస్తృతమైన అర్థంలో అది వాడబడుతున్నది. ప్రజానీకంలో విద్యావంతులై ప్రజాభిప్రాయాన్ని మల్చగల శక్తిగల వారిని 'ఇంటల్‌జెన్సియా' అనివాడటం జరుగుతున్నది. మార్క్సిస్టు పరిభాషలో 'మేధావులు' అన్న తెలుగు పదానికి 'ఇంటల్‌జెన్సియా' అనే పదం సమానంగా వాడబడుతున్నది. నేను కూడా ఆ పదాన్ని అదే వరవడిలో వాడుతున్నాను.

## నానావిధ మేధావులు

అయితే మేధావులంతా ఒకరకం గాదు.... ఒకవర్గమూగాదు. వారిలో కొంతమందిని బూర్జువా మేధావులంటున్నాం. పెట్టుబడిదారీ వర్గానికి పూర్తిగా లోబడి అది అవసరం కొద్దీకావచ్చు. లేక వారి మానసికస్థితినే బట్టీకావచ్చు. ఆ విధంగా ప్రవర్తించే వాళ్ళనిబూర్జువా మేధావులంటున్నాం.

ఇక 'తటస్థ మేధావుల'మని కొంతమంది గర్వంగా చెప్పుకొనే వాళ్ళున్నారు. 'ఆబ్జక్టివ్ సైంటిఫిక్ అబ్జిటీ' అనీ 'న్యూట్రాలిటీ' అనీ, కొన్ని పదాలు మనం వింటుంటాం. మేధావులైన వాళ్ళు అనుదిన రాజకీయాలలో తలదూర్చటం సరయిన పనిగాదనీ, వారి కృషి వారు చేసుకొంటూపోతే సమాజ అభ్యున్నతికది తోడ్పడుతుందనీ వారి భావన.

ఇక మరో తరగతికి చెందినవాళ్ళు అభ్యుదయ మేధావులు. వారు ఏ ఒక రాజకీయపక్షానికి చెందనప్పటికీ, ప్రగతిశీల రాజకీయాభిప్రాయాలుగల్గి, వాటిని ప్రచారంలో పెట్టటానికిగాని, అనుసరించటానికిగాని ప్రయత్నించేవాళ్ళు. వారిని అభ్యుదయ లేక ప్రగతిశీల మేధావులంటున్నాం.

కొంతమంది 'కమిటెడ్ ఐడియాలజీ' గల మేధావులున్నారు. ఉదాహరణకు 'మార్క్సిస్టు మేధావుల'నే తీసుకొందాం. వీరు ఒక 'ఐడియాలజికల్ కమిట్‌మెంట్' ఉన్నవారు. వీరిని కూడా ఒక తరగతి 'మార్క్సిస్టు మేధావులు'గా మనం పరిగణించటం జరుగుతున్నది.

## రాజకీయాలంటే

ఇక 'రాజకీయాలు' అనే పదాన్ని ఆంగ్లంలో 'పాలిటిక్స్' అంటున్నాం. ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువు చూస్తే 'పాలిటిక్స్' అనేపదానికి 'The Science and art of Govt' అని, ఇంకొంచెం విడమర్చి 'The Science dealing with form organisation and administration of a state' అని వివరించటం జరిగింది.

కాబట్టి ప్రభుత్వాన్నీ, దాని స్థితినీ, నిర్మాణాన్నీ, పరిపాలనను అర్థం జేసుకోవటం, అనుసరించటాన్ని కూడా 'పాలిటిక్స్'గా చెప్పబడుతున్నది. అంటే.... సాధారణ అర్థంలో చూస్తే దేశాన్ని సమాజాన్నీ ఉన్న స్థితినుండి ఉన్నత స్థితికి తీసుకువెళ్ళటానికి అనుసరించే మార్గాలు, చేసే ఆలోచనలు, కార్యాచరణ ఇవన్నీ రాజకీయాలుగా మనం చెప్పుకోవచ్చు.

## కుహనా రాజకీయాలు :

అయితే దురదృష్ట వశాత్తు ఈ 'రాజకీయాలు' అన్న పదం నేడు ఒక దూషణ పదంగాను, అపహాస్యమైన పదంగాను మారుతూ వచ్చింది. 'అబ్బ...వాడొక పెద్ద పొలిటీషియనోయ్!' అంటూంటాం ఇది ఒకరకమైన అపహాస్యం. దూషణకూడాను। ఇది యీనాడేదో ఆకస్మికంగా వచ్చిందన్న మాటగాని, ఏదో మనదేశానికే పరిమితమైన దౌర్భాగ్యం గాని కాదు.

ఆడంస్మిట్ అనే ఆయన రాజకీయ వాదుల్ని వ్యాఖ్యానిస్తూ Ths Interims and Crafty Annimals Vulgarlcall States-man and Politition అని చాలా ఘోరంగా అన్నాడు. దీనినే

తెలుగులో చెప్పాలంటే 'వ్యవహార దక్షుడనీ, రాజకీయ వేత్త అనీ పొరపాటుగా పిలువబడే జిత్తులమారి జంతువ'న్నాడు ఆయన.అంటే ఆడంస్మిత్ కాలం నుండి యీ రకం జాతి ఉండేదన్నమాట.

ఈ విధంగా మనదేశంలోకూడా సమకాలీన రాజకీయరంగంలో చాలామంది రాజకీయవేత్తలు, నాయకులు ఈ సంప్రదాయాన్నే కొనసాగిస్తూ ఆడంస్మిత్ వ్యాఖ్యానాన్ని నిజం చేస్తున్నారు. అందు కనే బాగా చదువుకొన్నవాళ్ళు, సంస్కారం గలవాళ్ళు కూడా 'రాజకీయం' అనే పదం వినగానే కొంచెం ఒళ్ళు జలదరించటం, అదేదో జిత్తులమారితనంగా భావించటం జరుగుతున్నది.

అయితే రాజకీయాలన్నీ ఓరకంగా లేవు. పాలిటిక్స్ కొంత మందికి మిషన్ కొందరికేమో ప్రొఫెషన్. కొంతమందికి పార్ట్ టైం సరదా. బాగా సంపాదించింతర్వాత 'ఇకచాలు దీని పాడుగాను ఇక రాజకీయాల్లోకి దిగుదాం' అని రాజకీయ రంగాన్ని పావనం చేస్తారు.

కొంతమందికిది ఎకనమిక్ ఎక్సర్ సైజ్. వీళ్ళవి పడక కుర్చీ రాజకీయాలు. వీళ్ళు పుస్తకాలు బాగా చదువుతారు. పాండిత్యం బాగా పెంచుకొంటారు. తలకాయ బాగా వాచిపోతుంది. ఇక కన్పించిన వాళ్ళందరికీ లెక్చర్లు దంచుతుంటారు. పనికిమాలిన పోసుకోలుకబుర్లు తప్ప కార్యాచరణ శూన్యంగాఉంటుంది 'వాళ్ళితప్పుజేశారు' వీళ్ళీ తప్పుజేశారు, ఆపార్టీ అట్లా ఈ పార్టీ ఇట్లా' అని అదే పనిగా చెపుతూ ఉంటారు. ఇది ప్యూర్ 'ఎకనమిక్ ఎక్సర్ సైజ్' తప్ప పనికివచ్చేదీ చచ్చేదీ గాదు.

ఇక మరో రకం ఉన్నారు. వీళ్ళకు పాలిటిక్స్ ఓ వ్యాపారం వీళ్ళనే ప్రస్తుతం మనం ఎక్కువగా చూస్తున్నాం. ఇది ఒక దౌర్భాగ్యస్థితి. పంచాయితీ సర్పంచ్ నుంచి మంత్రిదాకా— పదవులకు పెట్టుబడి పెట్టటం— ఆ తర్వాత చక్రవడ్డీతోసహా రాబట్టుకోవటం! ఇలా పాలిటిక్స్ ఓ పెద్ద వ్యాపారంగా పెద్ద ఎత్తున కొనసాగుతున్నవి.

నా దృష్టిలో ఇవి రాజకీయాలుగావు—వీళ్ళు రాజకీయ వాదులూగాదు. నిజానికి ఆడమ్స్మిత్ వ్యాఖ్యానించిన జిత్తులమారి గుంట నక్కలువీళ్ళు! మరెవరు రాజకీయవాదులు ? అంటే, ఎవరైతే చిత్తశుద్ధితో ఈ దేశాన్ని, సమాజాన్ని చూసినపుడు....ఆవేదనతో దాన్ని విశ్లేషించి, ఆలోచనచేసి, ఎందుకిలా జరుగుతున్నది ? దీన్ని మార్చేమార్గమేమిటి ? అని ఆలోచిస్తారో—ఆ వైపు ప్రయాణం చేస్తారో, వారే సరయిన రాజకీయ వాదులుగా మనం చెప్పుకో వచ్చు. 'పాలిటిక్స్' అంటే సరయిన అర్థమిదే !

## దేశాభివృద్ధిలో మేధావులపాత్ర

పైన వివరించినటు మేధావులూ-రాజకీయాలూ- అన్నపుడు దేశాన్ని బాగుచేయటంలో మేధావులపాత్ర చాలా గొప్పదిగా....అసామాన్యంగా ఉంటుంది. అట్లని వాళ్ళే వ్యవస్థను మార్చి ప్రత్యామ్నాయ వ్యవస్థను తీసుకువస్తారనటం కేవలం భ్రమ మాత్రమే అవుతుంది. అది శాస్త్రీయ అవగాహన కాదుకూడాను.

మేధావుల్ని గురించి మార్క్స్ చెప్పిన వ్యాఖ్యానం కూడా ఉంది. దాని సారాంశం ఇది. ఉదాహరణకు వేద ఋషులున్నారు— ఉపనిషత్కర్తలున్నారు....ప్రవక్తలున్నారు....బాబాలూ అమ్మలూ కూడాఉన్నారు. వీరందరూ'చారిత్రిక పరిణామ దశలో సామాజిక స్థితి గతుల యొక్క ఫలితాలేతప్ప వీరివల్ల చరిత్రగతి మారుతుందనీ, వ్యవస్థ మారిపోతుందనీ అనుకోవటం సరయిన అవగాహనగాదు' అన్నది మార్క్స్ ప్రవచనం. 'మేధావులపాత్రను మరింత పెద్దజేసి చెప్పటం తప్పు' అనే దృష్టితో మార్క్స్ అలా నిర్వచించటం జరిగింది.

అయితే మార్క్స్ నాటికంటె, యీనాడు మేధావుల పాత్ర అత్యధికంగా పెరిగింది అని మాత్రం చెప్పవచ్చు. విజ్ఞాన శాస్త్రం గత నూరేళ్ళుగా మహా ప్రభంజనంలా మార్పుల్ని తెస్తున్నది. సాంకేతిక రంగంలో మార్పుకి ఓ రకంగా మేధావులే కారణం. సాంకేతిక నైపుణ్యం,పరిశ్రమలు పెరగటంతో మేధావుల అవసరం నానాటికీ పెరుగుతూ వచ్చింది. పలువురు విద్యావంతులు జాతీయ ఉత్పత్తిలో భాగస్వాములుగా ఉండటం మనం చూస్తున్నాం. గత నలభై యాభై సంవత్సరాలుగా చూస్తే వీరు సంఖ్యాపరంగా పెరిగారు. ఆపైన కార్యాచరణ పాత్రకూడా గణనీయంగా పెరిగింది.

ఈనాటి మేధావులు సామాజిక ప్రాముఖ్యత గల్గిన శక్తిగా, సామూహిక శక్తిగా కూడా రూపొందారు. ఇదివరకు కొందరు వ్యక్తిగతంగా మార్పును తీసుకురావటానికి ప్రయత్నించటం జరిగింది. ప్రస్తుతం అలాగాక సామూహిక శక్తిగా రూపొందటం మనం చూస్తున్నాం. దానికి ఈ మహాసభ తార్కాణం. అందుకని సామాజిక విప్లవం తీసుకురావటానికి మేధావులపాత్ర చాలాఅవసరమని నేడు అంతా గుర్తిస్తున్నారు.

## కొన్ని అపోహలు

కాని చాలామంది దృష్టిలో చదువు కొన్న వారి దృష్టిలో కూడా 'కమ్యూనిస్టులు మేధావుల్ని చిన్నచూపు చూస్తార'ని ఓ అపోహ వుంది. కాని అది వాస్తవంకాదు.

1939లోనే విప్లవానికి పది సంవత్సరాల ముందే మావోసేటుంగ్ పార్టీని హెచ్చరిస్తూ 'మేధావులు లేకుండా విప్లవం విజయవంతంకావటం అసంభవం' అని కుండబద్దలు కొట్టినట్టు అన్నారు. 'అధికాధిక సంఖ్యలో మేధావుల్ని మీరు రిక్రూట్ చేసుకోండి. పెట్టుబడిదారీ వర్గం వారిని తమవైపు లాక్కొనటానికి పోటీబడుతుంది. జాగ్రత్తపడండి' అంటూ హెచ్చరిక చేశారు.

అదే సందర్భంగా మరో విషయం కూడా యీ మేధావులకు ఇంతప్రాముఖ్యత ఎందుకు వచ్చింది ? అని మనం పరిశీలించాల్సి ఉంది. మిగతా సెక్షన్లన్నీ (కార్మికవర్గం) ఉత్పత్తిలో చాలా కీలక పాత్ర వహిస్తున్నప్పటికీ ప్రజాభిప్రాయాన్ని మోల్డ్ చేయుటంలో మేధావుల పాత్ర చాలా గొప్పగా ఉంటుంది. ఎందుకంటే వీళ్ళు ఓకల్ సెకన్ మామూలు భాషలో చెప్పాలంటే నోరున్నవాళ్ళు వీళ్ళు. మనసులో ఉన్నదాన్ని స్పష్టంగా చెప్పగలవాళ్ళు. నచ్చిన పద్ధతిలో ప్రచారం చేయగలవాళ్ళు. పదిమందినీ ఆకట్టుకొని తమ అభిప్రాయానుగుణంగా తీసుకు వెళ్ళగల్గిన వాళ్ళు !

అంతేగాదు. ఈరోజు మన ప్రచార సాధనా లైన రేడియో, టెలివిజన్, పత్రికలు వీటన్నిటినీ మేధావులే నిర్వహిస్తున్నారు. రేడియో విని, టెలివిజన్ చూసి, పత్రికలు చదివి సాధారణ ప్రజానీకం తమ అభిప్రాయాలను మోల్డు చేసుకొనే కీలకపాత్ర వీళ్ళది.

అరిక్రోమ్ అనే మానసిక శాస్త్రవేత్త 'Mass midie Parelised Capacity for indipendent thinking' అంటూ యీ 'మాస్ మీడియా' సాధారణ ప్రజానీకంమీద కల్గించే ప్రభావాన్ని స్పష్టీకరించాడు. సామాన్యంగా చూడండి.... పత్రికల్లో ఏం

వ్రాశారో చూద్దామంటారు—రేడియోలో ఏం చెప్పారో విందామంటారు. ఈ యాంత్రిక యుగంలో ఈ పత్రికల్లో వ్రాసినవాటిమీద మనం ఆలోచనచేసి, విశ్లేషణచేసి, విమర్శచేసి స్వంత అభిప్రాయానికి రావటానికి కావల్సిన ఓపికగాని, కాలంగాని ఉండటంలేదు. అందుకనే 'అచ్చులోపడిందంతా కరెక్ట్!' అని భావించే వాతావరణంలో కొట్టుకుపోవటం జరుగుతున్నది. ఈ స్థితిలో ఈ 'మాస్ మీడియా' ప్రాముఖ్యత, దీని వెనుక మేధావుల పాత్ర ఎటువంటిదో మనకర్థమవుతుంది.

అంతేగాదు—ఈనాడు ఉత్పత్తి పెంచాలంటే శారీరక శ్రమచేసే కార్మికుడు ఎంత అవసరమో—ఆ శ్రమకు నైపుణ్యాన్ని జోడించాల్సినటువంటి అవసరమైన ప్లాన్ ఇవ్వాల్సిన అడ్మినిస్ట్రేటర్ కూడా అంత అవసరం

అంతేగాదు—ఈనాటి కళారంగాన్ని తీసుకున్నా—వివిధ వైజ్ఞానిక రంగాలు తీసుకొన్నా వీటిద్వారా ప్రజల్లోకి వెళ్ళగల్గినవాళ్లు మేధావులే అన్న విషయాన్ని మనం గమనిస్తే—వాళ్ళ ప్రాముఖ్యత మనకు మరింత స్పష్టమవుతుంది.

ఇంత ప్రాముఖ్యతగల యీ బృందాన్ని కమ్యూనిస్టులుచిన్న చూపు చూస్తున్నారనటం అపోహ మాత్రమే. దానికి మావో, లెనిన్ ల హెచ్చరికలే ప్రబల సాక్ష్యాలు.

'మేధావి వర్గం కార్మిక వర్గమా? పెట్టుబడిదారీ వర్గమా? అంటే రెండూ కాదు...వాళ్ళది ప్రత్యేక స్థితి'–అన్నాడు లెనిన్. వీరు పుట్టుకద్వారా, పెంపుదల ద్వారా, దృక్పథంవల్లకూడానూ పాక్షికంగా బూర్జువా వర్గంతో కలిసినా, పెట్టుబడిదారీ వర్గం వీరిని జీతగాళ్ళుగా మారుస్తున్నకొద్దీ వీరందరూ కూడా కార్మికవర్గంతోనే తమభవిష్యత్తు ముడిపడి ఉన్నదని గుర్తించే రోజు తప్పక వస్తుందనీ, అందుకని వీరు నెలజీతగాళ్ళుగా మారేకొద్దీ శ్రామిక వర్గంలో చేరిపోతారనీ, లెనిన్ ఏనాడో వివరించారు.

అంతేగాదు లెనిన్ మాటల కొనసాగింపుగానే 1969 లో మాస్కోలో సమావేశమైన ప్రపంచదేశాల వర్కర్స్ అండ్ కమ్యూనిస్టు పార్టీలు మేధావుల్ని గురించి ఒక తీర్మానం కూడా చేశాయి. దానిలో మేధావులయెడ తమ దృక్పథాన్ని వ్యక్తంజేశాయి.

'విజ్ఞానశాస్త్రం నేరుగా ఉత్పాదక శక్తిగా మారుతున్న యీ యుగంలో మేధావులు అధికాధిక సంఖ్యలో కూలీలుగా లేక నెల జీతగాళ్ళుగా చేరిపోతూ వున్నారు. ఇదీ నేడుజరగకున్న పరిణామం. దీనివల్ల వారిసామాజిక ప్రయోజనాలు శ్రామికవర్గ ప్రయోజనాలతో క్రమంగా పెనవేసుకుపోతాయి. లాభాన్ని అన్నిటికన్నా మిన్నగా ఎంచే గుత్తదారుల ప్రయోజనాలతో ఘర్షణ పడతాయి. వారి వారి స్థానాల్లో అంతరాలు ఎంతగా ఉన్నా భిన్నమైన గ్రూపులకు చెందిన మేధావులు అటు గుత్తదారులతోనూ ఇటు సామ్రాజ్య వాద విధానాలతోనూ విభేదిస్తూ ఉన్నారు. బూర్జువా సిద్ధాంత సంక్షోభమూ, మరోవైపు సోషలిస్టు సిద్ధాంత ఆకర్షణా వారిని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలోకి తీసుకుపోవటానికి తోడ్పడుతున్నాయి.' అనేది వారు చేసిన తీర్మాన సారాంశము.

దీని కనుగుణంగా వివిధ దేశాల్లో జరుగుతున్న పరిణామాలు మనం చూస్తూనే ఉన్నాము. ఈ రోజు అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో ఇంగ్లాండు, ఫ్రాన్స్, ఇటలీ.. ఒకరికి వెనుకబడిన మన దేశంలో కూడా పాతిక ముప్పయి సంవత్సరాల క్రితం లేనటువంటి పరిణామాల్ని మనం చూస్తున్నాము. తెల్లచొక్కా వాళ్ళు కుర్చీల్లో కూర్చొనే వాళ్ళు.... ఉద్యోగాలు చేసే వాళ్ళు మామూలు కార్మికుల్ని చూసినా, వ్యవసాయ కూలీల్ని చూసినా, పేద రైతుల్ని చూసినా వెనకటిలా ఈసడించుకొనే స్థితి యీనాడు లేదు. మనంకూడా వాళ్ళతో సమానమనే భావం క్రమంగా పెరుగుతున్నది. కాకపోతే మనది 'తెల్లచొక్కా', వాళ్ళది 'నల్లచొక్కా' అంటున్నారు. దానితో క్రొత్తతరం వ్యవహారంలోకికూడా వచ్చింది. 'వైట్ కాలర్ వర్కర్స్.... బ్లూకాలర్ వర్కర్స్' అని అంటున్నాం. ఇద్దరికీ 'వర్కర్స్' అనేది కామన్ ఫేక్టర్ అయింది. కాబట్టి కాలం గడిచినకొద్దీ, జీతగాళ్ళుగా వీరు మారినకొద్దీ యీ మేధావి వర్గంగా ఉన్నవాళ్లు తమ ముఖాలకు వేసుకున్న ముసుగుల్ని తొలగించుకుని 'మేమూ కార్మికవర్గమూ ఒకటే!' 'మా ప్రయోజనాలూ కార్మిక వర్గ ప్రయోజనాలు ఒకటే!' అనే స్థితికి దాదాపుగా వస్తున్న పరిణామాన్ని మీ దృష్టికి తెస్తున్నా.

నేడు కావాలని మేధావులు రాజకీయాల్లోకి వెళ్ళటంలేదు. తమ ఉనికిని, తమ జీవితాన్ని కాపాడుకోటానికి తప్పని సరయిన స్థితిలో వారు రాజకీయాల్లోకి ప్రవేశిస్తున్నారు అంతేగాదు .... మన దేశంలో యింకా ఆ పరిణామం రాలేదుగాని, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ లాంటి పశ్చిమ దేశాలలో ఈ మేధావులకు చెందిన సంఘాలు, కొన్ని టీచర్స్ అసోసియేషన్స్‌కూడా బాహాటంగా.... ఏ రిజర్వేషన్స్ లేకుండా ట్రేడ్ యూనియన్లకు అనుబంధంగా చేరుతున్నాయి ఈ వాస్తవాన్ని మనం గమనిస్తే ప్రపంచవ్యాప్తంగా కూడా మేధావి వర్గం యీ పెట్టుబడిదారీ వ్యవస్థ పటిష్టతని ప్రశ్నించే స్థితికి వచ్చారనీ, సోషలిస్టు వ్యవస్థను ఆహ్వానించే దశకు కూడా వాళ్ళు చేరుకున్నారనీ అనటానికి, ఈ పరిణామం ఒక నిదర్శనంగా మనం గమనించవచ్చు.

## నిర్బంధాలూ-నిషేధాజ్ఞలు

ఈ పరిణామాన్ని ఆపటానికి దోపిడీ ప్రభుత్వాలు శత విధాలా తమ తోంటి కాళ్లు అడ్డం పెడుతున్నాయి. నిర్బంధాలూ—నిషేధాజ్ఞలు జారీ చేస్తున్నాయి మేధావి వర్గం తమను దూరం కాకుండాను. సోషలిస్టు వ్యవస్థకు దగ్గరగా పోకుండానూ ప్రయత్నిస్తున్నాయి.

దానికి ఉదాహరణగా ఇటీవల పంజాబ్—హరియానాలలో ఆ రాష్ట్ర ప్రభుత్వాలు కొన్ని రహస్య సర్క్యులర్లు జారీచేసిన సంగతి పత్రికల్లో బహిర్గతమయ్యాయి—పంజాబ్ ప్రభుత్వం జారీచేసిన దానిలో 'ఇదిగో ఈ 135 మంది విద్యార్థులూ రాజకీయాలకు చెందినవాళ్లు. ఈ లిస్టులో ఉన్నవాళ్ళని యీ రాష్ట్రంలో ఉన్న ఏ విద్యాలయంలో కూడా చేర్చుకోరాద'ని ఆ సర్క్యులర్లలో ఉంది. ముఖ్యంగా వామపక్షాలకు చెందిన విద్యార్థులు ఆ లిస్టులో ఉన్నారు. అలాగే హరియానా ప్రభుత్వంకూడా ఓ లిస్టు తయారుచేసి పంపింది. ఈ దేశంలో పుట్టిన ప్రతి వారికీ—ఎక్కడైనా చదువుకొనే హక్కు ఉంది. దాన్ని నిరోధిస్తున్నాయి పాలకవర్గాలు. నేడో—రేపో— మన రాష్ట్రంలో కూడా యీ స్థితి దాపురించవచ్చు.

ఇక ఉద్యోగాల విషయం తీసుకుంటే స్వాతంత్ర్యం వచ్చిన దగ్గరినుండి కూడా వామపక్షాభిప్రాయాలున్న వాళ్ళు ఉద్యోగాలలో చేరటం చాలా కష్టంగా ఉంది. పోలీస్ వెరిఫికేషన్‌ని గీటురాయిగా తీసుకొని చాలా సందర్భాల్లో ఉద్యోగాలివ్వటమా? ఇవ్వకపోవటమా? అనేది నిర్ణయిస్తున్నారు. ఈ మధ్య ఒక ఐ.ఏ.యస్. ఫస్ట్‌క్లాస్‌లో

ప్యాసయిన విద్యార్థికి ఉద్యోగం నిరాకరించడం జరిగింది. దానికి కారణం ఆ విద్యార్థి వామపక్షభిప్రాయాలు గలవాడని పోలీసు రిపోర్టులో ఉండటమే.

అలాగే రచయితలమీద కూడా నిషేధాన్ని మనం చూస్తున్నాము. మన రాష్ట్రప్రభుత్వమే వామపక్ష అభిప్రాయాలుగల రచనలమీద, సాహిత్యంమీద, కవిత్వంమీద నిషేధం పెట్టిన విషయం మనకు తెలుసు. దానిమీద కొందరు కోర్టులకు కూడా వెళ్ళారు. దాని పై ప్రభుత్వానికి ఒక చెంపపెట్టుగా హైకోర్టు తీర్పుకూడా రావటం జరిగింది. ప్రభుత్వాధినేతలు ఎంతవరకు సరిజేసుకున్నారో తెలీదుగాని కోర్టుల అభిప్రాయాల్ని దాటవేయటం తప్ప, ఆతీర్పుల్ని గౌరవించటంలేదనేది బహిరంగ రహస్యం.

ఇక యీ మధ్య జారీచేసిన ఎయిడెడ్ టీచర్ల అగ్రిమెంటు ఉన్నది. దానిలో కూడా నేనూ.... నా భార్యా.... నా కుటుంబానికి అటూ యిటూ ఎవళ్ళూ రాజకీయాల్లో లేమని వ్రాసి యివ్వాలనే నిబంధన ఉంది. ఒకవేళ తండ్రో, తాతో స్వాతంత్ర్య సమరయోధుడైనా అతనికి జీతంరాదు. సంఘాలలో చేరమనీ, వాటిని ప్రోత్సహించమనీ సత్యాగ్రహాలు, ధర్నాలు ఏ ఆందోళనా చేయమనీ, కాళ్ళూ చేతులూ కట్టివేసే ప్రయత్నం కూడా జరిగింది. ఇంతకన్న ఘోరమైన విషయం మరొకటి లేదు, దాన్ని మీరు ప్రతిఘటించి వెనక్కి కొట్టేరనుకోండి. ప్రభుత్వ ఆలోచన సంగతి మీ దృష్టికి తెస్తున్నాను.

అంతేగాదు యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ నియామకాలు, హైకోర్టు, సుప్రీంకోర్టులాంటి వాటిల్లో నియామకాల ప్రమోషన్లు అందుకు భిన్నంగా ఏమీలేవు. తమకు తాన తందానా అనే వాళ్ళకే అవదవులు. ప్రమోషన్లు! భిన్నాభిప్రాయాలు గల వాళ్ళు ఎంత అత్యున్నతమైన అర్హతలు గలవారైనా వారికా అవకాశం ఇవ్వటం లేదు.

## అసలు రహస్యం

ఈ పై ఉదాహరణ లన్నిటినిబట్టీ మనకు తేలుతున్నదేమంటే.... అధికారంలో వున్నవారు వామపక్ష అభిప్రాయాలుగల సంస్థల్నిగాని, వ్యక్తుల్నిగాని, తమ ప్రయోజనాలకు అడ్డంవచ్చే ప్రజాస్వామిక వాదుల్నిగాని సహించే స్థితిలోలేరనీ, అందుకే యీ నిషేధాలూ.... నిర్బంధాలూనని స్పష్టమవుతున్నది.

ఈ సందర్భంలో మన స్వాతంత్ర్య పోరాట సాంప్రదాయాన్ని ఓసారి గుర్తుచేసుకోవాల్సి ఉంది. అనాడిలా ఆంక్షలు పెట్టలేదు. మహాత్మాగాంధీ స్వాతంత్ర్య పోరాటం సాగించినపుడు, నాయకత్వం వహించినపుడు ఆయన ఇచ్చిన పిలుపేమిటి? ఉపాధ్యాయులారా.... విద్యార్థులారా! బయటికి రండి.... విద్యాలయాల్ని బహిష్కరించండి! న్యాయవాదుల్లారా.... బయటికిరండి.... కోర్టుల్ని బహిష్కరించండి! అంటూ వివిధ తరగతులకు చెందిన మేధావుల్ని రాజకీయ రంగంలోకి ప్రవేశపెట్టిన పిలుపు ఇవ్వబడింది. ఆ పిలుపు ననుసరించి వారంతా స్వాతంత్ర్య సమరంలోకి దూకిన సత్సాంప్రదాయం మనది.

కానినేడో.... దానికి వారసులమని చెప్పుకొంటున్న వాళ్ళే.... ఏ పెద్దనాయకుడు వేదికమీదికి ఎక్కినా, విద్యార్థులకు రాజకీయాలెందుకు అక్కర్లేదు! ఉపాధ్యాయులకు రాజకీయాలెందుకు అవసరంలేదు.... ఉద్యోగులకు రాజకీయాలెందుకు.... వారికి అసలు అవసరంలేదు. రైతులకు రాజకియలెందుకు? ఉత్పత్తిపెంచండి, కార్మికులకు రాజకీయాలెందుకు.... ఇంకా శ్రమించండి! మరెవరికి రాజకీయాలు? మాకు ఇలా ఉంటున్నది వారి ప్రసంగధోరణి.

ఇదంతా వాళ్ళ స్వార్థ దృష్టే కాకుండా తమకు భిన్నమైన ఆలోచనా ధోరణి గల వామపక్ష అభిప్రాయాలు గల మేధావుల్ని కంట్రోలు చేయటమేనన్నది స్పష్టమవుతున్నది.

## తమ స్వార్థాలకు మాత్రం రాజకీయాలు

పోనీ వీళ్ళు మేధావి వర్గాల్ని రాజకీయాలకు దూరంగా ఉంచుతున్నారా? అంటే అదీ లేదు. సమయం వచ్చినప్పుడల్లా వారిని తమ స్వార్థానికి వాడుకొంటున్నారు. ఊబిలో దింపుతున్నారు.

ప్రత్యేకాంధ్ర ప్రత్యేక తెలంగాణా మొదలైన అనేక విచ్ఛిన్నకర ఉద్యమాలకు నాయకత్వం వహించి తమ స్వార్థాలకోసం అనేక మంది యువకుల ప్రాణాలను బలిగొనటం మొన్న మొన్ననే జరిగింది. మీకేం ఫరవాలేదు.... మేమున్నాము.... రేపు మంత్రులంగా రాబోతున్నాము. అంటూ రెచ్చగొట్టి, భ్రమలు ప్రేరేపించి, వారిని ఊబిలోకి దింపటం, దాన్ని వాడుకొని గద్దెలెక్కటం మన అనుభవాల్లోని విషయాలే.

కాబట్టి తమ వర్గ స్వార్థాలకోసం చేసే ఉద్యమాలలో అంతా పాల్గొనవచ్చుగాని—దానికి విరుద్ధమైన ఉద్యమాలలో పాల్గొనరాదనే నీతిబోధలు చేయటాన్ని—నీతి సూత్రాలు వల్లించటాన్ని, ఆంక్షలు విధించటాన్ని, కక్ష సాధింపు చర్యలను పూనుకోవటాన్ని మనం కళ్ళారా చూస్తున్నాం.

## మేధావివర్గ కర్తవ్యాలు

ఈ స్థితిలో మేధావివర్గ కర్తవ్యాలేమిటి? అన్న ప్రశ్న మన ముందుంది. ఈరోజు ఈ 'రా జ కీ యా లు' అనేదాన్ని కేవలం కొందరు స్వార్థపరవర్గ ప్రయోజనాలకు, ఉన్నత సంపన్నవర్గాల ప్రయోజనాలకు పరిమితంచేసే పరిస్థితిలో—మేధావివర్గం దీన్ని సహించగూడదన్నది నా విజ్ఞాపన— విన్నపం కూడాను. ఇదేదో నిప్పుల్లో దూకమంటున్నదికాదు—మిమ్మల్ని మీరు రక్షించుకోవటం కోసం, మీ కుటుంబాన్ని, మీ వర్గాన్ని సంరక్షించుకోవటం కోసం తీసుకోవల్సిన కనీసపు కర్తవ్యమేనని మనవి చేస్తున్నాను.

అంతేగాదు, రెండుమూడు ప్రధాన కర్తవ్యాలుగూడా మేధావి వర్గం నేడు నిర్వహించాల్సిన అవసరం వుంది.

అందులో మొదటిది ప్రపంచ శాంతి పరిరక్షణ. ఈరోజు ప్రపంచ శాంతికి ముప్పువచ్చే పరిస్థితి దాపురించింది. దారుణ యుద్ధ కారుమేఘాలు ప్రపంచమంతా ముంచుకొస్తున్నవి. ఆటం, హైడ్రోజన్, న్యూట్రాన్ మొదలైన మారణాయుధాలకోసం పరుగులెత్తటం జరుగుతున్నది దాన్ని ఆపి, ప్రపంచశాంతి కాపాడటం అన్నిదేశాల మేధావుల ప్రథమ కర్తవ్యం.

ఈరోజు ప్రపంచంలో ప్రతి ముగ్గురిలో ఒకరికి వైద్య సదుపాయం లేదు. ప్రతి ఐదుగురిలో ఒకరికి చదువు సంధ్యల్లేవు. ప్రతి ఏడుగురిలో ఒకరికి సరయిన ఆహారంలేదని లెక్కలు చెప్పున్నాయి. ఈ రకంగా ఓ ప్రక్క ప్రపంచ జనాభా అంతా రోగాలతో రొస్టులతో, దరిద్రంతో దీనావస్థ అనుభవిస్తూ ఉంటే.. మరో ప్రక్క ప్రతినిమిషానికీ వేలమిలియన్ల డాలర్లు ఆయుధాలకోసం ఖర్చు పెట్టటం జరుగుతున్నది. గత సంవత్సరం 500 బిలియన్ల డాలర్లు మారణాయుధాలకోసం ఖర్చుపెట్టటం జరిగింది. న్యూట్రాన్ బాంబు తయారు

చేస్తున్నామని మొన్న మొన్ననే అమెరికా ప్రెసిడెంటు ప్రపంచానికి చాటాడు. నిజంగా యుద్ధమే వస్తే ఆ అగ్నిజ్వాలలు ప్రపంచమంతా చుట్టుముట్టి భస్మీపటలం చేస్తాయి. అవి అలీనదేశాలని ఆగవు.... శాంతికాముక దేశాలని ఊరుకోవు. మారణహోమం జరిగి అందరినీ మట్టుపెడతాయి. దానితో యుగయుగాల నాగరికత ధ్వంసమవుతుంది. కాన ప్రపంచ శాంతికోసం.... మానవ మనుగడకోసం సాగే ఉద్యమాల్లో మేధావివర్గం పాల్గొనాలి. ఈ ఉన్మాదాన్ని ఆపాలి! యుద్ధోన్మాదుల చర్యల్ని అరికట్టాలి! ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయాలి! ప్రపంచ శాంతి కాపాడబడాలి!

నిజంగా ఈ మారణాయుధాలకు ఖర్చుపెట్టేడబ్బు శాంతి ప్రయోజనాలకు ఉపయోగిస్తే జబ్బుల్ని నివారించవచ్చు, అవిద్య పోగొట్టవచ్చు, దరిద్రాన్ని రూపుమాపవచ్చు, ప్రపంచ ప్రజలందరికీ సుఖశాంతుల్ని కలగజేయవచ్చు.

సైంటిస్టులు ఎంతో శ్రమించి పరిశోధించినవన్నీ శాంతియుత పరిస్థితులున్నప్పుడే ఉపయోగపడతాయి. అందుకనే రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత కోట్లాది మందిని బలితీసుకొన్న దారుణ మారణ హోమం చూసిన తర్వాత ప్రపంచంలో అత్యున్నత స్థానంలోగల సైంటిస్టులు క్యూరీ, జార్జిబెర్నార్డ్, రస్సెల్ లాంటివాళ్ళు శాంతి యోధులుగా ముందుకు వచ్చారు. ఆ శాంతి ఉద్యమంలో మీరంతా పాల్గొని పోరాడినపుడే ప్రపంచశాంతి రక్షించబడుతుంది.

ఇదే రాజకీయమంటే.... శాంతి కోసం పోరాడటమే రాజకీయమంటే.... దానికెవ్వరూ వెనకాడ నక్కరలేదు. బెదరనక్కరలేదు. నిషేధాలూ, నిర్బంధాలూ ఉన్నా అది కనీస కర్తవ్యంగా మనం భావించాల్సి వుంది.

అలాగే రెండో విషయం—ఈరోజు మేధావి వర్గం ప్రజాస్వామ్య పరిరక్షణకోసం కంకణం కట్టాల్సిఉంది. రాజ్యాంగం ప్రసాదించిన హక్కుల్ని కాపాడుకోవాల్సిఉంది. మనది డెమోక్రటిక్ రిపబ్లిక్ అనీ, సెక్యులర్ స్టేట్అనీ, సోషలిజం మన లక్ష్యమనీ రాజ్యాంగం చెప్తున్నది. కాని మన పాలకవర్గం ఆ లక్ష్యాన్ని పేరుకు మాత్రమే మిగుల్చుతున్నది. మన ప్రజాస్వామ్యం నేడు కుంచింపబడుతున్నది. వంచింపబడుతున్నది. అధికారంలో ఉన్నవారే కులమత జాతి ప్రాంతీయ ద్వేషాల్ని రెచ్చగొట్టి, పబ్బం గడుపుకొంటున్నారు. ఎమర్జన్సీ అని పేరు పెట్టకపోయినా దాన్ని దొడ్డిదారిలో ప్రవేశపెట్టి అనుమానంమీద అరెస్టులు చేసే 'మీసా'లాంటి చట్టాలు, సమ్మె హక్కు హరించే ఆర్డినెన్సులు అమలుకు తెస్తున్నారు. న్యాయవ్యవస్థ మీద కూడా నేడు దాడి జరుగుతున్నది. సుప్రీంకోర్టు జడ్జీలదగ్గర నుండి హైకోర్టు న్యాయమూర్తులదాకా తమకు సలాం కొట్టినవాళ్ళకే పదవులూ—ప్రమోషన్లూ! ఈ విషయాన్ని ఆ వ్యవస్థకు చెందిన జస్టిస్ కన్నాలాల్, చంద్రచూడ్ లాంటి వాళ్ళే బట్టబయలుచేశారు.

వీటికి వ్యతిరేకంగా పోరాటం చెయ్యటం దోషంఎలా అవుతుంది? మన రాజ్యాంగంలోనే ఆదేశిక సూత్రాలతో పార్ట్ 4, ఆర్టికల్ 39లో ఉత్పత్తి సాధనాలు ఒకరి గుప్పెట్లోనే ఉండగూడదనీ, సంపదంతా కొద్దిమంది చేతుల్లోనే పోగుపడకూడదనీ నిషేధించటం జరిగింది: కాని ఆచరణలో ఇది తల్లక్రిందులుగా అమలు జరుగుతున్నది.

అంతేకాదు, మన సెక్యులరిజం నేతి బీరకాయ సామెతగా మారిపోయింది. చేనే కంచెను మేస్తున్నది. 'సెక్యులర్' అంటే మతాతీతమైనది. మతంతో ప్రమేయంలేనిది. మతం ప్రైవేటు వ్యవహారం. ఎవరి ప్రార్థనలు వారు చేసుకోవచ్చు. గుళ్ళూ, గోపురాలు కట్టించుకోవచ్చు. మసీదులూ, చర్చీలూ నిర్మించుకోవచ్చు. కాని ప్రభుత్వపరంగా దాన్ని తీసుకోగూడదు' అని మన రాజ్యాంగం నిషేధిస్తున్నది. కాని మన ఢిల్లీ పట్టణంలో, ఇతర ముఖ్య పట్టణాలలో మంత్రుల ఆధ్వర్యంలో, ప్రభుత్వాధినేతల ఆధ్వర్యంలో జరుగుతున్న ఈ యజ్ఞ యాగాలేమిటి? పూజా పునస్కారాలేమిటి? బ్రహ్మచారులూ, అమ్మలూ, బాబాలేమిటి? పబ్లిక్ వర్క్సు డిపార్ట్మెంటు తరపున జరిగిన శంకుస్థాపన సందర్భంలో మంత్రతంత్రాలు మామూలయ్యాయి. ఇదేం సెక్యులరిజం?

కాన ప్రభుత్వ యంత్రాంగానికి సంబంధించినంత వరకు, పరిపాలనకు సంబంధించినంత వరకు మతాన్ని దృష్టిలోకి తీసుకురావటానికి వీల్లేదు. మూఢవిశ్వాసాలకు చెందిన పాలకుల బుద్ధుల్లోవున్న ధోరణుల్ని మన బుర్రల్లోకి కూడా ప్రవేశపెట్టడాన్ని మనం నిరోధించాలి.

ఇటీవలనే బొంబాయిలో నెహ్రూ సెంటర్లో కొందరు మేధావులు ఒక బుక్‌లెట్ రిలీజ్ చేశారు. వారిలో మేధావులైన వామపక్షులకు చెందిన డా. రాజా రామన్న, బి.యస్. హక్కర్, ప్రొఫెసర్ యం.జి.కె. మీనన్‌లాంటి వాళ్ళున్నారు. ఆ బుక్‌లెట్ హెడ్డింగు "రీట్రీట్ ఫ్రం రీజన్" దానిలో ప్రభుత్వపరంగా మూఢవిశ్వాసాల్ని ఎలా వ్యాపింపజేస్తున్నారో చాలా వివరంగా తీసుకువచ్చారు. నెహ్రూ చెప్పిన 'రీజన్' అనేదాన్ని ఎలా వెనక్కుమళ్ళిస్తున్నారో దానిలో వివరించారు.

ఇదీ మనదేశంలో ఉన్న పరిస్థితి. మేధావులారా! ఆలోచించండి. మీరు చదువుచెప్పే పిల్లలకి ఈరకమైన రాజ్యాంగం నిషేధించిన విషయాల్ని గురించి చెప్పదల్చుకున్నారా? లేక సెక్యులరిజం, ప్రజాస్వామ్యం, సోషలిజం, హేతువాదాల్ని గురించి నిజమైన పాఠాలు చెప్పదల్చుకొన్నారా? ఆలోచించమని కోరుతున్నాను.

ఆఖరి విషయంగా చెప్పేదేమిటంటే— దేశం ఆర్థిక సంక్షోభంలోఉంది. మన పరిపాలకులు ఈ విషయాన్ని మాటల్లో చెప్పలేకపోయినా చేతల్లో చెప్పుకుంటున్నారు. దేశంలో ఆర్థిక పరిస్థితి బాగున్నదని ఓ ప్రకటన— ఆ మరునాడే ఆర్డినెన్సులు జారీచేయటం, పంటలు బాగాపండలేదని ఓ ప్రకటన.... ఆ మరునాడే అమెరికానుండి గోధుమలు దిగుమతి చేసుకొంటున్నామనటం ఇక పంచదార—బంగాళాదుంపలు ఇతర జీవితావసర వస్తువుల సంగతి చెప్పనక్కరలేదు. ఈ విధంగా మనదేశ ఆర్థిక పరిస్థితి అధ్వాన్నంగా ఉంది. ఫలితంగా ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. సామాన్యుని బ్రతుకుభారంగా మారుతున్నది. ఓ వైపుకోటీశ్వరులు పెద్దకోటీశ్వరులవుతున్నారు. మరోవయిపు దరిద్రులు నిష్టదరిద్రులవుతున్నారు. ఇది రాజకీయ ఉపన్యాసమైనా—వాస్తవమైన విషయం.

## మేధావులారా ఆలోచించండి!
## కార్యాచరణకు ఉపక్రమించండి!

ఈనాడు దేశం స్వార్థపర రాజకీయ నేతల చేతుల్లో, వాళ్ళ సాలె గూళ్ళల్లో చిక్కుకొని దీనావస్థలోఉన్నది.

కుక్షింభర రాజకీయనేతల కబంధహస్తాల్లో నలిగిపోతున్నది.

అవకాశవాద రాజకీయనేతల రాసక్రీడా మందిరంగా మారిపోతున్నది.

ఇవి నేను చెప్పిన మాటలు గాదు. మాజీ ఆర్థిక మంత్రి

శ్రీ సి. వి. సుబ్రహ్మణ్యం మాటలు. విజయవాడలో శ్రీ చలపతి రావు స్మారకసభలో అన్నమాటలు.

చాలామంది మంత్రులు పదవులు ఊడింతర్వాత యిలాగే నిజాలు చెప్తుంటారు. (సభలో నవ్వులు) కాన నిజం కావాలంటే ఈ పెద్దవాళ్ళ పదవులు ఊడగొట్టాలన్నమాట (పెద్దపెట్టున హర్ష ధ్వానాలు)

ఆయన అంటున్నాడు.

వెనకటి తరం నిస్వార్థమైనది. సేవాతత్పరత గలది. రుజు వర్తన గలది కానినేడో....

పదవీ వ్యామోహం, పైసల కోసం దాహం, సుఖలాలసత. పై వాటికి బదులు యీ మూడూ వచ్చాయంటున్నాడు.

గ్రామీణ పేదలు, పట్టణ కార్మికులు, నిరుద్యోగులు, అనేకానేక కోటానుకోట్ల పేదప్రజలు, సమాజపు అట్టడుగు పొరల్లో నేడు చీకి చివికి చిక్కిపోతున్నారు. తమల్ని పీడించే వర్గాలనుంచి విముక్తి పొందడంకోసం ఆరాటపడుతున్నారు. నిరాశ నిస్పృహలలో కొట్టుమిట్టాడుతున్నారు. రెండో వైపున ఏవో ఆశలు ఏవో భ్రమలు. ఎవరో వస్తారని ఏదో చేస్తారనే పద్ధతిలో, ఏదో అదృశ్య హస్తం తమను ఉద్ధరిస్తుందనే ఆశలో ఉండటం మనం చూస్తున్నాం. మరో వైపున అగమ్య గోచరమైన అరాచక మార్గంలో ఉద్యమాలు ప్రయాణం చేయటం కూడా మనం చూస్తున్నాం.

దీనులు, హీనులు, పతితులు, భ్రష్టులు బాధాసర్పదష్టులైన యీ కోట్లాదిమంది తమకు విముక్తి మార్గం చూపే ఓ స్పార్టకస్ కోసం ఎదురు చూస్తున్నారు.

మీరు మేధావులు, విద్యావేత్తలు, విద్యాదాతలు
భావితరాలను రూపుదిద్దే శిల్పులు!
మీ ప్రయాణం ఎటు వైపో ఆలోచించండి.

మీ లక్ష్యమేమిటో మీ గమ్యమేమిటో మీ హృదయాలను మీరు ప్రశ్నించుకోనండి! ఆలోచించి నిర్ణయాలు తీసుకోనండి. కార్యాచరణకు ఉపక్రమించండి!

ఒకవేళ ఇదే రాజకీయ కార్యకలాపమైతే సందేహించవలసిన పనిలేదు. శిక్షించినాగర్వంగా అనుభవించటానికి అర్హులమనేభావంతో నిర్భయంగా పురోగమించండి!

టుమ్రీ కథ

## గురువును మించిన.....

'రోగాలెందుకు వస్తాయి?'— విటమిన్ల పాఠం చెప్తూ అడిగేడు పిల్లల్ని పంతులుగారు.

ఒక్కమాటలో జవాబివ్వాలంటూ పోటీ పెట్టాడు.

'తిండి దొరక్క!' జవాబిచ్చాడు ఓ బక్క విద్యార్థి రకీమని.

'తిన్నదరక్క!' ప్రతిధ్వనించాడు ఓ లావుపాటి భావిపౌరుడు దాని నందుకొని.

అదిరిపోయాడు పంతులు .. ఆ జవాబుకు.

బెదిరిపోయాడు పంతులు.... ఆ చెప్పిన తీరుకు.

'కాలంరా... కాలం!' అంటూ మెచ్చుకున్నాడు చివరికి.

-'రత్నం'

సరికొత్త పాతకథ

## చలిచీమల చేతజిక్కి......

అనగా అనగా ఓ వీర్రాజు
అతనికి ఏడుగురు కొడుకులు
ఏడుగురూ కూలికెళ్ళి ఏడురూపాయలు తెచ్చారు
ఏడూ పెట్టి సంతకెళ్తే.... ఏ సరుకూ దొరకలేదు....
'సరుకూ.... సరుకూ ఎందుకు దొరకలేదు?'
'ధరలదుబ్బు అడ్డం వచ్చింది!'
'ధరలూ.... ధరలూ! ఎందుకు అడ్డంవచ్చారు?'
'వ్యాపారులు తగ్గించలేదు?'
'వ్యాపారీ.... వ్యాపారీ.... ఎందుకు తగ్గించలేదు?'
'ప్రభువులకు లంచాలివ్వాల్సి వచ్చింది!'
'ప్రభువా.... ప్రభువా.... ఎందుకు లంచాలు?'
'భోగాలులేక బొజ్జ ఏడుస్తున్నది!'
'బొజ్జా.... బొజ్జా.... ఎందుకేడుస్తున్నావ్?'
'జనం తిరగబడి చీమల్లా కుడుతున్నారు!'
'చీమా ... చీమా.... ఎందుకు కుడుతున్నావ్?'
'నా నోటికాడ కూడు తీస్తే నేను కుట్టనూ!'
దీర్ఘంతీస్తూ అంది చిట్టిచీమ.
—కథ కంచికి.... మనం చీమల్లోకి!




భీమవరంలో అత్యంత జయప్రదంగా జరిగిన యు. టి. ఎఫ్, తృతీయ విద్యా వైజ్ఞానిక మహాసభలలో ప్రతినిధులు సుదీర్ఘ హర్షధ్వానాల మధ్య హైదరాబాద్‌లో యు. టి. ఎఫ్ భవనం ఏర్పాటు చేయాలని తీర్మానించారు. అప్పటికప్పుడే కొందరు విరాళములు అందించారు. మరికొందరు వాగ్దానములు చేశారు ఖమ్మం మహాసభల చిహ్నంగా విజయవాడలో చెన్నుపాటి భవనం నిర్మించుకున్నాం. భీమవరం మహాసభల చిహ్నంగా హైదరాబాద్‌లో భవనం నిర్మించుకుందాం. మహాసభల పిలుపును జయప్రదం చేయండి; విరివిగా విరాళాలు స్వీకరించి అందజేయండి. దాతల పేర్లన్నీ పత్రికలో ప్రకటిస్తాం. విరాళములు అందజేయవలసిన అడ్రసు: ప్రధాన కార్యదర్శి యు. టి. ఎఫ్. పాలపర్తివారివీధి, విజయవాడ-520002.

### మహాసభలో విరాళాలు అందించినవారు

| | |
|---|---|
| శ్రీ కె. బక్కయ్య నెల్లూరు | 516-00 |
| శ్రీ ఎ. సుబ్బారావు కొత్తపేట తూ. గో. | 100-00 |
| శ్రీ పి. బి. ముత్తారావు రాజమండ్రి ,, | 116-00 |
| శ్రీ జి. వేణునాథం ముంగండ ,, | 116-00 |
| శ్రీ సి. వెంకటేశ్వర్లు పూసపాడు ప్రకాశం | 100-00 |
| కుమారి బి. కృష్ణకుమారి, యండగండి ప.గో. (తల్లి శ్రీమతి సీతాతులసి జ్ఞాపకార్థం) | 58-00 |
| శ్రీ కె. యాదగిరి నకిరేకల్లు నల్గొండ | 25-00 |
| మొత్తం | 1031-00 |

వీరుగాక శ్రీ విశ్వనాథం గుంటూరు500-00, యు. పి. ఎస్. నాగిల్ల, యం.నగర్ రు 116-00, శ్రీ సి. వీరయ్య సుబ్లేడు ఖమ్మం రు 116-00, శ్రీ పి. వీరవెంకట్రావు కోరుకొండ తూ.గో. 116-00, శ్రీ పి. జానకిరాం రాయవరం తూ. గో. 116-00, శ్రీ కె. మోహనరావు రాయవరం తూ గో. 116-00, శ్రీమతి పి. భారతమ్మ యిలుకుదురు గుంటూరు 116-00, శ్రీ పి. అల్లూరురెడ్డి తర్లుబాడు ప్రకాశం 116-00, శ్రీ జి. వెంకటరెడ్డి కరీంనగర్ 116-00, శ్రీ బి, నారాయణశెట్టి (శ్రీ బి. వెంకటసుబ్బయ్యగారి అన్నగారు) గారి పేర రు. 116-00లు, శ్రీ ఎస్. మల్లికార్జునరావు రుద్రపాక 116-00 లు, శ్రీ వి. వెంకటరత్నం మొవ్వ 116-00లు, శ్రీ యం. వి. కృష్ణారావు మొవ్వ రు 116-00(కృష్ణాజిల్లా) భవన నిధికి విరాళములు యిచ్చుటకు వాగ్దానాలు చేశారు.

### ముఖ్య ప్రకటన

భీమవరం మహాసభల్లో మంగళ సూత్రం దొరికింది. పోయినవారు వివరాలుతెల్పి రాష్ట్ర కార్యాలయం, విజయవాడ నుండి పొందవచ్చు ॥సం॥

మినీ మీసా కథ

## అగ్నిపరీక్ష

ఏదో తరగతి పబ్లిక్ పేపర్లు దిద్దుతున్నాడు స్పాట్‌సెంటర్లో ఓ బడిపంతులు.

అది సోషల్ స్టడీస్ పేపరు.

ఎర్ర పెన్సిల్ చకచకా నడుస్తూ.... బిట్ ప్రశ్నల దగ్గర.... ఓ చోట తకీమని ఆగిపోయింది

'మీ గ్రామ సర్పంచ్ ఎవరు ?'

'ఇందిరమ్మ'

'మీ సమితి ప్రెశిడెంటో ?'

'ఇందిరమ్మే !'

'మరి మీ పరిషత్ ఛైర్మనో ?'

'ఇందిరమ్మ.... ఇందిరమ్మ !'

'పోనీ.... మీ యం. యల్. ఏ.'

'ఎన్నిసార్లు చెప్పాలి.... ఇందిరమ్మేనని !' —అంతటితో ఆగలేదు ఆ రాలుగాయి.

మా ముఖ్యమంత్రి ఇందిరమ్మే !

అసలు ఇండియా అంటేనే ఇందిరమ్మ ! —అంటూ జవాబులు రాశాడు.

'కొట్టేయాలా .... ఉంచాలా ?' —డోలాయమాన స్థితిలో పడ్డాడు పంతులు.

కళ్ళముందు మీసాలు.... నాసాలు .. అర్డినెన్సులూ !

అమ్మ చాటున బ్రతికే నాయకులు.... వినాయకులూ !

నిజానికయితే మార్కులు వేయాలి !

పరీక్షల్లో అయితే కొట్టేయాలి.

—ఏం చేయాలి ? ఏం చేయాలి ?

ఏమీ తోచక చీఫ్ ఎగ్జామినర్ దగ్గరికి పట్టుకుపోయాడు ఆ పరీక్ష పత్రాన్ని.

ఆయన మాత్రం తక్కువ తిన్నాడా ?

'నీ యిష్ట'మంటూ భయం.... భయంగా చూశాడు దానివైపు.

ఏం చేస్తాడు పాపం....?

బడిపంతులాయె ! బ్రతుకు గడవాలాయె !

చివరికి ధైర్యంచేసి సగం రెట్లూ.... సగం ఇంటూలూ పెట్టి భట్టిప్రోలు తీర్పు అమలులో పెట్టాడు....

-'మైనేని'

### భీమవరం మహాసభలకు రాజుపాలెంసమితి ప్రజాసంఘాల విరాళం

భీమవరం మహాసభలు దిగ్విజయం గావాలని కోరుతూ గుంటూరుజిల్లా రాజుపాలెం సమితికి చెందిన ఆంధ్ర ప్రజానాట్యమండలి 88 తాళ్ళూరుశాఖ రు 50లు, ప్రజాతంత్ర యువజన సంఘం, ఉయ్యందనశాఖ రు. 50లు విరాళం పంపారు.

# స్వాగతోపన్యాసం



వి. కె. డి. వి. సత్యనారాయణరాజు (కనకరాజు)

ఆహ్వానసంఘ అధ్యక్షుడు

## అధ్యక్ష మహాశయా !
## ఐక్య ఉద్యమ ప్రతినిధులారా !

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ తృతీయ విద్యా వైజ్ఞానిక మహాసభలకు రాష్ట్రం నలుమూలల నుండి విచ్చేసిన ప్రతినిధులకు, సౌహార్ద ప్రతినిధులకు, ప్రత్యేకాహ్వానితులకు, ఉపన్యాసకులకు, ప్రజా నాయకులకు, ప్రభుత్వాధినేతలకు, తదితర పెద్దలందరికి, పశ్చిమగోదావరిజిల్లా ప్రజానీకం తరపునా,మాఆహ్వాన సంఘం తరపునా ఇదే నా హృదయ పూర్వక స్వాగతం!

సంకుచితమైన కుల మత ప్రాంతీయ తత్వాలకు అతీతంగా, అఖిలాంధ్రదేశంలోని అన్ని తరగతుల ఉపాధ్యాయుల్ని సమీకరించి సంఘటిత పరచిన ఐక్య ఉపాధ్యాయవేదిక ప్రతినిధులుగా మీకు సుస్వాగతం చెప్తున్నాను.

మీ ఉద్యమ పురోభివృద్ధినీ మీ కార్యకలాపాలనూ ప్రత్యక్షంగా చూచి తమ సందేశాలనూ, అభినందనలనూ అందజేయటానికి పలువురు పెద్దలు ఇతర రాష్ట్రాలనుండి ఎన్నోవ్యయప్రయాసలకోర్చి వచ్చారు. వారందరికీ ప్రత్యేక స్వాగతం చెప్తున్నాను.

మీ అందరినీ ఆహ్వానించే అదృష్టం కల్గినందుకుఆనందిస్తూ ఈ ప్రాంతపు విశిష్టతనుతెల్పటంకూడా నావిధ్యుక్తధర్మంగాభావిస్తున్నాను

పవిత్ర గోదావరికి పశ్చిమ ప్రాంతాన ఉన్నది మా జిల్లా. పావన గోదావరీ జలాలతో తడిసి, పదునెక్కి ఇచ్చటి భూమాత సదా సస్యశ్యామలమై ఆంధ్ర దేశపు ధాన్యాగారంగా పేరు పొందింది ఏటేటా ప్రభుత్వానికి 8 లక్షల టన్నుల ధాన్యమిచ్చి, అంతకు రెండు రెట్లు ఇతర రాష్ట్రాలకు తరలిస్తున్న జిల్లా మాది. వరిపంటా బియ్యం వర్తకం ఇచ్చట ప్రధాన జీవనాధారం.

జిల్లాలో చిన్న చిన్న పరిశ్రమలు కూడా వర్ధిల్లుతున్నవి. జూట్, పంచదార, కాగితం, రసాయనిక ఎరువులు, అట్టల పరిశ్రమ మొదలగునవి జిల్లా వ్యాప్తంగా అచ్చటచ్చటా నెలకొని ఉన్నవి. రైస్ మిల్లింగ్ అన్ని ప్రధాన పట్టణాలలోను ప్రధాన పరిశ్రమ.

రాజకీయంగా యీ తాలూకాకూ, ప్రత్యేకించి భీమవరం పట్టణానికి ఒక విశిష్ట స్థానమున్నది. అనేకానేక మంది త్యాగంతో వందేమాతరం నుండి క్విట్ ఇండియా ఉద్యమం వరకు వేలాది దేశభక్తుల్ని అంకితం చేసిన తాలూకా యిది. పన్నుల నిరాకరణోద్యమంలో రెండవ బార్డోలీగా ప్రశంసింపబడిన పట్టణమిది.

ఏబదియేండ్లనాడు అసూర్యంపశ్యలైన ఉన్నత కుటుంబాలకు చెందిన వందలాది స్త్రీలు బయటికి వచ్చి విదేశీ వస్త్ర బహిష్కరణలోను, కల్లుదుకాణాలముందు పికెటింగులోను పాల్గొనిన సంస్కారభూమి యిది.

అన్నిటికంటె మించి మన్య ప్రాంతంలో విప్లవాగ్ని రగిల్చి ఆంధ్ర పౌరుషాగ్ని జ్వాలగా గణుతికెక్కిన అల్లూరిసీతారామరాజు జన్మించిన "మోగల్లు" ఈ సమీపంలోనే ఉన్నది.

సంఘసంస్కర్త, నవలాకారుడు అయినచిలకమర్తి, ప్రముఖ కవులుగా ప్రసిద్ధి చెందిన తిరుపతి వెంకట కవులలోని దివాకర్ల తిరుపతిశాస్త్రి, హాస్యరస బ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావు, చిత్రకారుడు నవలాకారుడు అయిన అడవి బాపిరాజు, అంకాల వెంకట సుబ్బారావు, మృదంగ ప్రవీణ ఎల్లా వెంకటేశ్వరరావు, ప్రముఖ న్యూరో సర్జన్ బాల పరమేశ్వరరావు అణుశాస్త్ర నిష్ణాతులైన డా॥ స్వామి జ్ఞానానందయీప్రాంతీయులే.

పంచారామ క్షేత్రాలలో ఒకటియైన సోమారామం, పురాతన భీమేశ్వరాలయం యీపట్టణ ప్రాంగణంలోనే ఉన్నవి. యావద్భారత ప్రసిద్ధి పొందిన, అసలైన ప్రకృతి చికిత్సాలయమని బాపూజీచే ప్రశంసింపబడిన శ్రీ రామకృష్ణ ప్రకృతి ఆశ్రమం ఈ పట్టణంలోనే ఉన్నది.ఆదర్శగ్రామమైనకోపల్లెఈతాలూకాకుమరింతవన్నెతెస్తున్నది

నరసాపురం నుండి ఉప్పుటేరు వరకు సముద్రతీరం వ్యాపించి ఉంది. అచ్చట చమురు నిక్షేపాల అన్వేషణ కొనసాగుతున్నది. ఆ కృషిఫలిస్తే నరసాపుర ప్రాంతానికి ప్రత్యేక ప్రాధాన్యత లభిస్తుంది.

వైద్యరంగంలో ఇచ్చట I. M. A. శాఖవారు ఒక స్వంత భవనం నిర్మించి, ప్రతిదినం ఒక డాక్టరు చొప్పున ఉచిత చికిత్స చేయటం ఇచ్చటి ప్రత్యేకత.సమావేశ స్థలమైన డి.యన్.ఆర్.కాలేజి చిరప్రసిద్ధి చెందిన కళాశాల. విద్యాదాతల, వదాన్యులదీక్షా ఫలితమిది.

ఈ విధంగా పాడిపంటల్లో, సంస్కృతిలో, సంస్కారంలో లలితకళాపోషణలో, విద్యాభివృద్ధిలో యీ ప్రాంతం ప్రత్యేకత సంతరించుకొన్నది. దానికి తగినట్టు యీ మహాసభలు మాభీమవరం పట్టణానికి మరింత వన్నె పెడుతున్నవి.

"భారతదేశపు భవిష్యత్తు పాఠశాల గదులలో రూపొందింపబడుతుంది" అన్నది కొఠారి కమిషన్ నివేదిక ప్రారంభవాక్యం. దానిని వాస్తవం చేయాలన్న మీ దృఢ దీక్ష అభినందనీయం.

దానికి తగిన ఆలోచనలు చేసి, తగు సంస్కరణలు సూచించి వాటిని ఉద్యమపరంగా సాధిస్తారని, తద్వారా జాతి నిర్మాతలుగా కీలకపాత్ర వహిస్తారని, నేడు విద్యారంగాన్ని ఎదుర్కొంటున్న సమస్యల్ని ఆమూలాగ్రంగా చర్చించి శాస్త్రీయమైన నిర్ణయాలు చేస్తారని, వాటి అమలుకు చిత్తశుద్ధితో పాటుబడతారని ఆశిస్తూ మరొకసారి మీ అందరికీ మా హార్దిక స్వాగతాన్ని అందజేస్తున్నాను.

ఈ మహాసభలు దిగ్విజయం కావటానికి తోడ్పడిన దాతలకూ, కార్యకర్తలకూ విద్యాభిమానులందరికీ నా కృతజ్ఞతాభివందనాల్ని అందిస్తున్నాను.



### ఉద్యమ పురోగామి దృక్పథాన్ని ప్రతిబింబించిన

# అధ్యక్షోపన్యాసం

వేదికనలంకరించిన పెద్దలారా !

మహాసభ ప్రతినిధులారా !

సౌహార్ద్ర ప్రతినిధులారా !

పురప్రముఖులారా ! విద్యావేత్తలారా !

సోదర సంఘ నాయకులారా !

రమణీయ ప్రకృతి శోభతో భాసిల్లుతూ, విద్యాభిలాషులకు నిలయమైన ఈ భీమవరంలో మన తృతీయమహాసభ జరుపుకొనుట ఆహ్లాదకరంగా ఉన్నది. అడిగిందే తడవుగా అన్ని ఏర్పాట్లు చేసిన ఆహ్వాన సంఘము వారికి మనం కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

ఆగస్టు 10 మన సంఘ జన్మదినం. అప్పుడే 7 సం॥లు నిండి 8 వ ఏట అడుగిడినాం. 1975 అక్టోబరులో మొదటి మహాసభ రాజమండ్రిలోను, 1977 ఆగస్టు 17, 18 తేదీలలో ద్వితీయ మహాసభ ఖమ్మంలో జయప్రదంగా జరుపుకున్నాం. ఎమర్జన్సీ చీకటి తొలగి, అప్పుడే వీస్తున్న స్వేచ్ఛావాయువులు పీలుస్తూ 10 వేల మంది ప్రతినిధులతో 2 రాష్ట్రాల సౌహార్ద్ర ప్రతినిధులతో ఆనాడు ఖమ్మం మహాసభ జరుపుకున్నాం.

సరిగ్గా 4 సం॥రల తర్వాత ఈనాడు అత్యవసర సర్వీసులలో సమ్మె నిషేధ ఆర్డినెన్సు చర్యల మధ్య, శరవేగంతో పెరుగుతున్న ఆర్థిక సంక్షోభవాతావరణంలో, 10 సం॥రాల అనంతరం తిరిగి స్థానిక సంస్థలలో ప్రజా ప్రతినిధుల పాలన ప్రారంభమయిన సమయంలో ఈ మహాసభ జరుపుకుంటున్నాం. అభ్యుదయకర అఖిల భారత ఉపాధ్యాయ ఉద్యమానికి నాందిగా అనేక రాష్ట్రాల నుండి ఈ మహాసభకు సౌహార్ద్ర ప్రతినిధులు విచ్చేయటం ముదావహం.

గత 4 సం॥ రాల కాలంలో మన సంఘం బహుముఖంగా విస్తరించింది. సభ్యత్వం 40 వేలకు చేరింది. 23 జిల్లాలలో శాఖలు ఏర్పడ్డాయి. అన్ని హంగులతో కూడిన స్వంతభవనం, మీటింగుహాలు ఏర్పడ్డాయి. ప్రచురణ విభాగం 5 ఆధ్యాపక దర్శినులు, ఓక డైరీతో పాటు సాహిత్యరంగంలో ప్రవేశించి గోర్కీ సాహిత్యం మొదటి కుసుమంగా 'నగరాన్ని' నేడు మీ కందిస్తున్నది.

అనేక పోరాటాలు నిర్వహించి నేడు మనం ఆంధ్రదేశంలో ఉపాధ్యాయ ఉద్యమంలో కీలకపాత్ర వహిస్తున్నాం. అన్ని క్యాడర్ల ఉపాధ్యాయులకు ప్రాతినిధ్యం వహిస్తూ అన్ని జిల్లాలలో శాఖలు గల ఏకైక సంఘం మనది. అందుచేతనే ప్రతి సమస్యకు రాగద్వేషాల కతీతంగా సర్వాంగీకార పరిష్కారం చూపగలమనే ప్రతిష్ఠ మనకుంది. అందువల్లనే మన మహాసభ చర్చించే విషయాలను రాష్ట్రమంతటా విద్యాభిమానులు ఎంతో ఆసక్తితో గమనిస్తున్నారు.

జాతీయంగా, అంతర్జాతీయంగా కూడా నేడు అనేక క్లిష్ట పరిస్థితుల నెదుర్కొంటున్నాం. వీటి ప్రభావం అన్ని రంగాలతోపాటు విద్యారంగంలో కూడా తప్పనిసరిగా ప్రతిబింబిస్తాయి. రేపే అత్యవసర సర్వీసుల ఆర్డినెన్సులకు వ్యతిరేకంగా, దేశవ్యాప్తంగా నిరసన ప్రదర్శనలు జరుగనున్నాయి.

మన విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యలను క్షుణ్ణంగా చర్చించి సరియైన అవగాహన పొంది, సరియైన మార్గాన్ని ప్రజల కందించాలి. అందుకనే ఈ మహాసభలో వరుసగా 3 రోజులు విద్యాగోష్ఠులు నిర్వహిస్తున్నాం. అనేక విషయాలపై ముఖ్యమైన డాక్యుమెంట్లు మీ ముందుంచుతున్నాము.

## విద్యారంగ పరిశీలన

ముందుగా మనదేశ విద్యారంగాన్నిగూర్చి సంక్షిప్తంగా తెలుసుకొందాం. స్వాతంత్ర్యం లభించిన అనతికాలంలోనే అనేక సామ్యవాదదేశాలు యుద్ధప్రాతిపదికపై కృషిచేసి నిరక్షరాస్యత నిర్మూలించుకున్నాయి. కాని మనకు స్వాతంత్ర్యంవచ్చి 34 సంవత్సరములు అయినా రాజ్యాంగం 45 ఆర్టికలులో నిర్దేశించినమేరకు 1960 నాటికి 14 సం॥లలోపు వారందరకు నిర్బంధోచిత విద్యను గరుపలేకపోయాం. మరో 30 సం।లలోకూడా సాధిస్తామనే ఆశ కూడా లేదు. 1971 జనాభాలెక్కల ప్రకారం మొత్తం జనాభాలో చదువుకున్నవారు20.45శాతం మాత్రమే.అందులో ఆంధ్రప్రదేశ్‌లో 24.57శాతం మాత్రమే. వారిలో స్త్రీలు దేశంలో 18.70శాతం అక్షరాస్యులుకాగా మన రాష్ట్రంలో 5.75శాతం మాత్రమే వున్నారు. 1981 లో కూడా దాదాపు యిదే పరిస్థితి కొనసాగుతుంది. పెరుగుతున్న జనాభావల్ల అక్షరాస్యులసంఖ్య పెరిగినా నిరక్షరాస్యులశాతం అంతకంటే ఎక్కువయింది. మరోప్రక్క పాఠశాలలలో ప్రవేశించటమే కష్టంగా ఉంటే 1 వ తరగతినుండే చదువు మానేవారు ఎక్కువవుతున్నారు. 5వ తరగతికి 25శాతం మందే చేరుతున్నారు.ఆ సంఖ్య క్రమంగాపెరిగి,డిగ్రీస్థాయికి చేరువారు 4శాతం మాత్రంగా ఉన్నారు.

దీనికి ప్రధాన కారణం దుర్భర దారిద్ర్యం. ఈ కారణాన్ని పరిష్కరించకుండా ఎన్నిచట్టాలు చేసినా ఫలితాలు హూజ్యంగానే

వుంటా ు దీనికితోడు విద్యారంగం ఎడ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నిర్లక్ష్యం వల్ల యీ సంక్షోభం మరింత తీవ్రమయింది. 1968 లో పార్లమెంటు ఆమోదించిన జాతీయ విద్యా విధానం ప్రకారం విద్యా పద్దుకు జాతీయాదాయంలో 10 శాతం ఖర్చుపెట్టాలి. అదికూడా చాలదని మనం చెబుతున్నాం. కాని గత 30 సం॥లో రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలేవీ 3 శాతంకూడా విద్యకు ఖర్చుపెట్టలేదు. మనరాష్ట్రంలో 1974-80 లో ఖర్చుపెట్టిన రు. 2734.41 లక్షలు బడ్జెట్లో 15 శాతం మాత్రమే. 6 వ ప్రణాళికలో 1980-85 సం॥లలో 4100 కోట్లకుగాను విద్యకు 86 కోట్లు మాత్రం అనగా 2.1 శాతం మాత్రమే కేటాయించారు. అందువల్లనే పాఠశాలల భవనాలుగాని, భౌతిక పరిస్థితులుగాని, ఉపాధ్యాయుల సంఖ్యగాని అవసరానికను గుణంగా పెరగటంలేదు.

నేటి విద్యా విధానం ప్రధానంగా పట్టణవాసులకు, ధనికవర్గాలకుకుపరించేదిగా తయారయింది. కళాశాలలు, యూనివర్శిటీలు ప్రధానంగా పట్టణాలలో ఉన్నాయి. సిలబసు మొత్తంలో పట్టణ వాతావరణం ప్రతిబింబిస్తున్నది. లోయరు కె. జి. తో ప్రారంభించి యూనివర్శిటీ వరకు ధనికవర్గాలు తమ బిడ్డలకు ప్రత్యేక విద్య గరిపించుటకు అవకాశాలు అనుమతించబడ్డాయి. అందుకనే కాన్వెంట్లు, ఇంగ్లీషు మీడియం పాఠశాలలు మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లు తున్నవి. ఉన్నత విద్యావకాశాలను గుప్పెట్లో పెట్టుకొన్న ఈ సంపన్న వర్గాల నిరుద్యోగ యువకులే సామాన్యుల నుద్దేశించిన చిన్న ఉద్యోగాలతో సహా పెద్ద ఉద్యోగాల వరకు పోటీ పడి సామాన్యుని కెక్కడా తావులేకుండా చేస్తున్నారు. అనారోగ్య పోకడలకు వ్యతిరేకంగా ప్రజలందరికి సమాన విద్యావకాశాలుండే విధానాలకై మనం పోరాడాలి. కాన్వెంట్లను ఛాలెంజిగా తీసికొని మనం మన పాఠశాలలను ఆకర్షణీయంగా తీర్చి వాటిపైగల మోజు తగ్గించుటకు కృషిచేయాలి.

విద్యారంగం అన్ని స్థాయిలలో వృత్తి విద్యాకోర్సులు ప్రవేశ పెట్టాలని మనం కోరుతున్నాం. ఇంటర్మీడియట్ స్థాయినుండి 1979-80 లో 22 కళాశాలలలో 34 వృత్తి విద్యాకోర్సులు ఏర్పాటుచేసిన మన ప్రభుత్వం 80-85 సం॥రాలలో దాని విస్తరణకు నిధులు కేటాయించక పోవడాన్ని మనం తీవ్రంగా గర్హించాలి.

## త్రిభాషా సూత్రం - వైరుధ్యాలు

మానసిక శాస్త్రప్రకారం త్రిభాషాసూత్రం అనారోగ్యకరమైనది. మాతృభాషలో అసమగ్రజ్ఞానంసంపాదించిన విద్యార్థి ఐచ్ఛికంగా అవకాశాలు కల్పిస్తే అవసరాన్నిబట్టి ఎన్ని భాషలైనా నేర్చుకుంటాడు అందుకేమనం7తరగతులవరకుమాతృభాషలోనేబోధన జరగాలనిఆపై నిఖచ్చితంగా ఇతరభాషలునేర్చుకొనుటకు వీలుకల్పించాలని కోరుతున్నాం. కొఠారికమీషన్ త్రిభాషా సూత్రం సిఫారసుచేసింది. దాని ప్రకారం లోయరు ప్రయమరీలో రెండవభాషని బోధించరాదు. మన రాష్ట్ర ప్రభుత్వం 1-5 లోయరు ప్రైమరీగా పరిగణిస్తుంది. గాన 5వ తరగతిలో రెండవభాషగా ఆంగ్లభాష బోధించడం విడ్డూరంగా వుంది. 8వ తరగతికి లోపు 3వ భాషగా హిందీ నిర్బంధం చేయడం కూడా త్రిభాషా సూత్రానికి విరుద్ధమే. అది 8 నుండి ప్రారంభించాలి గాన అన్ని ప్రాథమికపాఠశాలలను అప్పర్‌ప్రైమరీ పాఠశాలలుగా మార్చాలి. ఆలోగా 5వ తరగతి నుండి ఆంగ్లభాషను తొలగించాలి. హిందీని నిర్బంధంగా నేర్చుకొనుటకు అన్ని అప్పర్ ప్రైమరీ పాఠశాలలలో అవకాశం యిస్తారు. గాన హిందీ పండితులకు యిబ్బంది రాబోదు.

## వయోజన-సాంకేతిక విద్యలు

అనేక సామాజిక ఆర్థికకారణాలవల్ల మధ్యలోనే పాఠశాలలు వదలబోతున్న, అసలు పాఠశాలలకు రాని పిల్లలకు విద్యావకాశాలు కల్పించుటకు ప్రత్యేక కృషి జరగాలి. కాని మన ప్రభుత్వం 6వ ప్రణాళికలో 5 సం॥లకు కేటాయించినమొత్తం 5½ కోట్లు మాత్రమే. ఈ నత్తనడక విధానం వదలి యుద్ధప్రాతిపదికపై వయోజన విద్యా కార్యక్రమం చేపట్టాలి.

వీరికి అక్షరాస్యతతోనే సరిపెట్టక అన్ని రంగాలలో పని చేసేవారికి నిరంతర విద్యావిధానం అమలు జరపాలి. మన సంఘ సభ్యులు ఐచ్ఛికంగా ఈ కార్యక్రమం చేపట్టి తమసామాజిక బాధ్యతను నెరవేర్చాలని కోరుతున్నాను.

## పాఠ్యపుస్తకాలు - గైడ్లు

పాఠ్యపుస్తకాల తయారీలో తరగతి ఉపాధ్యాయునికి పాత్ర ఉండాలి. తరగతులమధ్య, సబ్జక్టులమధ్య సమన్వయ ముండాలి. రాజ్యాంగంలో పేర్కొనిన ఆశయాలు, ప్రజాస్వామ్యం, సెక్యులరిజంల కనుగుణంగా విద్యార్థులలో శాస్త్రీయ దృక్పథాన్ని సామాజిక స్పృహను పెంచేవిధంగా పుస్తకరచన వుండాలి. ప్రభుత్వమే పుస్తక ప్రచురణ చేస్తున్నందున వీలైనంత చౌకధరలకు పుస్తకాలు లభ్యం కావాలి కాని వాస్తవం వీటన్నిటికంటె భిన్నంగా యున్నది. పుస్తకాల ధరలు 2, 3 రెట్లు హెచ్చుగా ఉన్నాయి. రాజ్యాంగ లక్ష్యాలకు, పాఠ్యాంశాల రచనలకు పొంతనలేదు. గైడ్లను తొలగించే ఉద్యమం తక్షణం అమలుజరపాలి. తరగతి ఉపాధ్యాయుని ప్రమేయంతో సరియైన పాఠ్యపుస్తకాలు సరియైన ధరలకు వచ్చేలా కృషిజరగాలి.

## పాఠశాలల భౌతిక పరిస్థితులు

పాఠశాలల భౌతిక పరిస్థితులు అధ్వాన్నంగా వున్నవి. ఏకోపాధ్యాయ పాఠశాలలలో 90శాతం ప్రాథమిక పాఠశాలలలో 70శాతం ఉన్నత పాఠశాలలలో 20శాతం స్వంత భవనాలుగాని, మంచి భవనాలుగాని లేవు. పట్టణాలలో గాని, వెలుతురుకూడాలేని చీకటి గదుల్లో ఆటస్థలం మచ్చుకు కూడా లేనిచోట పాఠశాలలు నడుస్తున్నాయి. అందుచే పిల్లలలో బడికి వెళ్ళాలనే ఆసక్తి నశిస్తుంది. మంచి భవనాలు, మరుగుదొడ్లు, మంచినీటి వసతులు ఆటస్థలములు, ఫర్నిచరు, లైబ్రరీ, లేబొరేటరీలు, పాఠశాలల కేర్పాటుచేయుటకు కృషి జరగాలి. అప్పుడే కాన్వెంటులపై మోజుకూడా తగ్గుతుంది. ముఖ్యంగా బాలికలకు, లేడీ టీచర్లను కనీస వసతులుకూడాలేని పాఠశాలలున్నాయంటే వీటి దీనస్థితి మనకర్థమవుతుంది.

## విద్యా వ్యాపారాన్ని అరికట్టాలి

విద్య వ్యాపారవస్తువుగా మారింది. సంపన్నులైనవారు విద్యనుకూడా లాభసాటిగా భావించి, ఈ మధ్య వృత్తికళాశాలల్తో సహా అన్నిరకముల పాఠశాలలు పోటీలుపడి స్థాపిస్తున్నారు. డొనేషనుల పేరుతో విద్యార్థులను దోచుకుంటున్నారు ప్రైవేటు మేనేజిమెంటు పేరుతో ఉపాధ్యాయులను బానిసలుగా పరిగణిస్తూ పీడిస్తున్నారు. నవ సమాజం ధ్యేయంగాగల మన దేశంలో ఈ వ్యాపారం కొనసాగటం అరిష్టదాయకం. నూటికి నూరుపాళ్ళు విద్యా గ్రాంట్లు

స్తున్న ప్రభుత్వం ఎయిడెడ్ పాఠశాలలన్నింటినీ స్వాధీనం చేసుకోవాలి. కిండరుగార్డెను మొదలు యూనివర్సిటీ వరకు ప్రజలందరికి సమాన విద్యావకాశాలు కల్పించాలి. దోపిడీ వ్యాపారాన్నరికట్టాలి. మైనారిటీవారు స్వంతఖర్చుతో పాఠశాలలునడుపుటకు అనుమతించినా పాఠశాలలలో పనిచేయు ఉద్యోగుల సర్వీసు పరిస్థితులకు రక్షణ కల్పించాలి. అన్నిపాఠశాలల్ని ఉపాధ్యాయులు భాగస్వాములుగాగల విద్యా బోర్డులకు అప్పగించాలి.

## పరీక్షలు - సంస్కరణలు

పరీక్షా విధానంలో సంస్కరణలు తేవాలని తరచు ప్రయోగాలు జరుగుతున్నాయి. నాన్ డిటెన్షను విధానం ప్రవేశపెట్టబడింది. తిరిగి పుస్తకాలు చూచి పరీక్షలు వ్రాసే పద్ధతి రాబోతున్నది. విద్యార్థి ప్రతిభకు ఉపాధ్యాయులు మార్కులిచ్చే పద్ధతి అమలుకానున్నది. పుస్తకాలు చూచి పరీక్షలు వ్రాసే పద్ధతి క్రొత్తది. అనాదిగా పరీక్షల యెడ జీర్ణించుకున్న మన అవగాహనకు భిన్నమైనది. సరియైన ఏర్పాట్లు జరగకుండా చేసే ప్రయోగమేదైనా విఫలంకాక తప్పదు. సూత్రరీత్యా ఈ విధానానికి మనం వ్యతిరేకులం కాము. విస్తృతంగా దీన్ని గూర్చి చర్చలు, శిక్షణలు, గోష్ఠులు, జరగాలి. పాఠ్యగ్రంధాలు దీనికనుగుణంగా మార్చబడాలి. అప్పుడే ఈ మార్పు ప్రవేశపెట్టాలని మనం డిమాండు చేయాల్సివుంది.

## విద్యాసంస్కరణలు - కమీషన్లు

కమిషన్లు వేయడం, కష్టించి తయారుచేసిన ఆ నివేదికల్ని బుట్టదాఖలా చేయడం ప్రభుత్వానికి పరిపాటి అయింది. అందుకనే డా॥సర్వేపల్లి రాధాకృష్ణ, డా॥లక్ష్మణస్వామి మొదలియార్ డా॥కొఠారి కమీషన్లు ఉపయోగకరమైన పలు సిఫారసులు చేసినా అమలుపరచినది బహుకొద్ది సిఫారసులు మాత్రమే. ఉపాధ్యాయ సంఘాలు ఆమోదించిన కొఠారిసిఫారసులన్నిటినీ ప్రభుత్వం అమలుజరుపునట్లు కృషిచేయాలి.

## ఉపాధ్యాయ సంక్షేమం

అన్ని మేనేజిమెంట్లలో పనిచేసే ఉపాధ్యాయుల పనిపరిస్థితులు ప్రమోషను అవకాశాలు ఇతర ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా ఉండాలి. వృత్తిభద్రత, వృద్ధాప్య పెన్షనులు, గృహనిర్మాణ వసతులు పిల్లలకు విద్య, ఉద్యోగఅవకాశాలు, ఆరోగ్యవసతులు. ఐక్యకార్యాచరణ సమితి ఆమోదించిన ప్రమాణాలు సిఫారసుల కనుగుణంగా సాధించుకొనుటకు సమైక్య ఉద్యమం నిర్మించాలి.

పౌరహక్కుల రక్షణకు, అధికధరలు అరికట్టుటకు, శాస్త్రీయ వేతన విధానం అమలుకు ఇతర శ్రామికవర్గాలతో భుజంభుజం కలిపి పోరాడాల్సి ఉంది.

## అఖిలభారత ఉపాధ్యాయ ఉద్యమం

మన దేశంలో దేశవ్యాప్త ఉపాధ్యాయ ఉద్యమం అంత బలిష్టంగాలేదు. ఉన్న కొద్ది సంస్థలు అవకాశవాద, సంకుచిత విధానాలతో కొట్టుకొనిపోతున్నాయి అందుకనే గత 7 సం॥లుగా భారత దేశ ఉపాధ్యాయఉద్యమ బలహీనతల్ని పెడధోరణుల్ని పరిశీలించిన మనం. మనభావాలనుఏకీభవించే ఇతరరాష్ట్ర ఉపాధ్యాయసంఘాలతో కలిసి పటిష్టమైన దేశవ్యాప్త అభ్యుదయకర ఉపాధ్యాయ ఉద్యమం నిర్మించాలని తలపెట్టాం. ఈ మహాసభకు విచ్చేసిన అనేక రాష్ట్రాల సౌహార్ద్ర ప్రతినిధులతో చర్చించి ఈ కృషి కొనసాగించబడుతుంది.

మహాశయులారా!

ఇసుక పాతరలాంటి మనరంగంలో చర్చించవలసిన అంశాలు యింకా అనేకమున్నవి. ఈ మూడురోజుల కార్యక్రమాలలో వక్తలు ప్రస్తావించే అనేక విషయాలు అందరు శ్రద్ధగాఅధ్యయనం చేయాలని ఈ మహాసభను జయప్రదం చేయటానికి అంతా చేయూతనిస్తారని ఆశిస్తూ.... మీ అందరికీ అభివందనలందిస్తూ....

భవదీయుడు

డి. రామిరెడ్డి

అధ్యక్షుడు.

## కార్యకర్తల్ని కర్తవ్యోన్ముఖుల్ని చేసిన

# కార్యదర్శి నివేదిక



అధ్యక్షా !

కా॥మేడ్స్ ! !

తృతీయ విద్యావైజ్ఞానిక మహాసభలకు తరలి వచ్చిన తమందరికీ స్వాగతం, సుస్వాగతం.

గోదావరి తీరాన, పంటపొలాల దరిలో, నారికేళ, కదళీ వృక్షాల గాలిలో పరవశించిన ప్రకృతి మధ్య జరుపుకొంటున్న మహాసభలివి.

1977 ఆగస్టు 17, 18 తేదీలలో ఖమ్మంలో ద్వితీయ విద్యా మహాసభలు అపూర్వంగా జరిగాయి. 4 వేలమంది ప్రతినిధులు, ఎటుచూచినా జనం, చివరికి పదివేలకు చేరినవైనం, అపూర్వమైన ఊరేగింపు, గోష్టులు, రికార్డులన్నీ బ్రద్దలుకొట్టి జయభేరి మ్రోగించింది.

ఆ మహాసభలలోనే భవనానికి పునాదులు పడ్డాయి. ఇప్పుడు మీటింగ్‌హాల్‌కూడా కట్టుకున్నాం. సభ్యత్వం అన్ని జిల్లాలకు విస్తరించి రెట్టింపు అయింది. ప్రచురణల విభాగం ప్రారంభమైంది. పోరాటాల ద్వారా ఉపాధ్యాయులు కొన్ని హక్కులు సాధించుకున్నారు. ఖమ్మం మహాసభలు అన్నివిధాలా ఉద్యమానికి వూపు నిచ్చాయి.

77 నుండి, 81 వరకు జాతీయ, అంతర్జాతీయ రంగాలలో అనేక మార్పులు జరిగాయి. ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ శక్తులు బలహీనపడ్డాయి. పోర్చుగీసు, అంగోలా, మొజాంబిక్‌లలో నియంతృత్వ ప్రజా వ్యతిరేక శక్తులు పతనమయ్యాయి. ఆఫ్ఘనిస్థాన్‌లో ప్రగతిశీల శక్తులు అధికారంలో కొచ్చాయి. ఇరాన్‌లోరాచరికానికి స్వస్తి జరిగినా, మతశక్తులు విజృంభించాయి. జింబాబ్వేలో తెల్లజాతి పాలన అంతమయింది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్, అమెరికాదేశాలు విముక్తి పోరాటాలు సాగిస్తున్నాయి.

అమెరికాఅధ్యక్షుడుగారీగన్; బ్రిటన్ ప్రధానిగాథాచర్ మరింత కరుడు గట్టిన విధానాలతో రాజ్యమేలుతున్నారు. వాషింగ్టన్‌కు 75 వేలతో ప్రదర్శన, ఐరిష్‌యోధుల ఆత్మాహుతి, నల్లజాతి ప్రదర్శనలపై దౌర్జన్యాలు అందుకు నిదర్శనాలు.

ఎన్ని కాయకల్ప చికిత్సలు చేసినా సామ్రాజ్యవాదానికి చావు మూడినదనేది తథ్యం, సామ్రాజ్యవాదులు తమ ఆయుధ వ్యాపారం ద్వారా తేవాలనుకుంటున్న ప్రపంచయుద్ధాన్ని, అపారమైన సోవియట్ బలం చెలియలికట్టలా ప్రపంచాన్ని రక్షిస్తున్నది. అదిదాటితే జరిగేది సామ్రాజ్యవాదుల పతనం, సోషలిస్టు దేశాల పురోగమన వ్యాప్తి.

నియంతృత్వాన్ని గద్దెదింపిన జనతా ప్రభుత్వం, పౌర హక్కులు పునరుద్ధరించినా, ప్రజాసమస్యలు పరిష్కరించలేక, అహంభావాలతో రెచ్చి అంతఃకలహాలతో చిక్కి పతనమైంది. తిరిగి అనేక వాగ్దానాలతో అధికారంలోకి వచ్చిన శ్రీమతి ఇందిరా గాంధి మాటలు కోటలు దాటినా ఆచరణ గడపదాటడం లేదు.

33 సం॥ల స్వతంత్రపాలన తర్వాత దేశంలో కులమత తత్వాలు, ప్రాంతీయ విబేధాలు, అస్సాం ఆందోళనలు సిక్కురాజ్యవాదులు చూ సుంటే దేశం ఒక్కటిగా మనగల్గుతుందా అని ఆవేదన కలుగుతుంది. పాలకుల క్షుద్ర రాజకీయాలు, అవకాశవాద విధానాలు, అశ్రితపక్షపాతాలే యిందుకు కారణం.

ఫలితంగా ప్రజలలో వచ్చే వ్యతిరేకతను, ఉద్యోగులలో అసంతృప్తిని అణచే దానికి మినీవీసాలు, నిర్బంధ చట్టాలు, సమ్మె నిషేధ ఆర్డినెన్సులు, పోలీసు నిర్బంధకాండలు ప్రభుత్వం చేపడుతున్నది. లోకోరన్నింగ్ స్టాఫ్ పైనను, యల్. ఐ. సి. ఉద్యోగుల పైనను, పబ్లిక్ సెక్టార్ ఉద్యోగుల పైనను ప్రభుత్వం చూపిన నిర్లక్ష్యం, నిర్బంధకాండ దారుణమైనది.

ఏమైనా దేశవ్యాప్తంగా రైతులు, కార్మికులు, ఉద్యోగులు, ప్రజలు సాగించిన, సాగిస్తున్న పోరాటాలు రోజురోజుకు బలపడి, ప్రభుత్వ విధానాలను త్రిప్పికొట్టగలవు.

మరోప్రక్క పశ్చిమ బెంగాలు, కేరళ, త్రిపుర, వామపక్ష, ప్రజాతంత్ర ప్రభుత్వాలు ఉన్న రాజ్యాంగ పరిమితులలోనే, కేంద్రం కల్పించే యిబ్బందులను అధిగమించి, తమ ప్రజలకు నిరుద్యోగభృతి, రైతులకు, వ్యవసాయ కూలీలకు పింఛను, పనిలేని రోజులలో భృతి, రైతులకు భూమిపై హక్కు మొదలగు చర్యల ద్వారా కృషి చేస్తున్నవి.

ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితులు దేశపరిస్థితులకు భిన్నంగాలేవు. రాజధానిలోనే ప్రజల ప్రాణాలకు భద్రతలేదు. రౌడీరాజ్యం, మత కల్లోలాలు పెచ్చుపెరిగి పోయాయి.

రాయలసీమలో దుర్భిక్ష పరిస్థితులు, రాష్ట్రప్రజల దురవస్థలు, మంత్రులు మారినా, తొలగలేదు. పైనుండి క్రింది వరకు, అన్నిరంగాలలో పెచ్చు పెరిగన అవినీతి జాతిమూల్గులను పీల్చివేస్తున్నది. పాల

కులు మాత్రం దీన్ని సీరియస్‌గా తీసుకోక జోక్సు వేస్తూ, కేక్సు మేస్తూ, హంగులనిస్తూ, రోజుకోరంగు మారుస్తూ, నోటికొచ్చినది కూస్తూ ప్రజల జీవితాలతో చెలగాటమాడుతున్నారు.

## 1 పూర్వ రంగం

అవకాశవాద విధానాల ఫలితంగా వేర్పాటువాదులు తలయెత్తి ప్రాంతీయ విద్వేషాలు హెచ్చుపెరిగి, ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలమధ్య వైషమ్యాలు రోజు రోజుకు పెరిగి రాజుకున్న రోజులవి.

మరోవైపు ఉపాధ్యాయ ఉద్యమంలో పెడధోరణలు ప్రవేశించి, ప్రజాస్వామ్య సూత్రాలు గాలికివొదలి ఐక్య ఉద్యమానికి కొందరు చిచ్చుపెట్టిన కారణంగా విశాలప్రాతిపదికపై ఐక్య ఉద్యమ నిర్మాణానికి నడుం కట్టవలసి వచ్చింది.

1947 ఆగస్టు 10 న యు. టి. యఫ్. అధ్యాపకుల ఆశలకు అనుగుణంగా, చెన్నుపాటి ఆశయాల ఆధారంగా ఏర్పడింది. అదే సంవత్సరం అక్టోబరు 20, 21 తేదీలలో రాజమండ్రిలో జరిగిన ప్రథమ విద్యామహాసభలలో, విశాల ప్రాతిపదికపై సమైక్య ఉద్యమ నిర్మాణానికి అనువైన నిబంధనావళి, అవసరమైన పాలసీ స్టేటు మెంటు రూపొందించబడ్డాయి.

వాటి ప్రాతిపదికపై 1975 జనవరి 11, 12 తేదీలలో తెలంగాణా వివిధ జిల్లాలనుండి వచ్చిన ఉపాధ్యాయ నాయకులు ఖాజీపేటలో సదస్సు జరిపి తెలంగాణాలో యు. టి. యఫ్. వ్యాప్తికి చరిత్రాత్మకమైన నిర్ణయం చేశారు. దాని ఆధారంగా 19-1-75 న యు. టి. యఫ్. కార్యవర్గం రూపొందించబడింది. జిల్లాల నిర్మాణానికి ఆర్గనైజింగ్ కమిటీలు ఏర్పడ్డాయి.

1977 ఆగస్టు 17, 18 తేదీలలో ఖమ్మంలో జరిగిన ద్వితీయ విద్యామహాసభలు, ఉద్యమాన్ని ఇతర జిల్లాలకు వ్యాపింపజేసి, పునాదులను గట్టి పరచింది.

ఉద్యమానికి సామాజిక దృక్పథం, సమరశీల పోరాట స్వభావం వున్న కారణంగా అన్ని పరీక్ష సమయాలలోను ఉపాధ్యాయుల పక్షాన నిలిచి పనిచేసింది. భ్రమలకు లోనుగాక, అవకాశవాద విధానాలకు లొంగిపోక, సూత్రబద్ధ వైఖరితో నిలిచి సాటిలేని మేటి సంస్థగా వెలసింది.

## సాగించిన ముఖ్య పోరాటాలు

### 1. వేతనస్తంభన చట్టవ్యతిరేక పోరాటం

1974 జూన్‌లో కేంద్రప్రభుత్వ నిరంకుశ సి.డి.ఆర్డినెన్సుకు వ్యతిరేకంగా కేంద్ర, రాష్ట్ర ఉద్యోగులతో కలిసి పోరాటంలో పాల్గొన్నాం. హైదరాబాదులో నవంబరు 3న జరిగిన సదస్సులో పాల్గొన్నాం. జిల్లా సమితి స్థాయిలోకూడా సదస్సులు నిర్వహించాం. సి.డి. చట్టాన్ని రద్దుచేయించుకున్నాం. తుఫాను సందర్భంగా సి.డి. పొందుటకు కృషిచేశాం.

### 2. అసెంబ్లీ, కౌన్సిల్‌కు విజ్ఞప్తి పత్రాలు

పాలకుల స్వార్థ ప్రయోజనాల ఫలితంగా బయలుదేరిన ప్రాంతీయ ఉద్యమాలలో కొట్టుకపోయి నష్టపడిన పరిస్థితులలో 1 కోర్కెల పత్రాలపై పదివేల సంతకాలతో 1975 ఫిబ్రవరి 10 న అసెంబ్లీ కౌన్సిలుకు విజ్ఞాపన పత్రాలు అందించాం. స్తబ్దతనుండి చైతన్యానికి మార్గంవేసి సమస్యల పరిష్కారానికి కృషి చేశాం.

### 3. కార్డు క్యాంపెయిన్

ప్రజాసంఘాల ఎన్నికలపై కూడా నిషేధాలు విధింపబడి, సాటి ఉద్యోగులకిచ్చిన సౌకర్యాలుకూడా మనకులేని పరిస్థితులలో 10 కోర్కెలుగల కార్డులు 15 వేలు 1975 సెప్టెంబరు నెలలో ముఖ్యమంత్రికి పంపించి, డి.ఏ. మెర్జరుస్కేల్సు జి.వొ. మరికొన్ని సౌకర్యాలు సాధించుకున్నాము.

### 4. ముఖ్యమంత్రికి విజ్ఞప్తి పత్రాలు

అత్యవసర పరిస్థితి కాలంలో, నేటివిటీ ఉత్తర్వు నిర్బంధ రిటయిర్‌మెంటు ఉత్తర్వులద్వారా ఉపాధ్యాయులను నానాయిబ్బందులు పెడుతూవుంటే పది ప్రధాన సమస్యలపై ముఖ్యమంత్రికి 1976 ఏప్రిల్ 15 నుండి వివిధ పాఠశాలలనుండి 20 వేల కార్డులు పోస్టు చేసి తాత్కాలికంగా నేటివిటీ ఉత్తర్వులు రద్దుచేయించుకుని, నిర్బంధంగా రిటయిరయిన ఉపాధ్యాయులను తిరిగి ఉద్యోగాలలో నియమింప జేసుకొని బ్రేకుపీరియడు జీతాలు పొందగలిగాం.

### 5. పని గంటలు, బడిదినాల తగ్గింపు

అత్యవసరపరిస్థితి ఆసరాగా పనిగంటలు, బడిదినాలు పెంచిన ప్రభుత్వ చర్యను నిరసిస్తూ 1976 సెప్టెంబరు 29, 30 తేదీలలో గుంటూరులో విద్యాగోష్టి జరపి, ప్రభుత్వచర్యను మనమే నిరసన తెలిపాం. ఆట్టిగోష్టులు రాష్ట్రవ్యాప్తంగా జరిపాం. దానిలో రాష్ట్రవ్యాప్తంగా వూపు వచ్చింది. పర్యవసానంగా జె.సి.టి.ఎ. ఏర్పడింది. 15-12-76 విద్యామంత్రితో చర్చలు జరిగి, పెంచిన పనిగంటలు, బడిదినాలు తగ్గించబడ్డాయి.

### 6. మహా విజ్ఞాపన పత్రం

అనేక అపరిష్కృత సమస్యలు, సాటి ఉద్యోగులకున్న సౌకర్యాలుకూడా లేనిస్థితి. ఇవన్నీ 16 సమస్యలుగల మహావిజ్ఞాపన పత్రంపై 25 వేల సంతకాలుసేకరించి 1977 ఏప్రిల్‌లో అసెంబ్లీకి కౌన్సిలుకు సమర్పించాం. వ్యత్యాసాలు ప్రభుత్వ దృష్టికి తెచ్చి కొన్ని పరిష్కరించుకోగలిగాం.

### 7. చలో హైదరాబాద్

21 సమస్యలుగల నోటీసు ప్రభుత్వానికియిచ్చాం. 13-2-78 రాష్ట్రవ్యాప్తంగా జిల్లా కలెక్టరుల కార్యాలయాల ముందు ధర్నా జరిపాం. విద్యామంత్రి మే 24న చర్చలుజరిపారు. అయినా సమస్యలు పరిష్కరింపబడలేదు. చరిత్రలో అపూర్వంగా సెప్టెంబరు 8న 3 వేల మంది ఉపాధ్యాయులు హైదరాబాద్ వీధులలో ప్రదర్శన జరిపి పబ్లిక్ గార్డెన్స్‌లో ముఖ్యమంత్రి, విద్యా మంత్రిని సమస్యలపై నిలదీసి ప్రశ్నించారు. తిరిగి చర్చలుజరిగి కొన్ని సమస్యలు పరిష్కరింపబడ్డాయి.

దీనితర్వాత ఫేప్టో కదలికఫలితంగా 77 ఏప్రిల్ 1 పోరాటం, తర్వాత 78 నవంబరు ప్రదర్శన, 79 మార్చి 16 పూరేగింపు ఫలితంగా 51 సమస్యలలో 26 పరిష్కరింపబడ్డాయి.

ఈ అన్ని పోరాటాలలో యు.టి.యఫ్. అగ్రభాగాన వుండి అచంచలంగా పోరాడి ఉపాధ్యాయులలో సాటిలేని మేటి పోరాట

సంస్థగా పేరుపొందింది. ఆంధ్రప్రదేశ్‌లో అగ్రేసర సంఘంగా నిలచి రూపు సంతరించుకుంది.

### పి. ఆర్. సి. రిపోర్టు పోరాటం :

పి. ఆర్. సి. ఫేప్టో పక్షాన సమిష్టిగా నివేదిక తయారుచేసి ఏప్రిల్ 14న 22 అంశాలతో ఇచ్చాం. 79 అక్టోబరు 17 న పేకమీషనరు కృష్ణస్వామి సాక్ష్యాలకు పిలిచారు. మన అభిప్రాయాలు స్పష్టంగా చెప్పాము.

ప్రభుత్వానికి పేకమీషనర్ తన నివేదిక 79 ఏప్రిల్ 14 న ఒకటి, జూన్ 15 న మరొకటి యిచ్చారు. దానిపై ప్రభుత్వం ఆగస్టు 10 న తన వైఖరి వివరిస్తూ ఒక ప్రకటన చేసింది. అందులో రిటయిరుమెంటు బెనిఫిట్సు లేని కారణంగా మన సంఘంపక్షాన పోరాట కార్యక్రమం చేపట్టాం.

### 8. చరిత్రాత్మకమైన కోర్కెల పత్రం

అనామలీస్ సరిచేయబడక, 3వ, వెయిటేజిరాక, పి. ఆర్. సి. చెప్పిన రిటయిర్‌మెంటు బెనిఫిట్సు అమలు జరపని స్థితిలో 11 డిమాండ్స్‌గల కోర్కెల పత్రాలు ముఖ్యమంత్రికి పంపించాలని నిర్ణయించాం.

రాష్ట్రవ్యాప్తంగా ఉపాధ్యాయులు సకాలంలో తీసుకున్న సరైన చర్యగా దీనిని గుర్తించారు. ఉవ్వెత్తుగా 1979 అక్టోబరు 1 నుండి 15 వరకు సంతకాలు చేసి ముఖ్యమంత్రికి పోస్టు చేశారు. ప్రతిరోజు వేలాది సంతకాలతో కోర్కెల పత్రాలు ముఖ్యమంత్రిని ముంచెత్తాయి. ఇలా లక్ష సంతకాలు వెళ్ళిన తర్వాత అంతవరకు రిటయిరుమెంటు వయసు పెంచుటకు మొండిగా నిరాకరిస్తూ వచ్చిన ప్రభుత్వం అక్టోబరు 29 న కేబినెట్ సమావేశంలో రిటయిరుమెంటు వయసు 58 కి పెంచుతూ, డి. ఎ. పెంచుతూ ప్రకటించింది.

ఫేప్టో కార్యక్రమాలు : మన చలో హైదాబాదు కార్యక్రమం, లక్ష సంతకాల విజ్ఞప్తి పత్రాల కార్యక్రమం తర్వాత ఫేప్టో అనేక కార్యక్రమాలు సాగించింది.

38 సమస్యలతో 26-9-78 ముఖ్యమంత్రి, విద్యామంత్రి అసెంబ్లీ, కౌన్సిలుకు విజ్ఞప్తి పత్రాలు సమర్పించబడ్డాయి

1978 అక్టోబరు 29 న రాజభవన్‌కు వూరేగింపు జరిగింది. తిరిగి 48 సమస్యలతో ప్రభుత్వానికి నోటీసు యిచ్చాం. 1978 డిశంబరులో ఆ సమస్యలతో 1½ లక్షల కార్డులు పోస్టుచేసినా ఫలితం కనిపించలేదు. 24-1-79 కలెక్టరు ఆఫీసులముందు ధర్నా జరిగింది. యస్. జి. వో.లు మనం సమన్వయంగా నిర్వహించా లనుకున్న ప్రదర్శన 79 మార్చి 5 న వారి ప్రదర్శన, మార్చి 19 న ఫేప్టో ప్రదర్శన జరిగాయి. చర్చలు జరిగాయి. తిరిగి పోరాటానికి పిలుపు యివ్వబడింది చివరికి 51 సమస్యలలో 26 పూర్తి అంగీకారంతో పోరాటం ఏప్రిల్ 8 న విరమించబడింది.

తిరిగి పి. ఆర్. సి. రిపోర్టునందలి అనామలీస్ సరిచేయాలని ఇంటి అద్దె మొదలగు 11 సమస్యలతో ప్రభుత్వానికి నోటీసుయిచ్చి 79 నవంబరు 2 న రాష్ట్రవ్యాప్తంగా సమితి, పట్టణ, జిల్లా, ఆఫీసుల యందు 61 వేల మందితో ధర్నా జరిగింది. ఉపాధ్యాయులు ఉత్సాహంగా అందుకున్న యీ పోరాటాన్ని మరింత ముందుకు తీసుకవెళ్ళాలని నిర్ణయించాం.

(1) 79 డిశంబరు 10 నుండి 15 నిరసనవారం
(2) 79 ,, 14 టోకెన్ స్ట్రయిక్
(3) 79 ,, 20 నిరవధిక సమ్మె

ఫేప్టో నాయకత్వం రాష్ట్రవ్యాప్తంగా పర్యటించింది. ఉద్యమ వాణిని ప్రచారం చేసింది. డిశంబరు 14 టోకెన్ స్ట్రయిక్‌లో 90 శాతం మంది ఉపాధ్యాయులు పాల్గొని అపూర్వంగా జయప్రదం చేశారు. 20 కి ప్రభుత్వం శలవులు ప్రకటించింది. తర్వాత పోరాటానికి పిలుపు యిచ్చినా వూపు అందుకోలేదు. ప్రభుత్వంతో 1-2-80 న ఒప్పందానికి రావడం 11 సమస్యలు రెండిలోకి అప్పగించటం జరిగింది. యస్.జి.వో.ల కిచ్చిన 3వ వెయిటేజి, ఎక్స్‌గ్రేషియో మరో యింక్రిమెంటు తేదీకి ఆప్షన్, 4 శాతం ఇంటిఅద్దె మనకు అమలుజరుపుటకు అంగీకరించారు.

చెన్నుపాటి భవనం: ఖమ్మం మహాసభతో యిచ్చిన పిలుపు ప్రకారం విజయవాడలో చెన్నుపాటి పేర భవనం ఏర్పాటుచేయాలనే పిలుపు రాష్ట్రవ్యాప్తంగా ఉపాధ్యాయులు అందుకొన్నారు. మహాసభ కేటాయించిన 25 వేలను లక్ష రూపాయలకు తమ విరాళముల ద్వారా పెంచారు. ఒక లక్ష 25 వేలతో విజయవాడలో చెన్నుపాటి 10వ వర్ధంతి సందర్భంగా 9-12-78న భవనం ఏర్పాటు చేసుకొని రాష్ట్ర కార్యాలయాన్ని, పత్రికను అక్కడనుండి నిర్వహించుట జరుగుతున్నది.

శాసనసభా రంగం: మన సంఘ పక్షాన శ్రీ యం. మాధవ రావుగార్ని తూర్పు రాయలసీమ నుండి, శ్రీ యం.జె. మాణిక్యరావు గారిని గుంటూరునుండి, శ్రీ డి. శివరామరాజుగారిని ఉభయగోదావరి జిల్లాలనుండి శాసనమండలికి నెగ్గించుకున్నాం.

అయితే తూర్పు తెలంగాణా నుండి నిలబెట్టిన శ్రీ జి. లక్ష్మయ్య, కృష్ణాజిల్లా నుండి నిలిపిన శ్రీ ఈడుపుగంటి వెంకటేశ్వర రావుగారు ఓడిపోయారు. ఈ కాలంలో ఉద్యమాలు, ఉపాధ్యాయ యం.యల్.సి.ల సమష్టి కార్యాచరణ ద్వారా ముందుకువెళ్ళి అనేక సమస్యల సాధనకు కృషిచేయడం జరుగుతున్నది.

ఈ కాలంలోనే స్పెషల్ టీచర్ల పక్షాన కోర్టుచర్యలు, 1977 నవంబరు దివిసీమలో జరిగిన తుఫాను బాధితులను ఆదుకొనుటకు కృషిచేశాం.

ప్రతినెలా హైదరాబాదులో రాయబారాలు జరుపుతున్నాం. బ్రాంచి కార్యాలయాన్ని సక్రమంగా నిర్వహించుటకు కృషిచేస్తున్నాం. జాతీయ అంతర్జాతీయ ఉపాధ్యాయ సంఘాలతో సత్సంబంధాలుకల్గి వ్యవహరిస్తున్నాం.

## II ప్రస్తుత రంగం

గత నూతన కౌన్సిలు 1980 సెప్టెంబరు 13, 14 తేదీలలో జరుపుకున్నాం. కార్యక్రమాల సమీక్ష చేసుకొని, నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొని పని చేస్తున్నాం. ఈ కాలంలో అనేక పోరాట కార్యక్రమాలు కొనసాగించాం.

ఎయిడెడ్ ఉపాధ్యాయులు-డైరెక్టు పేమెంటు : అనేక పోరాటాల ఫలితంగా డైరెక్టు పేమెంటు సాధించుకున్నాం. అయితే దుర్మార్గమైన అగ్రిమెంటు యివ్వాలనే షరతుద్వారా దానిని ప్రభుత్వం పనికిమాలినదిగా చేసింది.

అగ్రిమెంటులో మచ్చుకు కొన్ని : సమావేశాలలో పాల్గొనటం, ప్రకటనలు, కోర్టు చర్యలు, రచనలు, విరాళాలు, విమర్శలు, ధర్నాలు, నిరాహారదీక్షలు చేయడం నేరం; కుటుంబ సభ్యుల రాజకీయాలు నిషిద్ధం. అప్పులుచేయడం నేరం: నాలుగున్నర రూపాయల

నాన్ జ్యుడిషియల్ స్టాంపుపై సంతకం, యిదీ అగ్రిమెంటు పోకడ.

దానిని 1980 ఆగస్టు 3 చారిత్రాత్మకమైన ప్రకటనద్వారా యు. టి. యఫ్. ఖండించింది. సెప్టెంబరు 1 న ఫేప్టో అగ్రిమెంటుకు వ్యతిరేకంగా పోరాటానికి పిలుపు యిచ్చింది.

1980 సెప్టెంబరు 5 న ఉపాధ్యాయ దినోత్సవ బహిష్కరణ తోపాటు కార్డు కేంపెయిన్, ధర్నాలు జయప్రదంగా నిర్వహించ బడ్డాయి. కాలేజీ అధ్యాపకులు కూడా ఫేప్టోగా సమైక్యమయి పోరాటాలు సంయుక్తంగా నిర్వహించాం. రెబెలో కమిటీ రిపోర్టుకూడా చేర్చబడింది.

పోరాటాన్ని మరింత తీవ్రతరం చేయాలని నిర్ణయించటం జరిగింది. నిరసన వారాలు, నిరవధికసమ్మెకు నిర్ణయంతీసుకొన్నాము.

అయితే నవంబరు 29 న ముఖ్యమంత్రి చర్చలకు పిలిచారు. 25 మంది చర్చలలో పాల్గొన్నాం.

అగ్రిమెంటు లేకయే నేరుగా జీతాలు యిచ్చుటకు, రెబెలో కమిటీ రిపోర్టు నలుగురు కమిటీకి అప్పగించుటకు, కేసుల ఉపసంహరణకు, మిగిలిన సమస్యల పరిష్కారానికి ఒప్పందం కుదిరింది.

అయితే సదరు ఒప్పందంకూడా సకాలంలో అమలు జరుగని కారణంగా మార్చి 2 న అసెంబ్లీముందు పికెటింగు జరపాలని నిర్ణయించగా, తిరిగి మార్చి 2 న ప్రభుత్వంతో చర్చలు జరిగాయి. ఫలితంగా అగ్రిమెంటు అవసరం లేకుండా డైరెక్టు పేమెంటుకు ఉత్తర్వులు యిచ్చారు.

అయితే మేనేజిమెంట్లు కోర్టుకు వెళ్ళిన కారణంగా తిరిగి గందరగోళం ఏర్పడింది, దానిపై తిరిగి ఫేప్టో ప్రభుత్వంతో చర్చించింది. కోర్టుడెరెక్షన్ యిచ్చిన వారి విషయంలో జీతాలుయిచ్చు పద్ధతిపై వివరణ యిప్పించుట జరిగింది. కరస్పాండెంటులు బిల్సు పంపని స్థితిలో హెడ్మాష్టర్లు పంపు ఏర్పాట్లు చేయుట జరిగింది. కోర్టులో ఉపాధ్యాయుల పక్షాన ప్లీడరును పెట్టుట జరిగింది. నిత్యం ఎదురయ్యే అనేక సమస్యల పరిష్కారానికి యీ కాలంలో నిర్విరామకృషి జరిగింది.

6-7-81 న విజయవాడలో మనకార్యాలయంలో జరిగిన కార్యవర్గ సమావేశంలో జులై 14 నుండి 22 వరకు కన్వెన్షన్లు, కార్డు, టెలిగ్రాం కాంపెయిన్లు, చివరికి ధర్నాలకు పిలుపు యివ్వబడింది. అన్ని కార్యక్రమాలు జయప్రదంగా నిర్వహించబడ్డాయి.

ఫలితంగా ప్రభుత్వంతో 23-7-81న ఒకసారి, 27-7-81 న త్రైపాక్షిక సమావేశం జరిగింది. మేనేజిమెంట్లు ఇవ్వవలసిన అగ్రిమెంట్లు రద్దుచేయుడకు, మేనేజర్లు కోర్టులలో పెట్టిన కేసులు ఎత్తివేసుకుని. ఉపాధ్యాయులకు బకాయిజీతములతోసహా నేరుగా బ్యాంకుల ద్వారా చెల్లించుటకు అంగీకరించిరి.

ఈ విధంగా ఎయిడెడ్ ఉపాధ్యాయులకు బ్యాంకుల ద్వారా జీతాల సాధనకు ఎదురైన అనేక అడ్డంకులు అధిగమించి చరిత్రాత్మకమైన విజయాన్ని సాధించుట జరిగింది. అయితే నిత్యం ఎదురయ్యే అనేక అడ్డంకులు అధిగమించాలి.

అయితే ఒక ఉపాధ్యాయ సంఘం, అగ్రిమెంటుపై సంతకాలు పెట్టండని బాహాటంగా పిలుపు యివ్వటమే కాదు, అడుగడుగునా ఐక్య పోరాటాలను అడ్డుకునేదానికి తన సంఘ తీర్మానాల ద్వారా తన పత్రిక సంపాదకీయాల ద్వారా, దారి పొడుగునా అడ్డంకులు కల్పించింది. సంతకం చేయకపోతే డైరెక్టు పేమెంటు, గ్రూపు ఇన్సూరెన్సు స్కీం పోతాయట. పోరాడి సాధించుకున్నది పోరాటాల ద్వారానే నిలుపుకోవాలితప్ప లడ్డదారులలో పొంగి పొంగి పోవడం ద్వారా అనుభవించాలనేది అవివేకమైన వాదన. తిరిగి పోరాటం ద్వారానే అవన్నీ సాధించబడ్డవి కూడా.

ఉద్యోగుల సౌకర్యాలు : యన్. జి. వో. లు తిరిగి పోరాట కార్యక్రమం చేపట్టి సెలక్షన్ గ్రేడు, ప్రొవిన్షలైజేషన్, ఎక్స్‌గ్రేషియా, ఉచిత విద్య, కుటుంబ సంక్షేమ పథకం సవరణలు మరి కొన్ని సాధించారు. వాటిని కూడా మనకు అమలు జరుపుటకు ప్రభుత్వం నుండి హామీ పొందాం.

అలాగాక ఆరులక్షలుగా వున్న ఉద్యోగులు, ఉపాధ్యాయులు సమైక్యంగా పోరాడితే సమస్యల పరిష్కారం మరింత సులువయి వుండేది. అనామలీస్‌లాంటి ముఖ్య సమస్యల పరిష్కారానికి యీ ఐక్యత మూలమైనది. గత రెండుసార్లు యన్.జి.ఓ.లు సాధించినది మనం పొందుటకు కృషిచేశాం తప్ప సమన్వయానికి కృషిచేయలేదు.

చివరకు ఫేప్టో కూడా యీ విషయమై ఒకతీర్మానం చేసింది. అనామలీస్ లాంటి అతిముఖ్య సమస్యల పరిష్కారానికి ఉపాధ్యాయులు, ఉద్యోగులు ఒక్కటిగాకదలి ఐక్యకార్యాచరణ సాగించాలని, అందుకు ప్రయత్నాలు చేయాలని నిర్ణయించింది. 23-7-81న జరిగిన ఫేప్టో కార్యవర్గం కొన్ని సమస్యల పరిశీలనకై సబ్కంఘాలకు నివేదించింది. వాటిపై మన అభిప్రాయాలు వివరించాల్సి వుంది.

## 1. ప్రొవిన్షలైజేషన్

(1) రిక్రూట్‌మెంటు ప్రస్తుతం సాగుతున్నట్లే అనగా డి.యస్.సి. పరిధిలోనే జరగాలి.

(2) రెగ్యులరైజేషన్: ప్రస్తుతం సాగుతున్న అపాయింటు చేయు అధికారులు సర్వీసు క్రమబద్ధం చేయాలి.

(3) ప్రస్తుతం తెలంగాణాలో పంచాయితీ రాజ్‌లో ప్రభుత్వ, పంచాయితీరాజ్ ఉద్యోగులు వున్నారు. వారిసర్వీసు కండీషన్లు వేరు. పంచాయితీరాజ్ సంస్థలలో పనిచేయువారు, అందులో కొనసాగదల్చుకొంటే కొనసాగించాలి. ప్రభుత్వ ఆధీనంలోకి వెళ్ళాలనుకుంటే, సూపర్ న్యూమరరీ పోస్టులు సృష్టించి అయినా ప్రభుత్వ పాఠశాలలలోనికి పంపాలి. తర్వాత జిల్లా పరిషత్ ఒకయూనిట్‌గా, ప్రభుత్వ యాజమాన్యం మరొక యూనిట్‌గా వేరు వేరు సీనియారిటీలు తయారు చేయాలి. ప్రభుత్వ ఉపాధ్యాయుల జిల్లాపరిషత్ యాజమాన్యంలో వుండుటవలన, సీనియారిటీలో జూనియర్‌గా మారిన, పంచాయితీరాజ్ ఉపాధ్యాయులకు రక్షణలక్రింది (సేఫ్‌గార్డు) ఒక స్టేజి ప్రమోషను యివ్వాలి.

ఇలాగే పంచాయితీరాజ్ ఉపాధ్యాయులను, ప్రభుత్వ సర్వీసులోనికి మార్చినందువలన ఎందరైతే ప్రభుత్వ ఉపాధ్యాయులు ప్రమోషన్లు కోల్పోతారో వారికికూడా రక్షణల క్రింద సూపర్ న్యూమరరీ ప్రమోషన్లు ఇవ్వాలి.

లేక

'బి' ప్రభుత్వ పంచాయితీరాజ్ యాజమాన్యాలను తీసివేసి, ఒకే యాజమాన్యం చేసి ఉపాధ్యాయిలందరి కామన్ సీనియారిటీ తయారుచేయాలి. ఇలా చేసినపుడు నష్టపోయిన వారందరికి, రక్షణల

క్రింద (సేఫ్‌గార్డు) ఒక స్టేజి ప్రమోషను ఇవ్వాలి.

'సి' ప్రధానోపాధ్యాయుల పోస్టులవరకు జిల్లాస్థాయి పోస్టులుగా తీసుకోవాలి.

'డి' డి. వై. ఐ. ఒ. యస్. : ఇ. ఒ. యస్. మరియు ఆపై స్థాయి పోస్టులన్నింటినీ, జోనల్ సీనియారిటి చేయాలి.

(4) బదిలీలు ఏ స్థాయిలో సీనియారిటీని లెక్కిస్తారో ఆ స్థాయిలోనే బదిలీలు వుండాలి,

(5) ప్రమోషనులు : – జిల్లాస్థాయిలో ప్రభుత్వ యాజమాన్యంలోని పోస్టులకు ఆ యాజమాన్యంలోని ఉపాధ్యాయులను జిల్లా పరిషత్ యాజమాన్యంలోని పోస్టులకు జిల్లాపరిషత్ ఉపాధ్యాయులను ప్రమోట్‌చేయాలి.

(బి) జిల్లా స్థాయికంటే పై పోస్టులకు ప్రమోషనులు వచ్చినప్పుడు, ప్రభుత్వ పాఠశాలల్లోను, పంచాయితీరాజ్ పాఠశాలల్లోను, పనిచేయు ఉపాధ్యాయులు మధ్య సంఖ్యానిష్పత్తి ప్రకారం ప్రమోషనులు యివ్వాలి. లెక్చరర్‌పోస్టులు, అడ్మినిస్ట్రేటివ్ పోస్టులు ఏవైనా ఈ పద్ధతినే భర్తీ చేయాలి. సంఖ్యానిష్పత్తిని ప్రతి సం॥రం ఏదోఒక తేదీని నిర్ణయించి, ఆ సం॥రం అంతా ఆ పద్ధతి ప్రకారం ప్రమోషను ఇవ్వాలి. ఉదా॥ మార్చి టూ ఏప్రిల్.

(6) సి.సి.ఎ. రూల్సు : ప్రస్తుతమున్నవి రద్దుచేసి, ఉపాధ్యాయ సంఘాల సూచనల మేరకు నూతనంగా తయారు చేయాలి.

7. జీతాల చెల్లింపు : ట్రజరీలనుండి బిల్సు డ్రాచేయు అధికారం అప్పర్ ప్రయిమరి, సెకండరీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులకే వుండాలి. ప్రాథమిక పాఠశాలల బిల్సుపై ఇ. ఓ. లేక బి. డి. ఓ. కౌంటర్ సైన్ చేస్తే చాలు. ట్రజరీలో డ్రా చేసుకొనేలా వుండాలి.

8. అవకాశాలు : అన్నిరకాల ఆర్థిక లాభాలు, సంక్షేమపథకాలు, అప్పులు వగైరా ఎట్టి వివక్షణ లేకుండా ఇవ్వాలి.

## III సెలక్షన్ గ్రేడులు

10 సం॥రంలకు సెలక్షన్ గ్రేడు, 15సం॥రం లకు ప్రమోషన్ గ్రేడులు, అనామలీస్ సవరణ అయ్యేంతవరకు యీ క్రింది పద్ధతి ప్రకారం వుండాలి. అవి సరి అయితే వాటినిమార్చాలి. సాధారణంగా ఆ పై గ్రేడు సెలక్షన్ గ్రేడు, ఆపై ప్రమోషన్ గ్రేడుగా వుండాలి.

| కేటగిరి | ప్రస్తుత స్కేలు | 10 సం॥రాల స్కేలు | 15 సం॥రాల స్కేలు |
|---|---|---|---|
| లోయర్ గ్రేడు | 250–550 | 410–625 | 450–700 |
| హయ్యర్ గ్రేడు | 410–625 | 450–700 | 530–850 |
| సెకండరీ గ్రేడ్ | 450–700 | 530–850 | 575–950 |
| పండిట్స్ II | 530–850 | 550–900 | 575–950 |
| బి.ఇ.డి. | 575–950 | 750–1300 | 800–1450 |
| ప్రధానోపాధ్యాయులకు800 ఇస్తారు. | 750–1300 | 900–1500 | 1050–1600 |
| పి.జి. అసిస్టెంట్లు | 700–1200 | 900–1500 | 1050–1600 |
| పి ఇ.టి. ఆర్టు, క్రాఫ్టు | 500–800 | 550–900 | 575–950 |
| జె యల్స్ | 800–1450 | 1050–1600 | 1250–1700 |
| లైబ్రేరియన్స్ | 530–850 | 550–900 | 575–950 |

మిగిలిన క్యాడర్లకు కూడా ఈ ప్రాతిపదికపై రూపొందించబడును.

## IV బదిలీ కోడ్ :

లోగడ మనం సర్క్యులేట్ చేసిందే,
ఈ అన్నిటిపై మీ అభిప్రాయాలు తెలుపండి.

9. యు. టి. యఫ్ ధర్నా కార్యక్రమం :– పెరిగిపోతున్న సమస్యలు, అమలుజరగని హామీలు వందకుపైగా రూపొందించి ప్రభుత్వానికి 1–3–81న నోటీసు ఇచ్చాం. 15వ తేదీలోగా పరిష్కరించనిచో జిల్లాలో ప్రదర్శనలు, హైద్రాబాదులో ధర్నా సాగించగలమని తెలియజేశాం.

16–3–81 న జిల్లాలలో 10 వేలమంది ఉపాధ్యాయులు ప్రదర్శన జరిపి నిరసనను తెలియజేసిరి. ప్రభుత్వం చర్చలకు పిలిచింది. మార్చి 16, 17 తేదీలలో హైద్రాబాదు డైరెక్టరు కార్యాలయంలో చర్చలు జరిగినవి. కొన్ని తప్ప మిగిలిన సమస్యలు అపరిష్కృతంగా ఉన్న కారణంగా 23–3–81న వేయిమందితో సెక్రటేరియట్ ముందు అత్యంత ఘనంగా ధర్నా జరిగింది. ధర్నా శిబిరం నుండి వూరేగింపుగా వెళ్ళిన ప్రదర్శకులు డైరక్టరు కార్యాలయాన్ని చుట్టుముట్టారు.

హైద్రాబాదులో జరిగిన కౌన్సిలు కార్యవర్గం పోరాటాన్ని మరింత తీవ్రతరం చేయుటకు నిర్ణయించుటతో ఆ విధంగా విద్యామంత్రికి నోటీసు యిచ్చాం. సెక్రటేరియట్ ముందు పికెటింగ్, పరీక్షల బహిష్కరణ చేయగలమని తెలిపారు.

వెంటనే మార్చి 25న విద్యామంత్రి అధికారులతో చర్చలు ఏర్పాటు చేశారు. పరీక్షల యిన్విజిలేటర్సుకు 12½ లక్షల గ్రాంటు విడుదల చేశారు. స్పాట్ వాల్యుయేషన్ రేట్లు పెంపుదలకు అంగీకరించారు. ఫేప్టో కార్యక్రమం చేపట్టిన తర్వాత ఆ రేట్లు కూడా పెరిగినవి.

అయితే మిగిలిన సమస్యలపై విద్యాశాఖ కార్యదర్శితో దఫదఫాలుగా 27–3–81, 1–5–81, 30–6–81 తేదీలలో చర్చలు జరిగాయి. అందు అనేక సమస్యలు పరిష్కరింపబడ్డాయి. మరికొన్నిటికి మార్గం సుగమమైనది. కొన్ని క్రిందిఆఫీసులకు వ్రాయబడినవి.

1. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు 1–7–80 నుండి గ్రూపు ఇన్స్యూరెన్సు స్కీము అమలు జరిగింది.

2. పార్టుటైం హిందీ పండిట్స్‌కి గ్రేడు II పోస్టులు విడుదల చేయబడ్డాయి.

పండిట్స్ స్పెషల్ కేటగిరి పోస్టులకు రు. 750–1300 స్కేలు యివ్వబడింది.

4. స్పాటు వాల్యుయేషన్ రేట్లు పెంచబడ్డాయి. బకాయిలు విడుదలయ్యాయి.

5. టీచర్ బి.పి యం.ల కంటిన్యూ ఉత్తర్వులు వచ్చాయి.

(6) 12–12–66 నుండి కొందరికి సెకండరీ ప్రమోషనులు లభించాయి.

(7) సమగ్ర విద్యాబిల్లు ఉభయ శాసనసభల ఆమోదం పొందింది.

మిగిలిన డ్రాయింగు టీచర్లకు గ్రేడు | స్కేలు సెలక్షన్ గ్రేడు ఫిక్సేషనులు అదనపు యింక్రిమెంట్లు, పంచాయితీ రాజ్ ఉద్యో

గులకు యల్.టి.సి, ఏకోపాధ్యాయులకు డ్యూటీ అలవెన్సును త్వరలో రానున్నాయి.

మిగిలిన అన్ని సమస్యలపై ఆగస్టులో రివ్యూ సమావేశము గలదు. మొత్తము పై మనం సాగించిన ధర్నామంచి ఫలితాలను యిచ్చింది.

రాయబారాలు ; ప్రతినెల హైదరాబాదులో వివిధ అధికారు లను కలిసి రాయబారాలు జరుపుతున్నాం. సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నాం. విద్యాశాఖా మంత్రి, పంచాయతీ రాజ్ మంత్రి, విద్యాశాఖ కార్యదర్శి, డైరెక్టరు, ఫైనాన్స్, పంచాయతీ రాజ్ మునిసిపల్, సోషల్ వెల్‌ఫేరు, ఆరోగ్య శాఖా కార్యదర్శులు యల్.యఫ్. అక్కౌంట్సు డైరెక్టరు, ట్రయిబలు వెల్‌ఫేరు డైరెక్టర్, పరీక్షలకమీషనరు తదితర అధికారులను కలిసి చర్చలు జరిపి, మెమొరాండములు యిచ్చి అనేక సమస్యల పరిష్కారానికి కృషి చేశాము. వ్యక్తిగత సమస్యలు పరిష్కరింపజేసితిమి. 1980 అక్టోబరు 15, 16, నవంబరు 14,15,16, 1981 జనవరి 5,6, ఫిబ్రవరి 2,3,4, మార్చి 16,17,18. ఏప్రిలు 26, మే 2,4,26, జూన్ 28,29, జులై 22,23 తేదీలలో అట్టి రాయబారాలు జరిపితిమి.

నెల్లూరు, కరీంనగర్, మెదక్ జిల్లాల అక్రమ బదిలీల రద్దు, మైసూరు భాషా ట్రయినింగు వారి అలవెన్సులు, ఎయిడెడ్ ఉపాధ్యాయుల గ్రాంట్లు విడుదల, ఏజన్సీ ఉపాధ్యాయుల గ్రాంట్లు, డిప్యూటేషన్ కాలానికి జీతాలు, హిందీ పండిట్సు కంటిన్యూ ఉత్తర్వులు, పాత పద్ధతిలో కోఆర్డినేషన్ సమావేశాలు, కంటిన్యూ ఆర్డరుతో నిమిత్తం లేకుండా జీతాలు, ఎయిడెడ్‌వారి పాత బకాయిల చెల్లింపుకు ఉత్తర్వు, సమితుల సి. డి. సొమ్ము విడుదల, డైరెక్ట్ పేమెంటు ఉత్తర్వులు వాటికి వివరాలు, మొదలగు ఉత్తర్వుల విడుదలకు కృషిచేసితిమి.

అయితే ఇంకా అసంఖ్యాకంగా సమస్యలు వుండనేవున్నాయి. పెరిగిపోయిన అవినీతి, పేరుకపోయిన రెడ్‌టేపిజంతో సమస్యలు సంవత్సరాలకొలది అపరిష్కృతంగానే వుండిపోతున్నాయి. ఇటీవల మన కార్యక్రమం దీనిని కొంత కదిలించినా అవి పూర్తికాలేదు. దాని కొనసాగింపు యింకా జరగాలని, శక్తివంతమైన పోరాటాలే సమస్యా పరిష్కారానికి మార్గమని మనవిచేస్తున్నా.

ప్రచురణలు : ఐక్య ఉపాధ్యాయ ప్రచురణల తరపున "అధ్యాపక దర్శిని" పేరుతో అన్ని జి.ఓ.లను విషయం వారీగా 5 భాగాలుగా తెచ్చాం. 1, 2 భాగాలు పునర్ముద్రణ కూడా వేశాం. 3వ భాగం తిరిగి ముద్రించాలి.

అచ్చువేసిన అన్ని భాగాలు అపూర్వంగా అమ్ముడుపోయినాయి. ఉపాధ్యాయుల ఆదరణ ఊహించినదానికన్నా ఎక్కువగా ఉన్నది. కార్యకర్తలు, సంఘ సందేశాన్ని, పత్రిక వాణిని ఎలా ప్రచారంలో పెట్టారో అలాగే అధ్యాపక దర్శినిని ఉపాధ్యాయులలో విస్తృత ప్రచారంచేసి, అమ్మకాలలో రికార్డులను అధిగమించారు. ఉద్యమాల చరిత్రలో ఇది ఉజ్వలఘట్టం. మనం వేసిన డైరీ ఉపాధ్యాయుల ఆదరణ పొందిన విధం మరువలేం.

దాని ఆధారంగానే విజయవాడ చెన్నుపాటి భవనంలో మనల 30 వేల ఖర్చుతో ఒక మీటింగుహాలు కూడా నిర్మించుకొన్నాం.

ఈ సందర్భంగా సంకలనం చేసినవారికి, ప్రూఫులు దిద్దిన వారికి, ప్రెస్, బైండింగ్ వర్కర్స్‌కు, కార్యకర్తలకు, అధ్యాపకులకు హృదయపూర్వక ధన్యవాదాలు.

**చెన్నుపాటి వర్ధంతి సభలు:** అమరజీవి చెన్నుపాటి 12వ వర్ధంతి సభలు రాష్ట్ర వ్యాప్తంగా అత్యంత జయప్రదంగా డిసెంబరు 9 నుండి 15 వరకు జరిగాయి. ఆ సభలలో ఉద్యమాన్ని సమీక్షించుకొని, ఆ మహనీయుని ఆశయాలకు మరోసారి అంకితమవుతూ దీక్ష గైకొన్నారు.

సోదరసంఘాలు : ప్రపంచ ఉపాధ్యాయ సమాఖ్యతోను, ఇతర రాష్ట్రాల ఉద్యమాలతోను మనకు సత్సంబంధాలు వున్నాయి. కేరళ, ప. బెంగాలు సభలకు తరచు వెళ్ళివచ్చుటజరిగింది [illegible]

పశ్చిమ బెంగాలు ఉపాధ్యాయ సమావేశాలకు, శ్రీయుతులు పుల్లారావు, శేఖర్ తదితరులు వెళ్ళివచ్చారు.

కేరళ ఉపాధ్యాయ సభలకు శ్రీయుతులు డి. రామిరెడ్డి, ఎ. వెంకటస్వామి, యం. వెంకటరత్నం, జి. లక్ష్మయ్య, కే తిరిపాలు, వి. సూర్యనారాయణరాజు, పి. సత్యనారాయణ, టి. కొండాచారి, కె. బక్కయ్య, కె. వి. నారాయణరెడ్డి. యం. కోటయ్య, జి సూర్యం యన్. యం. కొండయ్య తదితరులు వెళ్ళిరి. 1981 ఫిబ్రవరి 12 న కటక్ సెమినారుకు శ్రీ డి. రామిరెడ్డిగారు హాజరయిరి.

దీనితో ఆలిండియా ఉద్యమాలతో అవగాహనకు, భవిష్యత్ స్వరూపానికి మార్గం సుగమమైంది.

నిర్మాణం : 1974లో 7 జిల్లాలలో స్థాపించబడ్డ ఉద్యమం యీ ఏడు సంవత్సరాల కాలంలో సం॥రంపు 5వేల సభత్వం చొ॥న పెరుగుతూ 23 జిల్లాలకు వ్యాపించింది. ఇందుకు అనేక ఇబ్బందులు, అడ్డంకులు ఎదురైనాయి. వాటన్నిటిని అధిగమిస్తూ నిర్మాణాన్ని సరిజేసుకొంటూ పురోగమించాం. నిర్మాణంలో అన్ని జిల్లాలు ఒక పద్ధతిలో లేవు. తారతమ్యభేదాలు వున్నాయి. యింకా రెండు జిల్లాలు కన్వీనింగు కమిటీలుగానే వున్నాయి.

నిర్మాణం ఒక్కనాటితో పూర్తయ్యేదికాదు. ఓపికతోకూడిన నిర్విరామ కృషి ఎంతో అవసరం. ఉద్యమాలకు ఉక్కు కవచం లాంటిది నిర్మాణం. నిర్మాణ బలంలేని ఉద్యమాలు నిలబడలేవు. విజయాలు సాధించనూ లేవు. నిర్మాణానికి సామాజిక స్పృహ తోడైతే అది అభేద్యమైన దుర్గమే అవుతుంది. అందుకు మనం నిర్విరామంగా కృషిచేశాం, ఇకముందు చేస్తాం.

అందుకే మనం జిల్లాలవారిగా నిర్మాణాన్ని సమీక్ష చేసుకుందాం. సమీక్ష చేసుకోవడంలో మొగమాటం, తప్పులు దిద్దుకోవడంలో అహంభావం అడ్డురాకూడదు.

(1) శ్రీకాకుళం :- ఈ సం॥రమే శ్రీకారం చుట్టాం. నిర్మాణం ఒక ప్రాంతానికే పరిమితమై వుంది. కన్వీనరుగా శ్రీ యన్. బాలసుందరరావు పనిచేస్తున్నారు.

(2) విజయనగరం :- జిల్లా నిర్మాణం ఒక పద్ధతిలోపడింది. శాఖలు విస్తరించాయి. సభ్యత్వం పెరిగింది. అక్రమ బదిలీలు రద్దు చేయించుకున్నారు. సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నారు. అధ్యక్షులుగా శ్రీ జె. అప్పలనాయుడు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ యం. కృష్ణమూర్తి కార్యకలాపాలు సాగిస్తున్నారు.

(3) విశాఖ : ఉద్యమం ఇటీవల వడిదుడుకులను గురైంది. నిర్మాణం సరిచేయబడింది. నిర్మాణం మరికొన్ని సమితులకు వ్యాపించింది. సభ్యత్వం పెరిగింది. సమస్యల పరిష్కారానికి కృషి జరుగుతున్నది. అధ్యక్షులుగా శ్రీ పి. సాంబమూర్తి, ప్రధాన కార్యదర్శిగా శ్రీ కె. ఎస్. ఆర్. కె. మూర్తిగారు ఎన్నికయిరి.

(4) తూర్పుగోదావరి : సభ్యత్వంలో అగ్రభాగానవున్న జిల్లా. సమస్యల పరిష్కారాలలో చొరవతో కృషిచేస్తున్నది జిల్లాలోగల అన్ని సమితులలో (29) శాఖలతో నిర్మాణంవుంది. జిల్లాపరిషత్‌లో పోరాట కార్యక్రమాలద్వారా అవినీతిపరుల ఆటలు కట్టించి, ఉద్యమ పతాకము సెకండరీ రంగానికికూడా విస్తరింపజేశారు. అధ్యక్షులుగా శ్రీ పి. బి ముత్తారావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ వి. సూర్యనారాయణరాజు బాధ్యతలను నిర్వర్తిస్తున్నారు. జిల్లా ప్రధానకార్యదర్శి హోల్‌టయిమరుగా వున్నారు.

(5) పశ్చిమ గోదావరి : సభ్యత్వం గతంకంటె పెరిగింది. నిర్మాణ మెరుగుపడింది. జీవిత చందాలలో అగ్రభాగానవున్న జిల్లా. కరస్పాండెన్సు క్రమబద్ధంగా నిర్వహిస్తున్నారు. ఇంచుమించు జిల్లాలోని అన్ని ప్రాంతాలకు ఉద్యమం వ్యాపించింది. మహాసభలను జరుపుతూ మనకు ఆతిథ్యం యిస్తున్న జిల్లా. శ్రీ కె. రాఘవరాజుగారు అధ్యక్షులుగా, శ్రీ యస్.ఆర్. పోలిశెట్టి ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు చూస్తున్నారు. ప్రధాన కార్యదర్శి హోల్‌టయిమర్‌గా ఏలూరులో వుండి ఆఫీసు నిర్వహిస్తున్నారు.

(6) కృష్ణ : సభ్యత్వంతగ్గింది. సెకండరీరంగంలో నిర్మాణం కొరవడింది కొన్ని కొత్తసమితులు నిర్మాణంలోనికి వచ్చినా పాత సమితులలో కార్యక్రమాలు మందగించాయి. ప్రధాన బాధ్యులు కష్టించి పనిచేస్తున్నా, అందరూ టీమ్‌స్పిరిట్‌తో కృషిచేస్తే నిర్మాణం మెరుగుపడుతుంది. కరస్పాండెన్సు క్రమపద్ధతిలో సాగుచున్నది. అధ్యక్షులు శ్రీ యన్. రామకోటేశ్వరరావు, ప్రధాన కార్యదర్శి శ్రీ యం. యేసురత్నం సంఘ కార్యకలాపాలు సాగిస్తున్నారు.

(7) గుంటూరు : జిల్లా అంతకూ, ప్రాథమిక, సెకండరీ రంగాలకు నిర్మాణం విస్తరించింది. జిల్లా ఆఫీసు గుంటూరులో నిర్వహిస్తూ, సమస్యల పరిష్కారంలో చొరవతో కృషి చేస్తున్నారు. సభ్యత్వంలో రెండవ స్థానంలోవున్న జిల్లా. జిల్లాశాఖ ఆర్థిక ఇబ్బందులను అధిగమించే దానికి ప్రత్యేక కృషి అవసరం. శ్రీ యం. రాయన్నగారు అధ్యక్షులుగా, శ్రీటి అంజిరెడ్డిగారుప్రధానకార్యదర్శిగా పనిచేయుచున్నారు. అధ్యక్షులు హోల్‌టయిమరుగా వున్నారు.

(8) ప్రకాశంజిల్లా :- ఉద్యమం జిల్లా అంతకు వ్యాపించి, ప్రాథమిక సెకండరీ రంగాలు రెండింటిలోను ఉన్నది. శ్రీ రామిరెడ్డి గారిని రాష్ట్రానికి తీసుకున్న కారణంగా మిగతావారిపై భారం ఎక్కువగా పడింది. అయినా ఒంగోలులో జిల్లా కార్యాలయం తెరచి సమస్యలపై నిర్విరామ కృషి సాగిస్తున్నారు. ఇటీవల నూతనంగా వచ్చిన 6, 7 తరగతుల సిలబసుపై ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహించారు. అధ్యక్షులుగా శ్రీ కె. బాలకోటయ్య, ప్రధాన కార్యదర్శిగా టి. బాలకృష్ణమూర్తి బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

9. నెల్లూరు :- సభ్యత్వం, ప్రాథమిక, సెకండరీ రంగాలలో విస్తరించి గతంకంటె పెరిగింది. ఉద్యమం క్రొత్త ప్రాంతాలకు విస్తరించింది. అక్రమ బదిలీలపై పోరాట కార్యక్రమం చేపట్టి రద్దు చేయించుకున్నారు. డి ఇ. ఒ. ఆఫీసులో సమస్యలు అడగబోతే దాడికి వచ్చారంటూ కేకలు పెట్టబోయేరు. అవినీతికి వ్యతిరేకంగా కృషి చేయడం కొందరు ఉద్యోగులకు కంటగింపుగావుంది నెల్లూరులో జిల్లా కార్యాలయం వుంది. అధ్యక్షులుగా శ్రీ టి. కొండాచారి, ప్రధాన కార్యదర్శిగా శ్రీ సి. హెచ్. లక్ష్మీనారాయణ బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

(10) చిత్తూరు :- సభ్యత్వం పూర్వంకంటె తగ్గినా గతసంవత్సరం కంటె పెరిగింది. నిర్మాణం సరిచేయబడ్డది. సర్క్యులర్లు పంపుతున్నారు. రాయబారాలు సాగిస్తున్నారు. రాష్ట్రంనుండి మరింత సహకారం అవసరం. అధ్యక్షులుగా శ్రీ. సి. మహదేవరెడ్డి, ప్రధాన కార్యదర్శిగా శ్రీ కె. గురుస్వామినాయుడు బాధ్యతలు చూస్తున్నారు.

(11) కడప: గత సం॥మే జిల్లాలో నిర్మాణం చేయబడింది. ఈ సం॥రం మరికొన్ని ప్రాంతాలకు నిర్మాణం విస్తరించింది. సభ్యత్వం గతం కంటె పెరిగింది. సమితి అక్రమాలు అరికట్టుటకు ఆమరణ నిరాహారదీక్ష కూడా సాగించారు. అధ్యక్షులుగా శ్రీ డి. రామిరెడ్డి, ప్రధానకార్యదర్శిగా శ్రీ కె. రామమూర్తి కార్యకలాపాలు సాగిస్తున్నారు.

(12) కర్నూలు: నిర్మాణంలో పొడచూపిన కొన్ని అవాంఛనీయ పద్ధతులు సరిచేయబడినవి. సభ్యత్వం పెరిగింది. నిర్మాణం మరికొన్ని ప్రాంతాలకు విస్తరించింది. సమస్యలపై కృషి సాగుచున్నది. అధ్యక్షులుగా శ్రీ అబ్దుల్ అజీజ్, ప్రధాన కార్యదర్శిగా శ్రీ పి. నరసప్పగారలు పనిచేస్తున్నారు.

(13) అనంతపురం : రాష్ట్ర సంఘ సహకారంతో నిర్మాణం మరికొన్ని కొత్త ప్రాంతాలకు విస్తరించవలసి వున్నది. సభ్యత్వం గతంకంటె పెరిగింది. వ్యతిరేకుల అడ్డంకులు అధిగమించి పురోభివృద్ధి సాగించవలసివుంది అధ్యక్షులుగా శ్రీ బి. వెంకటసుబ్బయ్య, ప్రధాన కార్యదర్శిగా శ్రీ వి. ఆదినారాయణరెడ్డి కార్యకలాపాలు చూస్తున్నారు.

(14) ఖమ్మం : జిల్లాలో మొత్తం 13 శాఖలలోను నిర్మాణం వుంది. అపరిష్కృత సమస్యలు, అక్రమ బదిలీలపై పోరాట కార్యక్రమం సాగించారు. ఖమ్మంలో జిల్లాఆఫీసు నిర్వహిస్తూ సమస్యలపై నిర్విరామకృషి సాగిస్తున్నారు. పిలుపుయిస్తే అందుకునే యంత్రాంగం వుంది. తరచు ప్రధాన బాధ్యతలు మార్చుకొనుటవల్ల కార్యకర్తల కొరతలేదని చెప్పుచున్నది. శ్రీ వి. యల్. నరసింహారావుగారు అధ్యక్షులుగా, శ్రీ వి. మల్లికార్జునరావుగారు ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

(15) వరంగల్‌జిల్లా : జిల్లా సంఘంలో పొడచూపిన పెడధోరణులు హద్దులో పెట్టిన కారణంగా సభ్యత్వం తగ్గింది. రాశిలో కన్నా వాసిలో బాగా వుండాలనేది మన సిద్ధాంతం. నిర్మాణం ఆరోగ్యకరమైన పద్ధతిలో జరిగింది. కన్వీనింగు కమిటీ చక్కని కృషి చేసింది. ఇటీవలనే నిర్మాణం సరిచేయబడింది. అధ్యక్షులుగా శ్రీ జె. కనకయ్య, ప్రధాన కార్యదర్శిగా శ్రీ యం. సుదర్శనం బాధ్యతలు చూస్తున్నారు.

(16) నల్గొండ: సభ్యత్వం గతంకంటే పెరిగింది.నిర్మాణం విస్తరించింది.అయితేప్రధానబాధ్యుడినిబ్రాంచిఆఫీసుబాధ్యతలకునియమించిన కారణంగా, జిల్లాలో కొంత అసంతృప్తి వున్నది, రెండు బాధ్యతలకు న్యాయం జరుగుటలేదు. క్రొత్త కార్యకర్తలు రంగంలోకి రావాలి. భుజాలు మార్చుకోవడం జరిగింది. అధ్యక్షులుగా శ్రీ పి. సత్యనారాయణ, ప్రధాన కార్యదర్శిగా శ్రీ పి. కృష్ణమూర్తి సంఘ కార్యకలాపాలు సాగిస్తున్నారు.

(17) హైదరాబాదు :- రాజధానిలో వున్నకారణంగా ఇతరుల పనులతో పాటు స్వంత పనులు కూడా ఎక్కువే. ఎయిడెడ్, అన్ ఎయిడెడ్ పాఠశాలల్లో అనేక పోరాటాలు సాగించారు. ఉపాధ్యాయ

లలో మంచి పేరు తెచ్చుకున్నారు. తిరిగి క్రొత్తవారు మరికొన్ని క్రొత్త సమస్యలతో సంఘంలోనికి వస్తున్నారు. వాటి పరిష్కారానికి మరొక పోరాటం సాగించవలసి వస్తున్నది. హైదరాబాదు ప్రభుత్వ ఆఫీసులలోని ఉద్యోగులే ఉపాధ్యాయులను దోపిడిచేసేకరస్పాండెంటులుగా చాలా మంది వున్నారు. వారిని ఎదుర్కొవడం పెద్ద సమస్య అయిపోయింది. అయినా కృషి సాగుచున్నది. అధ్యక్షులుగా శ్రీ ఎం. నరహరి, ప్రధాన కార్యదర్శిగా శ్రీ యన్. రాములు కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

(18) రంగారెడ్డి : హైదరాబాదు నుండి విడగొట్టబడ్డజిల్లా. మనకు ఒక సమితి ప్రాంతంలోను, హైదరాబాదు చుట్టుపట్ల సభ్యత్వం వుంది. అయినా యింకా సభ్యత్వం పెరగాలి. నిర్మాణం జరగాలి. కన్వీనరుగా శ్రీ యం. మార్కుగారు బాధ్యతలు చూస్తున్నారు.

(19) యం. నగర్:— జిల్లాలోగల 16 లోను 12 శాఖలు నిర్మించబడ్డాయి. సభ్యత్వం మరికొంత పెరిగింది. గ్రామీణ విద్యా గోష్ఠుల ద్వారా చక్కని కృషి చేస్తున్నారు. అధికారులతో సంప్రదింపుల ద్వారా సమస్యలను పరిష్కరించుకొంటున్నారు. అధ్యక్షులుగా శ్రీ కె. రాంరెడ్డి, ప్రధాన కార్యదర్శిగా శ్రీ ఎ. చంద్రమౌళిగారలు కార్యకలాపాలు సాగిస్తున్నారు.

(20) అదిలాబాద్:— సభ్యత్వం గతంకంటె తగ్గింది. నిర్మాణం బలపడింది. 12 శాఖలలో నిర్మాణం వుంది. మరింత విస్తరించే దానికి ప్రయత్నాలు చేస్తున్నారు. డి.ఇ.ఓ. ఆఫీసులోని అక్రమాలకు వ్యతిరేకంగా పోరాటం సాగించారు. అధ్యక్షులుగా శ్రీ వి. సుబ్బారావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ కె. కృష్ణారెడ్డి సంఘ కార్యకలాపాలు నిర్వహిస్తున్నారు.

(21) మెదక్:— లోగడ నిర్మాణం జహీరాబాద్ ప్రాంతానికే పరిమితం. అయితే కొన్ని క్రొత్త ప్రాంతాలకు ఉద్యమం విస్తరించింది. నిర్మాణం జరుగవలసి వున్నది. కన్వీనరుగా శ్రీ యం. ఆర్. రెడ్డి బాధ్యతలు చూస్తున్నారు.

(22) నిజాంబాద్:— క్రొత్తవారు రంగం మీదికి వచ్చారు. సభ్యత్వాన్ని, నిర్మాణాన్ని మరింత పెంపుచేయవలసి వున్నది. పాత క్రొత్తకలయికలతో ఉద్యమానికి మంచి భవిష్యత్ వున్నది. అధ్యక్షులు శ్రీవై. లక్ష్మీనారాయణ, ప్రధానకార్యదర్శిగా శ్రీ బి బాలయ్య బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

(23) కరీంనగర్:— ఉద్యమం మరింత బలాన్ని పుంజుకున్నది. కార్యకర్తలు మరికొందరు రంగంలోనికి వచ్చారు, సమస్యల పరిష్కారానికి కృషిచేస్తున్నారు, అధ్యక్షులుగా శ్రీ ఎన్. అంజయ్య, ప్రధాన కార్యదర్శిగా శ్రీ ఐ. శ్రీనివాసరావు బాధ్యతలు చూస్తున్నారు.

ఫంక్షనింగు :— సంఘానికి జీవం సక్రమ ఫంక్షనింగు, సమష్టి ఆలోచన దానిబలం. అందుకు మనం నిత్యం కృషిచేస్తున్నాం. విజయవాడలో 1980 సెప్టెంబరు 13, 14 తేదీలలో నూతన కౌన్సిలు, 1980 సెప్టెంబరు 9న సబ్‌కమిటీ, 1980 నవంబరు 7న సబ్‌కమిటీ, 1980 డిశంబర్ 13న కార్యవర్గం, 1981 జనవరి 10న సబ్‌కమిటీ, 1981 ఫిబ్రవరి 22న హైదరాబాద్‌లో కౌన్సిలు, ఏప్రిల్ 4న భీమవరంలో సబ్‌కమిటీ, విజయవాడలో మే 7న కార్యవర్గం, జూన్13న సబ్‌కమిటీ, జులై 12న విజయవాడలో కార్యవర్గం జరిగింది.

సర్క్యులర్లు: సంఘంసమావేశాలద్వారాతీసుకున్న నిర్ణయాలు, ప్రభుత్వ ఉత్తర్వులు ఎప్పటికప్పుడు సర్క్యులర్లద్వారా పంపించాము. 1980 సెప్టెంబరు 1, 14 తేదీలలో 12/80, 13/80, 14/80 నవంబరు 11 న 15/80, 16/80 డిశంబరు 3 న 17/80 డిసెంబరు 20 న 18/80, 1981 జనవరి 12 న 1/81 ఫిబ్రవరి 6, 25 లలో 2/81, 3/81, 4/81, మార్చి 27 న 5/81, 6/81, ఏప్రిలు 15 న 7/81, 8/81, మే 9 న 9/81, జూన్ 15 న 10/81, జూలై 13న 11/81 సర్క్యులర్లు, ప్రతినెల600మంది కార్యకర్తలకు పంపించాము. ఇవికాక అర్జంటు సర్క్యులర్లు,ఎన్నికల సూచనలు, జి.వో.లు [illegible]డిగా పంపించాము.

ఈకాలంలో యీ క్రింది సాహిత్యంకూడా అందించాము.

28–10–80 వరంగల్‌జిల్లా అడ్‌హాక్ కమిటీ

4–12–80 చెన్నుపాటి వర్ధంతిసభలు

8–2–81 ఆహ్వానసంఘ విజ్ఞప్తి

1–3–81 ధర్నా మెమోరాండం

9–5–81 ఉద్యమ విజ్ఞప్తి

అలాగే సంఘ నిర్ణయాలు, పాలసీల వివరాలు, సోదర ఉద్యోగుల పోరాటాలకు, సానుభూతులు అందజేస్తూ ప్రకటనలు యిచ్చాము, ఇవన్నీ అధిక ఖర్చుతోకూడినవైనా ఉద్యమానికి బలం చేకూర్చి, నిర్మాణాన్ని మరింత చక్కపరుస్తాయి కాబట్టి [illegible]ధిగా [illegible] హిస్తున్నాము. క్రిందిశాఖలు ఆలా చేయాలని కోరు[illegible]న్నా[illegible].

బ్రాంచి ఆఫీసు:— గతంకంటే కొంత [illegible]టగు, శ్రీ పి [illegible] నారాయణగారు హోల్‌టయిమరుగా వుండి బాధ్యతలు చూ[illegible]న్నారు శ్రీ యం. నరహరిగారు సహకరిస్తున్నారు. బ్రాంచి ఆఫీసుకు ఒక టైపుమిషన్, డూప్లికేటింగ్ మిషన్ సమకూర్చాము. దానిపనిని [illegible] మెరుగుపరచాలి.

రాష్ట్రకార్యాలయం; సంఘ కార్యక్రమాల నిర్వహణ ప[illegible], ప్రచురణ విభాగం పనులు విజయవాడ కేంద్ర కార్యాలయం నుండి నిర్వహిస్తున్నాము. ప్రస్తుతం 5 గురు హోల్‌టయిమర్లు, ఇద్దరు ఆఫీసు సిబ్బంది వున్నారు. సంఘం నుండి ఇద్దరు, ప[illegible] ముగ్గురు, ప్రచురణ నుండి ఇద్దరు మీటవున్నారు [illegible] టరీగా మరొకరు వుంటే తప్ప కరస్పాం[illegible] [illegible] నట్లు లేదు.

మనకున్న ఆస్తిపాస్తులు ;— విజయవాడలో [illegible] విలువచేయు స్థలము, భవనము, మీటింగుహాలు, [illegible] హాలులో ఐదింట రెండు వాటాలు. ఒక ఇనుప [illegible] వాలు, 3 ఇనుప ర్యాక్‌లు, 6 కర్ర డ్రాయర్లు. ఒక ఇనుప [illegible] 4 కర్రచేతుల కుర్చీలు ఒక ఇనుపచేతుల కుర్చీ, 17 ఇనుప [illegible]లు 4 స్టూల్సు, ఒక డెస్కు, 2 ఇనుపమంచాలు, ఒక [illegible], జంపఖానాలు 3, ఇనుపబకెట్లు పెద్దవి 2, చిన్నవి 3, [illegible] 2, ఇంగ్లీషు టైపు మిషనులు (రెమింగ్టన్) 2, తెలుగు టైపు మిషన్ 1 (గాడ్రెజ్), డూప్లికేటింగ్ మిషన్ స్టాండుతో [illegible] 1, [illegible] రికార్డర్స్ గోడగడియారం 1, ఫిలిప్స్ 3 బాండ్ల [illegible] 1 [illegible] గ్లాసులు 12, గాడ్రెజ్ తాళం కప్పలు 5 గలవు.

ఉపాధ్యాయులకు యిండ్ల స్థలాలను గురించి [illegible] ప్రత్యేకమైన కృషిచేస్తున్నాయి. ప్రకాశంజిల్లాలో ఐక్య ఉపాధ్యాయ నగర్‌కు, అనంతపురంలో చెన్నుపాటి లక్ష్మయ్యగారి పేర బిల్డింగ్ సొసయిటి ఏర్పాటుచేసి కృషిసాగిస్తున్నారు.

ఆర్థికం :— నిత్యం సంఘ కార్యక్రమాలు, [illegible] హైదరాబాదులో బ్రాంచి అఫీసు, హోల్‌టయిమర్ల [illegible]



## అశేష పాఠకుల ఆదరాభిమానాలతో వర్థిల్లుతున్న

# పత్రికా నివేదిక

## (1-8-77 నుండి 30-7-81 వరకు)

అధ్యక్షా !

నూతన కౌన్సిల్ సభ్యులారా !

ప్రత్యేకాహ్వానితులారా !

ఆంధ్రప్రదేశ్ ధాన్యాగారమూ, ఆంధ్ర పౌరుషాగ్ని జ్వాల అల్లూరి సీతారామరాజు వారసత్వ స్థలమూ, 1942 అగస్టు విప్లవంలో "రెండవ బార్డోలీ" గా ప్రసిద్ధిగన్న చోటూ, విద్యా కేంద్రమూ, కళలకు కాణాచీ అయిన భీమవరం పట్టణంలో మన 8 వ నూతన రాష్ట్ర కౌన్సిల్, తృతీయ విద్యా వైజ్ఞానిక మహాసభలు పెద్దఎత్తున జరుపుకొంటున్నాం. ఆ సందర్భంలో ఐక్య ఉద్యమ రథసారథులుగా పీడితోపాధ్యాయుల ప్రతినిధులుగా అనేకానేక పోరాటానుభవాలతో రాష్ట్రం నలుమూలలనుండి తరలివచ్చిన మీ అందరికీ సంపాదకవర్గం తరపున ఇవే మా జేజేలు.

మనం జరుపుకునే యీ కౌన్సిల్‌కు, మహాసభలకు, ప్రత్యేక ప్రాధాన్యత ఉన్నది. ఐక్యఉద్యమ మహాప్రస్థానంలో రాజమండ్రి, ఖమ్మం మహాసభలు మూలమలుపులుగా చిరప్రతిష్ఠనందాయి. పటిష్ఠ ఐక్యఉద్యమ నిర్మాణంలోను, వివిధ విద్యా సమస్యల్ని శాస్త్రీయ

---

రాయబారాలు, పర్యటనలు, ఇవన్నీ ఆర్థికంతో కూడుకున్నవి. సభ్యత్వ మొకదానితోనే యివి నడవవు. జనరల్ ఫండు పిలుపు అందుకున్నవి ఆరుజిల్లాలుకూడా లేవు. వచ్చినమేరకు గత అప్పులు తీర్చబడ్డాయి. సంఘానికి, భవనానికి, ప్రచురణకు వున్న అప్పులు తీర్చడానికే ప్రత్యేకంగా ఆలోచించవలసి వున్నది. సంఘ కార్యక్రమాలు నడిచేదానికి అన్నికోటాలు పూర్తి చేయవలసి వున్నది.

యు.టి.యఫ్. నిర్మాణంద్వారా ఐక్యతను రూపొందించుకొంటూ, అవినీతిని రూపుమాపుతూ, ఆశయాలను సాధించాలని భావించాం. అయితే అనేక అవకతవకలతో నిండిన నేటి సమాజంలో దారి తప్పించే శక్తులు అనేకం వున్నాయి. ఏపాటి ఏమరుపాటున వున్నా ప్రమాదం పొంచి వుంటుంది.

జి. వో.లు సాధించడం ఒక వంతయితే వాటిని పొందడానికి చాలా యిబ్బందులు ఎదుర్కొంటున్నాము. కొందరికి అడ్డదారులు ద్వారా పొందడం ఆనవాయితీగా వున్నది. అలవాట్లను మాన్పించి న్యాయంగా పొందడానికి కృషి చేయాలి.

మనలో కొందరు ఆ ప్రలోభాలకు లొంగి అవినీతికి ఆస్కారమిచ్చే అవకాశాలు లేకపోలేదు. వాటినివేయికళ్ళతో కనిపెట్టి ఎక్కడికక్కడ సరిచేయవలసి వున్నది. సరికానిచో, అట్టి శక్తులను వ్యక్తులను, ఉద్యమాలనుండి తొలగించవలసి వున్నది. వాపుకంటే బలమే ప్రధానం. ఎంతమంది వున్నారనేదికాదు. వున్నవారు ఎంత నిజాయితీగా వున్నారనేది మనకు గీటురాయి.

ఇన్ని యిబ్బందులు వున్నా ఉద్యమం ముందుకే, ముమ్ముందుకే పురోగమించింది. దానికి కారణం కార్యకర్తల త్యాగాలు, నిర్విరామకృషి, ఎన్ని కష్టాలు వచ్చినా, అడ్డంకులు ఎదురయినా, నమ్మిన ఆశయాలకు నిలబడి, సూత్రబద్ధ వైఖరులకు కట్టుబడి వుండి, 20 పాయింట్లకు దాసోహమవక, ప్రాంతీయ ఉద్యమాలలో కొట్టుకొనిపోక విద్యా ఉమ్మడి జాబితా అంటే ఉబ్బిపోక, నాలుగు

మానేజిమెంట్లకు తలవంచక ఉద్యమం వీరోచితంగా నిలచిన ఫలితంగా ప్రతి పరీక్షాసమయంలోను ఉపాధ్యాయుల పక్షాన నిలిచిన కారణంగా అధ్యాపకుల ఆదరాభిమానాలుచూరగొని, అత్యంత పెద్ద సంఘంగా ఆవిర్భవించింది.

అయితే సమాజంలో మేధావులంగా, సంఘంలో బాధ్యులంగా ఎన్ని ఇబ్బందులున్నా, పోరాటాలద్వారా మన పరిస్థితులను మెరుగుపరచుకొంటూనే, విద్యాబోధనలో మరింత దీక్షతో కృషి చేయవలసి వున్నది. 100 కి 70 కుటుంబాల నుండి పాఠశాలలకు వచ్చు విద్యార్థులు, అతి నికృష్ట జీవితం గడుపుచున్నారు. చదువుకొనే దానికి ఏ విధమైన ఖర్చు చేయలేని దౌర్భాగ్యస్థితిలో వున్నారు. వారికి మనం చెప్పించే చదువు, మనం నేర్పించే జ్ఞానం. కాబట్టి మనమెంత కీలకస్థానంలో వున్నామో గుర్తించి, బాధ్యతలు నిర్వర్తించవలసి వున్నది.

ఇంతటితో కష్టాలు గడచాయని కాదు. క్రొత్తగా అవతరించిన పంచాయితీ రాజ్యంలోని పాట్లు అధికారుల ఆగడాలు శక్తివంతమయిన ఉద్యమాలతో తిప్పికొట్టవలసివుంది.

ఆనామలీస్ సరికాలేదు. అవినీతి రూపుమాయలేదు. అశాస్త్రీయ విద్యా విధానం తొలగలేదు. అందుకు మరింత కృషిసాగించాలి.

ముగింపు :- పూర్వరంగంలో గత 6 సం॥ల ఉద్యమ సమీక్ష మీముందుంచాము. ప్రస్తుత రంగంలో గత సం॥రం సంఘ కార్యక్రమాలు వివరించాము. నివేదికను నిర్మాణాత్మక సూచనలతో పరిపుష్టం చేయండి. భవిష్యత్ ఉద్యమానికి బాటలు వేయండి.

భవదీయుడు

**ఎ. వెంకటస్వామి**

ప్రధాన కార్యదర్శి

దృక్పథంతో ప్రజల ముందు ఉంచటంలోను ఆ మహాసభలు కృత కృత్యమైనాయి.

ఇపుడు జరిగే యీ 3వ మహాసభ వాటిని మరింత ముందుకు తీసుకుపోయి, అస్థిరత, అ స్తవ్య స్తస్థితి పాదుకొన్న విద్యారంగ సమస్యలకు స్పష్టమైన పరిష్కార మార్గాన్ని చూపాల్సిఉంది, వృత్తి భద్రతకు, ఉపాధ్యాయ సంక్షేమానికి, విద్యారంగాభివృద్ధికి, మనం జరిపిన పోరాటాల్ని సమీక్షించుకొని గుణపాఠాన్ని గ్రహించి మరింత ముందుకు పోవాల్సిఉంది. మళ్ళీ అర్డినెన్సులూ, నిర్బంధ నిషేధాజ్ఞలూ కలానికి గళానికి సంకెళ్ళు పడే సంకట పరిస్థితి దాపురిస్తున్న యీ స్థితిలో మనం మరింత జాగ్రత్తులం కావల్సిఉంది.

ఆ ఉద్యమోత్సాహానికి, ఆ పోరాట పటిమకు ప్రతిబింబంగా మన పత్రికనింకా సానబట్టి, సరియైన ఆయుధంగా నిగ్గుదేల్చాల్సిన అవసరాన్ని మీముందుచుతూ గత నాల్గు వత్సరాల నివేదికను సంగ్రహంగా మీముందుచుతాను.

## సంఘమూ - పత్రికా

యు. టి. యఫ్. రాష్ట్రమంతటా వ్యాపించింది. దానితోపాటు పత్రిక కూడా వేగంగా వ్యాపిస్తున్నది. పత్రిక ద్వారా పునాదులు పడి సంఘం నూతన ప్రాంతాలకు విస్తరిస్తున్నది. ఈ విధంగా సంఘాభివృద్ధీ, పత్రికాభివృద్ధి పరస్పరాశ్రయాలుగా అవినాభావ సంబంధంతో విస్తృతపరిధిని సంతరించుకొని, ఆంధ్రప్రదేశ్ అంతటా వ్యాపించి అత్యధిక సర్క్యులేషన్ గల ఉద్యమ పత్రికగా పురోగమిస్తున్నది.

సమస్యా పరిష్కారానికి నిత్యపోరాటాలూ, సమరశీల కార్యక్రమాలూ, వివిధ సమస్యలపై సూత్రబద్ధ వైఖరి, జె సి టి ఎ, ప్యాప్టో మొదలైన ఐక్యఉద్యమ కార్యక్రమాల్లో అగ్రగణంగా పాల్గొనటం — వాటన్నిటినీ ప్రతిబింబిస్తూ, ఉద్యమ వాణిగా పేజీతోపాధ్యాయుల్ని చైతన్యపరుస్తూ, చేవదేలుస్తూ,వివిధాభిరుచులుగల అశేష పాఠకుల్ని మన పత్రిక ఆకట్టుకొని, అభిమాన పాత్రమవుతున్నది.

## వివిధ శీర్షికలు

అటు ఉద్యమపరంగా, ఇటు విద్యారంగ పరంగా చైతన్య స్ఫూర్తినీ, సామాజిక స్పృహనీ రేకెత్తించి ఉపాధ్యాయులు నిజమైన జాతి నిర్మాతలుగా రూపొందేందుకు మనం అనేక శీర్షికల్ని నిర్వహిస్తున్నాం,

అవి 6 భాగాలుగా ఉన్నవి.

(1) వృత్తి సంబంధమైనవి : ప్రశ్నోత్తరాలు, నియమ నిబంధనలు, సమస్యాతోరణం, ప్రభుత్వ ఉత్తర్వులు, పరీక్షా ఫలితాలు.

(2) విద్యాసంబంధమైనవి : విద్యావిధానం— తీరుతెన్నులు, విదేశ విద్యావిధానాలు.

(3) విజ్ఞానసంబంధమైనవి:— వార్తా ప్రపంచం, విజ్ఞానవీధి, మనమూ—మన ఆరోగ్యం.

(4) సాహిత్య సంబంధమైనవి : — కథలూ— గేయాలూ, సీరియల్స్.

(5) విమర్శనాత్మకమైనవి:— కార్టూన్లు,గుసగుసలు, పాఠకుల అభిప్రాయాలు, లేఖలు, చర్చావేదిక, గ్రంథసమీక్ష.

(6) ఉద్యమసంబంధమైనవి.— సభలు—రాయబారాలు. భవన నిధి, జీవితచందాలు, సంపాదకీయం.

సందర్భాన్నిబట్టి, అవకాశాన్నిబట్టి పై వాటిలో 15 శీర్షికల్ని ప్రతి సంచికలోనూ వచ్చేట్టు చూస్తున్నాం. ప్రతి శీర్షికా ప్రతి సంచిక లోనూ రావాలని మన పాఠకుల ఆకాంక్ష. అంతేగాకుండా ప్రపంచ ఉపాధ్యాయ ఉద్యమ వార్తలు, వివిధ రాష్ట్రాల ఉద్యమ వార్తలు, యూనివర్సిటీల ప్రకటనలు, వివిధ కోర్సుల ప్రకటనలు, ఉద్యోగ ప్రకటనలు, డిపార్ట్‌మెంటు టెస్ట్‌ల ప్రకటనలు, సిలబస్‌మీద ప్రత్యేక వ్యాసాలు కూడా ఉంటే బాగుంటుందని కోరుతున్నారు. వాటి సాధ్యాసాధ్యాన్నిబట్టి మనం ఆ ప్రకటనల్ని సేకరించవలసి ఉంది.

ఇక పాఠకుల్ని విశేషంగా ఆకర్షిస్తున్న ఒక్కొక్క శీర్షిక మీ ముందు ఉంచుతాను.

కార్టూన్లు :— మన కార్టూన్లు, వాటి వ్యాఖ్యానాలు పత్రికకు హైలైట్స్‌గా పలువురి ప్రశంస లందుకొంటున్నాయి. వాటికోసం ప్రతి నెలా ఉత్కంఠతో ఎదురు చూస్తున్నారు కూడా. ఆధునిక కార్టూన్ చిత్రకళను ఆ విధంగా మనం సద్విమర్శకూ, సామాజిక ప్రయోజనానికి, పాఠకుల చైతన్యాభివృద్ధికి వినియోగించుకుంటున్నాము. మరింత వ్యంగ్య వైభవం, సెటారికల్ హ్యూమర్ ఉండేట్టు వాటినింకా సానబట్టాల్సి వుంది, దానికి తోడ్పడుతున్న మన చిత్రకారులందరికీ ఈ సందర్భాన అభినందనలందిస్తున్నాను.

ఈ కాలంలో మనం ప్రచురించిన జంతర మంతర, ఉరి, సజీవసమాధి, సర్కస్ ఫీట్లు, భూతలింగం సిఫార్సుల ఫాసిల్స్, క్రిందికి దిగని ధరలు, శుష్కవాగ్దానాలు, శూన్యహస్తాలు, మదమత్త గజం, మర్రి వెర్రి, శలవుచీటీ, గ్రహణం, చందాల టిక్కెట్లు అవినీతి విషసర్పాలు, చిట్కావైద్యం, ఎయిడెడ్ ఎగ్రిమెంటు దుస్తంత్రం, ఓవర్‌లోడు. వెట్టిచాకిరి, పంచాయితీరాజులు మొదలగు కార్టూన్లు పాఠకుల విశేష ఆదరణ పొందాయి.

సంపాదకీయాలు :— మన సంపాదకీయాలు సమస్యా ప్రాధాన్యతను బట్టి సమయోచితంగా తీర్చిదిద్దబడుతున్నాయి. అభ్యుదయ పాఠశాలలపేరుతో జాతిని వెనక్కు నడిపే అశాస్త్రీయ విద్యావిధానాల్ని ఈ కాలంలో మనం ఎండగట్టేము. వయోజన విద్యా ప్రచారాలకి దృఢదీక్ష వెల్లడించాం, వసివాడిపోతున్న పసివాళ్ళ దుస్థితి కళ్ళకు గట్టించాం. ఉద్యోగుల సమైక్యపోరాటాన్ని బలపరిచాము. పన్నుల భారంపై దాడిచేశాము. ఎయిడెడ్ మేనేజిమెంట్ల దోపిడీని బట్టబయలుచేశాం. పరీక్షా విధానంలోని లోపకలాపకల్ని ఎత్తి చూపాము, విద్యారంగం ఎడ ప్రభుత్వం చూపు నిర్లక్ష్యాన్ని అడుగడుగునా ఖండించాము ప్రతి విషయంలోనూ గోడమీద పిల్లి వాటంగా కాకుండా జంకుబొంకులేకుండా సూత్రబద్ధవైఖరి అవలంబించాము. వాటిల్లో కొన్నిమచ్చుతునకల్ని మీ ముందుంచుతున్నాము.

"కోట్లకు పడగలెత్తిన కొన్ని కుటుంబాలే దేశసంపదనంతా తమ కబంధహస్తాల్లో ఇరికించుకొని కృత్రిమకొరత సృష్టిస్తూ' ప్రజల మూలిగల్ని పీలుస్తూ, ప్రాణాలతో చెలగాటమాడుతున్న దోపిడీ వ్యవస్థను కాపాడే పాలకవర్గ విధానాలే ధరల పెరుగుదలకు మూలకారణం."

"అధికారాన్ని కప్పల తక్కెడగా మార్చి ఊసరవెల్లులకంటె దారుణంగా పేటు ఫిరాయిస్తూ, రంగులు మారుస్తూ, రాజకీయ భరత నాట్యం చేసేవాళ్ళు జాతినెలా తీర్చిదిద్దగలరు? ప్రగతిమార్గం ఎలా చూపగలరు?"

"ఏవేవో కొన్ని సమస్యలు వచ్చినప్పుడు క్యాడర్‌వారీ సంఘాలు వెలిసినందువల్ల ఉద్యమాలకు నష్టంతప్ప సాధించేదేమీ ఉండదు. ఎవరికి నష్టం జరిగినా, కష్టం వచ్చినా, ఆ సమస్యల వెనుక మొత్తం ఉపాధ్యాయవర్గాన్ని సమీకరించి పోరాడినపుడే విజయులమవుతాం. ప్రధాన చైతన్యవాహినినుండి విడివడితే ఫలితం శూన్యం. సమైక్య ఉద్యమమే సమస్యా పరిష్కారానికి మార్గం."

'ఎయిడెడ్' ఉపాధ్యాయుల పాలిటి ఉరిత్రాడు అగ్రిమెంటు దుస్తం. అది ఆత్మ గౌరవానికి, సంక్షేమానికి భంగం. వాటిపై సంతకం చేయాలనే అవకాశవాదుల కుటిల వాదనల్ని తుత్తునియలు చేయండి."

## కథలూ - గేయాలూ

సాహిత్యానికి సాంఘిక ప్రయోజనం ఉండాలని మనధ్యేయం దానికి తగినట్టు స్థాయిలో, వైవిధ్యంలో, శైలిలో, శిల్పంలో, ఆధుని కత పుణికి పుచ్చుకొన్న వివిధ సాహిత్య ప్రక్రియలకు చెందిన అనేక రచనల్ని మనం యీ కాలంలో ప్రచురింపగలిగాము. మన పత్రికలో ప్రచురించబడిన ప్రతిగేయం దానికి మచ్చుతునకే.

పేరిగాడి రాజ్యంలో, నిరుద్యోగి, ఏంకలం – ఏంగళం ? అయ్యయ్యో పెనుతుఫాను, చిత్తూ–నత్తూ, లంచానికి జై, పరాన్న భుక్కుల ముక్కులు, అగ్రిమెంటు రాక్షసి, మరో సూర్యోదయం, తేడా, గ్రద్దలూ–కోడిపిల్లలూ మొదలైన గేయాలు.

కక్ష–శిక్ష, పిలుపు, కుక్కతోక, గడ్డితినేమనుషులు మొదలైన కథలు.

అక్షరారంముక్కలు, సన్మానం (నాటికలు)

స్ట్రగుల్., నల్ల చేపపిల్ల మొదలైన సీరియల్స్, పలువురి మన్ననలు పొందాయి.

అలాగే ప్రస్తుతం ప్రచురింపబడుతున్న, ఎయిడెడ్ టీచర్ల బాధల గాధల చిత్రించిన, 'ప్రత్యూష' నవల ఎందరో ప్రశంసల పొందుతున్నది.

అగ్ని పర్వతబిలం లచ్చాదనగప్పితే ఆగుతుందా?
ప్రళయాగ్ని జ్వాల పట్టి నిలిపితే అణుగుతుందా?– అని
—ప్రజ్వలించే ఉద్యమశక్తిని ఏనిరంకుశత్వము ఆపలేదనే
హెచ్చరిక "బావురుపిల్లుల్ని బహిరంగపరచు
నరభక్షక వ్యాఘ్రాల్ని నడ్డివిరగగొట్టు: – అనే కర్తవ్య బోధ
"చైతన్య రహిత జడమయి నరకంలో
ఎన్నాళ్ళు తమస్సుకు ఊడిగంచేస్తావు ?
ఉషస్సును ఊపిరిగా తీసుకొని
అంధకారాన్ని బంధించు !
అందరికీ వెలుగుపంచు ! అన్న ప్రబోధం, మన గేయరచ
యితల స్థాయిని తెల్పుతున్నవి.
అంతేగాదు.........
"మన విధుల్ని మనం విస్మరించము
మన హక్కుల్ని మనం విసర్జించము
నిబంధనలతో, నిర్బంధాలతో నిర్వీర్యులం కాబోము !
ఐక్య పోరాటం ఆయుధంగా, అజేయులం కాగలం !
—ఇలా ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించే గేయాలనేకం మనం ప్రచురించాం.

ఈవిధంగా దాదాపు 200 మందికిపైగా క్రొత్త రచయితల్ని మనం పరిచయంచేసి వెలుగులోకి తెచ్చాం. ఈ మహాసభలకు వారిలో చాలామంది వచ్చారు. వారందరికి నా అభివందనలు.

ఇతర శీర్షికలు ; మనం ప్రచురిస్తున్న ప్రశ్నోత్తరాల శీర్షిక పలువురి సందేహాల్ని నివృత్తిచేస్తున్నది. నియమ నిబంధనల శీర్షిక ఎంతో ప్రయోజనకరంగా ఉంది. బదిలీలుకావాలా ! శీర్షిక ఎందరికో ఉపయోగిస్తున్నది. 'మనం–మన ఆరోగ్యం' శీర్షిక డా॥రామారావు, ప్రజావైద్యశాల, విజయవాడ నిర్వహిస్తున్నారు. వారికికూడా అందరి పక్షాన ధన్యవాదాలర్పిస్తున్నాను.

## విద్యా విషయిక వ్యాసాలు

విద్యకుండవలసిన సామాజికదృక్పథాన్ని స్పష్టపరుస్తూ స్వదేశ, విదేశ విద్యా విధానాల్ని మనం యీ కాలంలో అనేకం ప్రచురించాం. శాస్త్రీయ విద్యా విధాన స్వరూపాన్ని, స్వభావాన్ని, లక్ష్యాన్ని ఆ వ్యాసాల్లో తేటపరచాం. విద్యాసంస్కరణల తీరుతెన్నుల్ని, విద్యా రంగంలో తీవ్రమౌతున్న సంక్షోభాన్ని స్పష్టపరిచాం. ముఖ్యంగా ఆంగ్లంనుండి ప్రతిభావంతంగా అనువదించి శ్రీయుతులు కె. కేశవ రెడ్డి, వి. బాలసుబ్రహ్మణ్యం, పి. శంకరయ్య, పి. రంగారావుగార్లు విశేష శ్రమకోర్చి ఆ శీర్షికకు న్యాయం కలిగిస్తున్నారు. వారందరికి నా అభినందనలు.

## పత్రిక సర్క్యులేషన్

ప్రతి సంవత్సరం ఆగస్టు నుండి స్పెషల్ క్యాంపెయిన్, నవంబరు నుంచి జనరల్ క్యాంపెయిన్ మనం కొనసాగిస్తూ పత్రిక వ్యాప్తి ఇతోధికం కావటానికి తీవ్ర కృషి సాగిస్తున్నాం. కార్య కర్తలు అపార దీక్షతో, త్యాగ దృక్పథంతో పోటీబడిన ఫలితంగా మన సర్క్యులేషన్ ఇబ్బడి ముబ్బడి అయింది. గత క్యాంపెయిన్‌లలో నెల్లూరు జిల్లా అగ్రభాగానికి వచ్చి రికార్డ్‌స్థాయిని నెల కొల్పింది. వాటి ఫలితంగా గత మహాసభల నాటికి 5200గా ఉన్న మన పత్రిక ప్రస్తుతం 11000 సర్క్యులేషన్‌కు పెంపొందింది. ఆ వివరాలన్నీ జిల్లాలవారీగా ప్రత్యేకంగా ఇస్తున్నాం. మన ఉద్యమాభి వృద్ధికి తగినట్టు దాన్ని యీ సంవత్సరం క్యాంపెయిన్లలో 14వేలతో ముందుకు తీసుకుపోవాలి.

గత క్యాంపెయిన్ల పోటీలో అగ్రస్థానం పొందిన ఆయా జిల్లాలవారికి యీ మహాసభల్లో బహుమతులిచ్చి గౌరవించబోతున్నాం. ఆవిధంగా పోటీలుపడి అపారదీక్ష ప్రదర్శించినవారికీ, కోటాలు అధిగమించిన వివిధ జిల్లాల కార్యకర్తలకూ మా అభినందనలు !

జీవిత చందాలు : ప్రత్యర్థుల్ని సైతం నివ్వెరపరుస్తూ మన జీవితచందాలు ప్లాను ప్రకారం అతివేగంగా వృద్ధిపొందాయి. గత మహాసభల నాటికి 135 గా ఉన్న జీవిత చందాదార్లు ప్రస్తుతం 2,400 కు పెంపొందటమేగాక, మరో 600 మంది స్కీముల్లో కొన సాగుతూ ఆ సంఖ్యను అతిత్వరలో 3 వేలకు పెంచబోతున్నారంటే దాని వేగం మనకర్థమవుతుంది.

ఈ జీవితచందాల దివ్వె ప॥గో॥ జిల్లా విస్సాకోడేరు సమితి వెలిగించింది. వారినాదర్శంగా జిల్లాలో అన్ని సమితులూ పోటీపడి జిల్లాకు అగ్ర స్థానంలో నిల్పాయి. దాన్ని ఛాలెంజీగా తీసుకొని నెల్లూరు జిల్లా, కోటసమితికి చెందిన శ్రీ షేక్ సాబ్జాన్ 9 స్కీములు చేపట్టి విజయవంతం చేశారు. సమితిలో అందర్నీ జీవిత చందా

దారుల్ని చేయాలని ఆయన దీక్ష. అలాగే అనంతపురం శాఖ అధ్యక్షుడు శ్రీ బి. వెంకటసుబ్బయ్యగారు ఒక్కరే 13 స్కీములు ప్రారంభించి క్రమంగా పూర్తి చేస్తున్నారు. వీరందరికీ మా జేజేలు.

ఇలాగే అన్ని జిల్లాల్లో ప్రణాళికాబద్ధంగా కృషిసాగిస్తే పత్రికా చరిత్రలోనే రికార్డుస్థాయి నెలకొల్పగలం. ఈ విజయాలకు కార్యకర్తల నిరంతర దీక్ష, ఉద్యమాభిమానుల త్యాగనిరతి, ప్రధాన కారణాలు. వారందరికీ మా జేజేలు.

## గత సంవత్సర క్యాంపెయిన్ల విజేతలు

| | ప్రథమ | ద్వితీయ | తృతీయ |
|---|---|---|---|
| స్పెషల్ క్యాంపెయిన్:- | తూ.గో జిల్లా | ప్రకాశంజిల్లా | ప. గో. జిల్లా కృష్ణాజిల్లాలు |
| జనరల్ క్యాంపెయిన్:- | నెల్లూరు | తూ. గో జిల్లా | ప్రకాశంజిల్లాలు |
| జీవితచందాలు : | ప. గో. జిల్లా | | |

## వ్యక్తిగత పోటీ విజేతలు

స్పెషల్ క్యాంపెయిన్

శ్రీ జి. గురుమూర్తి, నందిగామ, కృష్ణా – ప్రథమ
శ్రీ ఎ. భాగయ్యశాస్త్రి, తూ. గో – ద్వితీయ
శ్రీ యం, కోటయ్య, గుడ్లూరు, ప్రకాశం – తృతీయ
శ్రీ ఎస్. కె. సాజ్జాన్, కోట, నెల్లూరు – కన్సోలేషన్

జనరల్ క్యాంపెయిన్

శ్రీ యన్. కె. సాజ్జాన్, కోట, నెల్లూరు – ప్రథమ
శ్రీ ఎ. రాజయ్య, ఇందుకూరుపేట " – ద్వితీయ
శ్రీ కె. కిరణశ్రీ నెల్లూరు – తృతీయ

జనరల్ క్యాంపెయిన్లో అన్ని వ్యక్తిగత బహుమతులు నెల్లూరుజిల్లా కార్యకర్తలే పొందటం విశేషం. వారందరికీ ఉద్యమాభివందనాలు.

---

లైబ్రరీ చందాలు : కృష్ణా, తూ. గో., మ. నగర్ జిల్లాలలో లోకల్ లైబ్రరీలన్నిటికీ పత్రికలు పోతున్నవి. గుంటూరు, ప. గో, ప్రకాశం జిల్లాలకు విడివిడిగా పోతున్నవి. అలాగే అన్ని జిల్లాలలో లైబ్రరీ ఆధారిటీ ద్వారా లైబ్రరీ చందాలకు కృషిచేయాల్సి ఉంది.

అమలాపురం, రామచంద్రపురం, భీమవరం, సామర్లకోట ఒంగోలు మునిసిపల్ అధికారులు అక్కడి కార్యకర్తల ప్రత్యేక కృషివల్ల తమ అధీనంలో గల పాఠశాల అన్నిటికీ పత్రికలకు ఆర్డర్లు ఇచ్చారు. మిగిలిన పట్టణ శాఖలుకూడా ఆ కృషి సాగించవలసిందిగా కోరుతున్నాను.

పత్రిక గ్రంధాలయం: మనగ్రంధాలయాన్ని వివిధ రిఫరెన్స్ పుస్తకాలతో ఇంకా పరిపుష్టం చేయాల్సి వుంది. శ్రీ వాసిరెడ్డి సత్యనారాయణ (ఈనాడు) శ్రీ బొమ్మారెడ్డి (ప్రజాశక్తి) శ్రీ చుక్కపల్లి పిచ్చయ్య (పాపులర్ షూ కంపెనీ) గార్లనుండి మన లైబ్రరీకి దాదాపు మూడువేలు ఖరీదుచేసే పుస్తకాలు అందినవి. వారందరికీ అభివందనాలు. ప్రస్తుతం ఇంగ్లీషు గ్రంథాలు 500, తెలుగు పుస్తకాలు 300 ఉన్నది. ఆ పుస్తకాల విలువ దాదాపు రు. 5 వేలు ఉంటుంది.

ప్రకటనలు : అన్ని జిల్లా శాఖలూ ప్రకటనలు అందించవలసిందిగా కోటాలు నిర్ణయించాం. కాని చాలా జిల్లాలు దానికి ప్రత్యేక శ్రద్ధ వహించడంలేదు. ప్రకటనలుంటేతప్ప ఇబ్బడి ముబ్బడి అవుతున్న న్యూస్‌ప్రింటు ధరల్లో మన పత్రిక స్వయం పోషకంకాదు. పౌరసంబంధాల శాఖనుండి వచ్చిన ఇందిరా భజనకు చెందిన ప్రకటనను 80 ఫిబ్రవరి కౌన్సిల్ నిరాకరించింది. మళ్ళీ అలాంటి ప్రకటనలే ఆతర్వాత వచ్చినయ్. మన పాలసీకి వ్యతిరేకంగా, మన పరువు ప్రతిష్ఠా కోల్పోయేవిధంగా ఉన్న ఆ ప్రకటనలకు తలఒగ్గలేము. ఆశయాన్ని వదలి డబ్బుకు దాసోహం అనలేము. కాన ఆయా జిల్లాశాఖలు ప్రత్యేక శ్రద్ధవహించి కోటాల ప్రకారం ప్రకటనలు సేకరించి పత్రికను స్వయంపోషకం చేయగోరుతున్నాం.

కార్యాలయ నిర్వహణ : ఒక టెపిస్టూ, ఒక పార్టుటైమరూ, ఒక హోల్ టైమరూ ప్రస్తుతం పత్రిక పక్షాన పనిచేస్తున్నారు. ఆఫీసు కార్యదర్శి లేకపోవడం వల్ల కరస్పాండెన్స్ వెనుకబడింది. ఆ లోటు మనం భర్తీ చేసుకొంటేతప్ప ఉత్తర ప్రత్యుత్తరాలు సరిగా జరిగేస్థితి లేదు.

ప్రచురణలు ; 'ఐక్య ఉపాధ్యాయ' ప్రచురణల పక్షాన ఇప్పటికి అధ్యాపక దర్శిని 5 భాగాలు వెలువరించాము. 'నగరం' అనే గోర్కీ రచన ఈ మహాసభల్లో ఆవిష్కరింపబడుతున్నది. ఇది ప్రచురణల విభాగం పక్షాన ప్రతి సంవత్సరం అధ్యాపక దర్శిని అనుబంధాలు, సాహితీ గ్రంథాలూ వెలువడగలవు.

పత్రిక మిస్సింగ్ : పత్రికలు నిర్దిష్టంగా పోస్టవుతున్నా ఇంకా మిస్సవుతూనే ఉన్నాయి. అక్కడికీ రేపర్‌కి బదులు పిన్ చేసి, చిరునామా పత్రికపైనే అతికించి పంపుతున్నాం. ఒకసారి పత్రిక సరయిన అడ్రస్‌కు చేరితే, ఆ అడ్రస్‌కే చందాకాలమంతా పత్రికలు పోతుంటాయి. అంతే తప్ప పత్రికలు పోస్టు చేయక పోవటంగాని, మరే విధమైన లోటుగాని కార్యాలయంలో జరగదు. అడ్రసుల వెరిఫికేషన్‌కు టైప్‌డు అడ్రసులు ఆయా జిల్లా శాఖలకు అందిస్తున్నాం. వారు క్రింది శాఖలకు పంపి చిరునామాలు సరిగా ఉండేట్టు చూస్తే అడ్రసుల్లో దొర్లిన పొరపాట్లు సవరించటానికి వీలవుతుంది, కాని చాలా జిల్లా శాఖలు ఆ చిరునామాలను క్రింది శాఖలకు పంపకుండా తమదగ్గరే ఉంచుకొంటున్నారు. ఆ పద్ధతి మాని పత్రిక మిస్సింగ్ సరిచేయటానికి తోడ్పడాలని కోరుతున్నాము.

ఎప్పుడు పత్రికలు అందక పోయినా పోస్టల్ కంప్లెయింట్ పెట్టి సహకరింపవలసిందిగా ఎన్నోమార్లు పత్రికలో సూచనల ద్వారా విజ్ఞప్తి చేశాం. కాని చాలామంది చందాదారులు దాన్ని సరిగా పాటించటంలేదు.

పత్రిక అందలేదనే కంప్లెంటు ఆ నెలలోనే వస్తే పత్రిక పంపటానికి వీలవుతుంది. కొంతమంది అలాగాక 5, 6నెలల తర్వాత పత్రిక అందటంలేదని వ్రాసూ వెనుకటివి పంపమంటున్నారు. ఆఫీసులో నిల్వలు లేకపోవటంతో అలా పంపలేకపోతున్నాము.

సూచనలు; ఈ క్రింది సూచనలు పాటిస్తే పత్రిక ఎడిటింగ్ సులువవుతుంది. చందాదారులకు సక్రమంగా పత్రిక చేరటానికి ఉపయోగిస్తుంది.

1. పత్రిక అందకపోతే పోస్టల్ కంప్లెయింట్ పెట్టి ఆ కాపీ ఆఫీసుకు పంపిస్తే వెంటనే చర్య తీసుకుంటాము.

2. అందలేదన్న విషయం ఆ నెలలోనే తెల్పితే మళ్ళీ పత్రిక పంపటానికి వీలవుతుంది.

3. లిస్టులుగాని, విడి అడ్రస్‌లుగాని పంపేటప్పుడు తప్పని

## జిల్లావారీ పత్రిక సర్క్యులేషన్

| జిల్లా సం॥ | చందాలు | జీ॥చందాలు | స్కీములు | ఏజన్సీ | లైబ్రరీ | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1. నెల్లూరు | 1268 | 223 | 18 | — | — | 1509 |
| 2. తూ. గో. | 846 | 386 | 85 | 37 | 74 | 1428 |
| 3 ప. గో. | 505 | 484 | 47 | 36 | — | 1071 |
| 4. ప్రకాశం | 644 | 174 | 157 | 27 | — | 1002 |
| 5. ఖమ్మం | 482 | 193 | 122 | 124 | — | 921 |
| 6. గుంటూరు | 566 | 184 | 122 | 33 | — | 905 |
| 7. కృష్ణా | 558 | 97 | 11 | 2 | 97 | 765 |
| 8. మ. నగర్ | 283 | 148 | 29 | — | — | 460 |
| 9. నల్గొండ | 332 | 92 | 20 | — | — | 444 |
| 10. నిజామాబాద్ | 309 | 53 | 3 | — | — | 365 |
| 11. వరంగల్ | 273 | 87 | 1 | — | — | 361 |
| 12. అనంతపూర్ | 62 | 118 | 90 | — | — | 270 |
| 13. హైదరాబాద్ | 147 | 75 | 17 | 18 | — | 257 |
| 14. కరీంనగర్ | 217 | — | 9 | — | — | 227 |
| 15. కర్నూలు | 108 | 19 | 12 | 5 | — | 144 |
| 16. ఆదిలాబాద్ | 112 | 13 | 12 | — | — | 137 |
| 17. విశాఖ | 60 | 35 | 15 | 2 | — | 112 |
| 18. కడప | 83 | 9 | 4 | — | — | 96 |
| 19. విజయనగరం | 84 | 11 | — | — | — | 95 |
| 20. చిత్తూరు | 70 | 20 | 1 | — | — | 91 |
| 21. రంగారెడ్డి | 41 | 1 | — | — | — | 42 |
| 22. మెదక్ | 24 | — | 1 | — | — | 25 |
| 23. శ్రీకాకుళం | 16 | 2 | — | .... | .... | 18 |
| 24. ఇతరాలు | 12 | .... | .... | .... | .... | 12 |
| | 7095 | 2424 | 782 | 285 | 171 | 10,757 |
| | | | | సి. సి. | | 153 |
| | | | | స్టాక్ | | 50 |
| | | | | | | 10,960 |

సరిగా పిన్‌కోడ్ వేయండి. డూప్లికేట్ లిస్టులు పంపితే నంబర్లువేసి దాని కాపీ త్రిప్పిపంపగలం.

4. ఉద్యమ వార్తలు,సందేహాలు, కంప్లెయింట్‌లు, అడ్రస్‌లు కలగాపులగంగాగాక విడివిడిగా వ్రాస్తే ఆయాఫైళ్ళల్లోచేర్చి సక్రమ చర్యలు తీసుకోటానికి వీలవుతుంది.

5. ఉద్యమ వార్తలు ఏవిపంపినా ప్రధాన సమస్య శీర్షికగా ఉంచి సంగ్రహంగా కాగితానికి ఒకప్రక్కనే వ్రాసి పంపండి.

–పై జాగ్రత్తలు తీసుకుంటే పత్రిక మిస్సింగ్ తగ్గుతుంది. ఎడిటింగ్ తేలికవుతుంది.

కామ్రేడ్స్ :

గత 4 సంవత్సరాల నివేదిక సంగ్రహంగా మీముందుంచాను, దానిని చర్చించి, తగు సూచనలు చేసి పత్రికాభివృద్ధికి తోడ్పడవలసిందిగా కోరుతున్నాను.

అభినందనలతో

మైనేని వెంకటరత్నం
ప్రధాన సంపాదకుడు.

## ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్
### ఆర్థిక నివేదిక

[ 1–8–1977 నుండి 31–7–81 వరకు ]

| జమలు | రూ–పై | ఖర్చులు | రూ–పై |
|---|---|---|---|
| గత నిల్వలు. చేతినిల్వ | 247–81 | ప్రయాణం | 30,523–65 |
| బ్యాంకి నిల్వ | 1341–63 | అలవెన్సులు | 36,152–00 |
| జమలు. సభ్యత్వం | 98.478–50 | ప్రింటింగ్ | 15,218–10 |
| జనరల్ ఫండు | 20,946–70 | పోస్టల్ | 2,912–65 |
| విరాళాలు | 7, 396–90 | స్టేషనరీ | 4,340–79 |
| ప్రతినిధి రుసుం | 2,976–00 | లైబ్రరీ | 46–95 |
| సాహిత్యఅమ్మకం | 2,038–25 | ఫర్నిచర్ (డెప్‌మిషన్ వ॥) | 3,800–00 |
| వడ్డీలు | 138–80 | ఆఫీసు నిర్వహణ (అద్దెలు,కరెంటువగైరా) | 2,219–69 |
| పత్రిక పెట్టుబడి (అప్పు) | 10,595–25 | హైద్రాబాద్ బ్రాంచి ఆఫీసు నిర్వహణ | 10,043–73 |
| | | సమావేశాలు, ప్రత్యక్ష చర్యలు | 5,446–60 |
| | | ఫోటో | 2,015–00 |
| | | జిల్లా శాఖలు | 4,473–30 |
| | | కరెంటు, పైపులు వగైరా రిపేర్లు | 164–75 |
| | | ఇంటి పన్ను, రేడియో లైసెన్స్ వగైరా | 212–57 |
| | | బహుమతులు | 110–20 |
| | | గత అప్పులు తీర్చినది | 7,434–81 |
| | | ప్రచురణ విభాగానికి, జిల్లా శాఖలకు ఇచ్చినఅప్పులు | 18,101–16 |
| | | బ్యాంకి నిల్వ | 941–23 |
| | | చేతి నిల్వ | 2–66 |
| మొత్తం | 1,44,159–84 | మొత్తం | 1,44,159–84 |

టి. కొండాచారి, ఆడిట్ కమిటీ కన్వీనర్.

ఎ వెంకటస్వామి, ప్రధాన కార్యదర్శి.

## ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్
### ఆర్థిక నివేదిక

1-9-1980 నుండి 31-7-1981 వరకు

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| గత నిల్వలు | | ప్రయాణం | 13,429-00 |
| చేతి నిల్వ | 13-56 | పోస్టల్ | 1,127-30 |
| బ్యాంకి నిల్వ | 2,327-83 | ఆఫీసు నిర్వహణ | 936-71 |
| జమలు | | అలవెన్సులు | 8,813-00 |
| 1980 సభ్యత్వ బకాయిలు | 3,770-00 | ప్రింటింగ్ | 3,881-70 |
| 1981 సభ్యత్వం | 37,079-00 | స్టేషనరీ | 1,411-24 |
| జనరల్ ఫండు | 8,095-00 | ఫోటో | 600-00 |
| సాహిత్య అమ్మకం | 555-00 | సమావేశాలు, | |
| ప్రతినిధి రుసుం | 819-00 | ప్రత్యక్ష చర్యలు | 1,926-55 |
| విరాళాలు | 200-00 | హైదరాబాద్ బ్రాంచి నిర్వహణ | 3,901-45 |
| వడ్డీలు | 100-40 | మిస్‌లేనియస్ | 25-00 |
| | | ప్రచురణ విభాగానికి,జిల్లా శాఖలకు ఇచ్చిన అప్పులు | 16,963-95 |
| | | చేతి నిల్వ | 2-66 |
| | | బ్యాంకి నిల్వ | 941-23 |
| | 53.959-79 | | 53,959-79 |

## ఐక్య ఉపాధ్యాయ పత్రిక ఆర్థిక నివేదిక
### ( 1-9-80 నుండి 31-7-81 వరకు )

| | | |
|---|---|---|
| **జమలు** | గతనిల్వ | 53-29 |
| | సంవత్సర చందాలు | 81, 420-00 |
| | జీవిత చందాలు | 86, 230-00 |
| | వ్యక్తిగత స్కీములు | 13, 555-00 |
| | విడి కాపీలు | 4, 287-00 |
| | వ్యాపార ప్రకటనలు | 4, 815-00 |
| | అమ్మకము (వార్తాపత్రికలు వగైరా) | 183-25 |
| | వడ్డీలు | 4, 450-80 |
| | మొత్తము | 1, 94, 994-34 |
| **ఖర్చులు** | ప్రింటింగ్ | 68, 694-79 |
| | అలవెన్సులు | 7. 084-00 |
| | పోస్టేజి | 4, 402-60 |
| | ప్రయాణం | 2, 442-25 |
| | స్టేషనరీ | 4, 188-48 |
| | లైబ్రరీ | 1, 192-39 |
| | ఆఫీసు నిర్వహణ | 1, 121-95 |
| | అప్పులు | 54, 907-85 |
| | ఫిక్సెడ్ డిపాజిట్లు | 50, 000-00 |
| | బ్యాంకు నిల్వ | 810-20 |
| | చేతి నిల్వ | 149-83 |
| | మొత్తము | 1, 94, 994-34 |

## ఐక్య ఉపాధ్యాయ పత్రిక ఆర్థిక నివేదిక
### (1-8-77 నుండి 31-7-81 వరకు)

**జమలు**

| | |
|---|---|
| చేతినిల్వ | 172-40 |
| బ్యాంకు నిల్వ | 9,252-25 |
| ఫిక్స్‌డ్ డిపాజిట్ నిల్వ | 13,800-00 |
| జీవిత చందాలు | 2,64,146-00 |
| సంవత్సర చందాలు | 2,63,052-00 |
| వ్యక్తిగత స్కీములు | 13,555-10 |
| అరసంవత్సర చందాలు | 625-00 |
| విడికాపీలు | 11,601-00 |
| వ్యాపార ప్రకటనలు | 22,633-95 |
| విరాళములు | 18-20 |
| వడ్డీలు | 10,071-75 |
| వార్తాపత్రికలు వగైరా అమ్మకము | 183-25 |
| మొత్తము | 6,09,413-90 |

టి. కొండాచారి,
కన్వీనర్ ఆడిట్ కమిటి,

**ఖర్చులు**

| | |
|---|---|
| ప్రింటింగ్ | 2,21,986-31 |
| అలవెన్సులు | 45,034-00 |
| బహుమతులు | 250-00 |
| స్టేషనరీ | 10,382-35 |
| ప్రయాణం | 8,876-25 |
| పోస్టేజీ | 14,002-13 |
| లైబ్రరీ | 2,290-77 |
| ఆఫీసు నిర్వహణ | 3,351-87 |
| చెన్నుపాటి భవననిధికి విరాళం | 18,000-00 |
| అప్పులు | 74,586-44 |
| ఫిక్స్‌డ్ డిపాజిట్స్ | 2,00,000-00 |
| బ్యాంకు నిల్వ | 7,563-95 |
| చేతినిల్వ | 149-83 |
| మొత్తము | 6,09,113-90 |

ఎ. వెంకటస్వామి,
ప్రధాన కార్యదర్శి.

---

మినీ కథ :

## శాస్తి

కంచె కంచే తిరిగి .... పువ్వు పువ్వు మీదా వాలి, తేనె బొట్టు తెచ్చి కూడబెట్టినయ్ తేనెటీగలు.

గూడూ .... నీడా నిర్మించుకున్నయ్. గర్వంగా శ్రమఫలితాన్ని అనుభవిస్తున్నయ్.

ఓ పరాన్నభుక్కు దాన్ని చూశాడు. లొట్టలేస్తూ గూటిని కదిపాడు. ఇంకేముంది.... ఝుమ్మంటూ గుంపుగాలేచినయ్ తేనెటీగలు.

వళ్ళంతా వాచిపోయేట్టు తెగకుట్టి పడేసినయ్.

'చూశారా.... దౌర్జన్యం!' అన్నాడు పరాన్నభుక్కు.

'దోపిడీకి శాస్తి అదే!' ప్రతిధ్వనించింది ప్రజావాక్కు.

# ఈశ్వరీబాయి పటేల్ కమిటీ నివేదిక

## రివ్యూకమిటీ నియామకం సూచనలు

భారత ప్రభుత్వం సిలబస్, పాఠ్య గ్రంధాల్ని అభివృద్ధి పరచుటకు ఒక రివ్యూ కమిటీని నియమించింది. యన్. సి. ఆర్. టి వారు రూపొందించిన మొదటి పదిసంవత్సరాల పాఠశాల విద్యను ఆకమిటీ సమీక్షిస్తుంది.

కమిటీ ఈ క్రింది అంశాలను పరిగణనలోకి తీసుకొంటుంది

1. యన్. సి. ఆర్. టి వారు సూచించిన పది సంవత్సరాల పాఠశాల విద్యలోని పాఠ్యాంశములను, లక్ష్యాన్ని పరిశీలించుట.

2. యన్.సి.ఆర్.టి వారు రూపొందించిన పాఠ్యగ్రంథాన్ని పరిశీలించుట.

3. సిలబస్, టైం టేబుళ్ళలో అవసరమైన మార్పుల్ని తీసుకువచ్చుట, అర్హతగల ఉపాధ్యాయుల్ని నియమించుట.

4. ప్రస్తుతం అమలులో ఉన్న పాఠ్యప్రణాళిక, టైం టేబుల్.

(ఎ) విద్యార్థిలో సృజనాత్మక శక్తిని పెంచుటకు వెనుకబడినవారికి అదనంగా బోధించటానికి ఉపాధ్యాయునికి వ్యవధి కల్పిస్తున్నదా ?

(బి) చురుకైన విద్యార్థికి తగుప్రోత్సాహ మిచ్చి, అభివృద్ధిలోనూ, విద్యాప్రమాణాలు నిర్దేశించిన లక్ష్యాలను అందుకొనేట్టు చేయటానికి ఉపాధ్యాయునికి తగు వ్యవధి వుందా ?

పై అంశాల్ని పరిశీలించి నివేదిక సమర్పించటానికి గుజరాత్ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ప్రొఫెసర్ ఈశ్వరీబాయ్ పటేల్ అధ్యక్షతన 28 మందితో ఒకకమిటీ నియామకం జరిగింది. ఆ కమిటీ నివేదికను క్రింద యిస్తున్నాం.

## పాఠశాలా విద్యాసంస్థ నిర్మాణం - లక్ష్యాలు

యన్ సి.యి.ఆర్.టి వారు రూపొందించిన మొదటి పది సంవత్సరాల విద్యను బాలబాలికలందరికి 14 సంవత్సరములు వచ్చేవరకు నిర్బంధ ప్రాథమిక విద్య అందజేయాలనే రాజ్యాంగంలోని 45వ నిబంధనను దృష్టిలో పెట్టుకొని, 14 సంవత్సరముల వరకు బోధింపబడే నిర్బంధ విద్యాలక్ష్యాలు ఆ తరువాత విద్యాలక్ష్యాలకంటె భిన్నంగానేగాక స్పష్టంగావుండాలని మేము అభిప్రాయ పడుతున్నాం. పరిజ్ఞానాన్ని, నిపుణతను, అలవాట్లను, దృక్పధాన్ని యివ్వటం విద్యయొక్క సాధారణ లక్ష్యాలై వుండాలని మేము అభిప్రాయ పడుతున్నాం. వాటి ద్వారా వ్యక్తి:-

1. పౌరునిగా తనబాధ్యతలను సక్రమంగా నెరవేర్చగలగాలి.

2. వ్యక్తిలో నిక్షిప్తమైన ప్రజ్ఞను వెలికి తీయడం ద్వారా, అతడిలోని సృజనాత్మకశక్తిని ప్రోత్సహించడంద్వారా, ఇరుగు పొరుగుతో పొందికగా ప్రవర్తించడంతో పాటు సమాజాభివృద్ధికి దోహదపడే వాడుగా ఎదగాలి.

బిడ్డపై కుటుంబం, పరిసరాల ప్రభావం అధికంగా ఉంటుంది. బిడ్డ పాఠశాల విద్య ప్రారంభం కాకముందే చాలా విషయాలు నేర్చుకొంటాడు. క్రమబద్ధమైన విద్యా విధానం బిడ్డకు కుటుంబం నుండి, పరిసరాల నుండి సంక్రమించే చెడును అంటనీయకుండ ఉన్నతమైన ఆలోచనా విధానం, సత్ప్రవర్తనవైపు మరల్చగలదని మేము విశ్వసిస్తున్నాం.

విద్యాబోధన సాంప్రదాయకమైన పద్ధతులద్వారానే జరగాలనే నిబంధన ఉండకూడదు. విద్యాసంస్థల నియమాలలో సడలింపులు అవసరం. సంస్థ పనిచేసే పూర్తికాలం కాకుండ కొంతకాలం (Part time) చదువుకొనడానికి అవకాశం వుండేవానికి కూడా చదువుకొనడానికి అవకాశాలుండాలి. పూర్తికాలం చదువుకొనేవారికి, కొంతకాలంమాత్రమే చదువుకొనేవారికి అందుబాటులో వుండేవిధంగా విద్యావిషయాలలో కూడా కొంత సడలింపు అవసరం. చదువు నేర్చుకొనే అవసరాలనుబట్టి సిలబస్‌కూడా రూపొందింపబడాలి.

సిలబస్ స్థానిక అవసరాలనుకగుణమయిందై వుండాలి. వివిధ ప్రాంతాలలోని వివిధ స్థాయిలలోని విద్యాభివృద్ధిని కొలవడానికి కనీస కొలబద్దను కూడా నిర్దేశించాలి.

ప్రస్తుతం ప్రాథమిక, సెకండరీస్థాయి విద్యాబోధనకు వయోపరిమితి అమలులో ఉంది. ప్రాథమిక స్థాయిలోగాని సెకండరీ స్థాయి విద్యలో గాని అనివార్య పరిస్థితుల వలన చదువు మానుకున్న విద్యార్థికి, మరలా చదువు కొనసాగించడానికి అనువైన పరిస్థితులుండాలి.

## సం॥రాలవారీ సంఘ సభ్యత్వము

| నెం. జిల్లా | 1974 | 1975 | 1976 | 1977 | 1978 | 1979 | 1980 | 1981 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళం | .... | .... | .... | .... | .... | .... | .... | 11 |
| 2. వి.నగరం | — | — | — | — | — | 300 | 358 | 445 |
| 3. విశాఖ | .... | 111 | 250 | 400 | 500 | 400 | 354 | 605 |
| 4. తూ.గో. | 3000 | 3300 | 3500 | 4500 | 4500 | 5500 | 6000 | 6000 |
| 5. ప గో. | 1500 | 2022 | 2050 | 2800 | 3500 | 3800 | 4090 | 5000 |
| 6. కృష్ణ | 500 | 900 | 697 | 1100 | 1600 | 2500 | 2900 | 2000 |
| 7. గుంటూరు | 700 | 1112 | 1900 | 2600 | 3740 | 4260 | 5000 | 5000 |
| 8. ప్రకాశం | 300 | 800 | 1330 | 1700 | 2650 | 3000 | 3504 | 4508 |
| 9. నెల్లూరు | 500 | 1300 | 1400 | 1825 | 3000 | 3000 | 3000 | 3700 |
| 10. చిత్తూరు | .... | .... | .... | 2000 | 1000 | 550 | 310 | 915 |
| 11. కడప | — | — | — | — | — | — | 100 | 500 |
| 12. కర్నూలు | 500 | 500 | 100 | 440 | 500 | 430 | 750 | 1000 |
| 13. అనంతపురం | — | — | — | 100 | 200 | 280 | 500 | 650 |
| 14. ఖమ్మం | — | 550 | 900 | 1100 | 1500 | 2000 | 1932 | 2004 |
| 15. వరంగల్ | — | 100 | 400 | 700 | 1032 | 1600 | 1880 | 923 |
| 16. నల్గొండ | — | 100 | 234 | 400 | 550 | 1000 | 1000 | 1200 |
| 17. హైదరాబాద్ | — | 65 | 82 | 84 | 150 | 300 | 300 | 500 |
| 18. రంగారెడ్డి | — | — | — | — | — | 24 | 35 | 23 |
| 19. యం.నగర్ | — | 60 | 25 | 200 | 500 | 700 | 670 | 800 |
| 20. ఆదిలాబాద్ | — | — | — | — | 500 | 500 | 653 | 510 |
| 21. మెదక్ | — | — | — | 23 | 100 | 55 | 20 | 50 |
| 22. నిజామాబాద్ | — | 54 | 144 | 100 | 63 | 450 | 300 | 305 |
| 23. కరీంనగర్ | — | — | — | — | — | 500 | 400 | 500 |
| 24. సెంటరు | — | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 |
| మొత్తం | 7000 | 11068 | 13002 | 20103 | 25589 | 31148 | 37153 | |

## దృక్పథం - విలువలు

ప్రతి విద్యార్థికి సమానత్వం, మతాతీత లౌకిక రాజ్యం ప్రజాస్వామ్య దృక్పథాలను కలిగించడంతో పాటు రాజ్యాంగంలో నిర్దేశించిన న్యాయం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం సాధనల కొరకు కృషిచేసేందుకు దోహదం చేసేదిగా విద్యావిధానం వుండాలని మా అభిప్రాయం.

ప్రస్తుత విద్య పట్టణాలలో కేంద్రీకరింపబడింది. దీనిలో పుస్తక పరిజ్ఞానానికి ప్రాముఖ్యత హెచ్చు. శ్రమశక్తి కెలాంటి ప్రాధాన్యతలేదు. బీదవారికి బలహీనవర్గాల వారికి సమానావకాశాలు లేవు. మహాత్మా గాంధీచే రూపొందింపబడి కొఠారి కమీషన్ రిపోర్టులో ఆమోదింపబడిన 'పనిచేస్తూ చదువు కొనడానికి' మన విద్యావిధానంలో అత్యంత ప్రాధాన్యత నివ్వాలి.

సంక్షిప్తంగా రానున్న పదేళ్ళలో మన విద్యావిధానం.

1. సాంప్రదాయ సంస్కృతిలో రావలసిన మార్పుల నవగతం చేసికొంటూ సాంస్కృతిక వారసత్వాన్ని అర్థం చేసుకొనుటకు ప్రోత్సహించేది గాను,

2. రాజ్యాంగంలో నిర్దేశించిన భావిపౌరుణ్ణి తయారు చేసేది గానూ,

3. పుస్తకాలలో దూరి బుద్ధి జీవుల మవుతున్నామనే విధానానికి మారుగా సామాజిక ఉత్పత్తిని పెంచే శారీరక శ్రమతో సాన్నిహిత్యాన్ని పెంచుతూ దేశంయొక్క సామాజిక,ఆర్థికపరిస్థితుల నర్థం చేసికొన గలిగేదిగాను;

4. హేతువాద శాస్త్రీయ దృక్పథాన్ని ప్రోత్సహించేదిగాను,

5. జీవితంలోని అన్ని రంగాలలో నిరాడంబరత, వ్యక్తిగత నిజాయితీ, సహనం, సహకారంలాంటి లక్షణాలను పెంచేదిగను,

6. కులం తెగలకతీతంగా, స్త్రీ పురుష వివక్షత కతీతంగా వయస్సు, ప్రాంతం ఆర్థిక పరిస్థితుల కతీతంగా ప్రతి వ్యక్తికీ ఎప్పుడైనా పని- చదువు చెట్టాపట్టాలేసికొని పురోగమించడానికి అవకాశాలుండాలి.

## ప్రాథమిక సెకండరీ స్థాయి విద్యలోని ప్రత్యేక లక్ష్యాలు

ప్రాథమిక సెకండరీ విద్యాస్వరూపం, విషయాలు ఈ క్రింది విధంగా వుండాలని మేము అభిప్రాయపడుతున్నాం.

ప్రాథమిక విద్య అందరికీ అందజేయాలని రాజ్యాంగంలో నిర్దేశింప బడింది. గనుక ప్రాథమిక విద్య లక్ష్యాలు యితర స్థాయిలలోని లక్ష్యాలకు భిన్నంగా వుండాలని మా అభిప్రాయం.

### A ప్రాథమిక విద్య లక్ష్యాలు (I-VII/VIII)

1. అక్షరాస్యత సంఖ్యామానంతోపాటు, శ్రమసంబంధమైన ప్రాథమిక పరిజ్ఞానం.

2. పరిశీలనద్వారా విజ్ఞానాన్ని పొందుట, సామాజిక స్పృహ కలుగజేయుట.

3. ఆటపాటల ద్వారా శారీరక శక్తి, సామాజిక ప్రకృతి శాస్త్ర రంగాలలో ప్రయోగాలు చేయుట.

4. చదువును పనితో జోడించ గలిగేందుకు పథకాలను రూపొందించి వాటికి ఉత్పత్తి సాధించుటకు అమలు జరుపుట.

5. ప్రయోజనకరమైన పరిశీలనా జ్ఞానాన్ని పెంపొందించుట.

6. కుటుంబంలో, పాఠశాలలో, సమాజంలోని సభ్యులలో సహకార దృక్పథం పెంచుకొనుట.

7. ప్రకృతిపరిశీలన, కళాత్మక రంగాలలో పాల్గొనడంద్వారా కళాత్మక దృక్పథాన్ని, కళాసృష్టిని ప్రోత్సహించుట.

8. ఇతర మతాల, ప్రాంతాల దేశాల ప్రజల ఆచార వ్యవహారాలను గౌరవించే సామాజిక బాధ్యత పెంపొందించుట బలహీన వర్గాలకు తోడ్పాటు అందించుట.

9. సామాజిక ఉత్పత్తి పని విధానాలలో ఆసక్తి కలిగించుట, సామాజిక సేవాదృక్పథం కలిగించుట.

### సెకండరీ విద్యాలక్ష్యాలు (VII,IX-X)

1. స్వంతంగా నేర్చుకొనే అలవాట్లను, నిపుణతను పెంచుట.

2. విజ్ఞాన శాస్త్రం, గణితం, సామాజిక విజ్ఞాన శాస్త్రం, భాషలు, సామాజిక ఉత్పత్తిని పెంచే శ్రమశక్తి విభాగాలలో విశాల దృక్పథంతో సాధారణ విద్యను నేర్చుకొనుట.

3. ఇతరులకు సహాయపడే అలవాట్లతోపాటు క్రీడారంగంలో పాల్గొని శారీరక ఆరోగ్యాన్ని కాపాడుకొనుట.

4. కళారంగాలలో పాల్గొంటూ కళాత్మకములను అభినందించుట, సాహిత్యం కళలను సృష్టించుట.

5. పాఠశాలకు వెలుపలనున్న జీవితవాస్తవాలను అవగతం చేసికొని దృఢచిత్తంతో బాహ్య ప్రపంచంలో అడుగు పెట్టడానికి సన్నద్ధమగుట.

6. ప్రజాస్వామ్య విలువలను పరిరక్షిస్తూ పాఠశాలలోని సామాజిక కార్యకలాపాలలో పాల్గొంటూబలహీనవర్గాలకు తోడ్పాటు నందిస్తూ సమానత్వాన్ని నెలకొల్పడానికి కృషి చేయుట.

పైన వివరించిన ప్రాథమిక సెకండరీ విద్యాలక్ష్యాలను రాజ్యాంగంలో పొందు పరచిన ఆదేశిక సూత్రం (45)ను దృష్టిలో పెట్టుకొని, పాఠశాలనువదలివెళ్ళే విద్యార్థులకు, మన దేశ సంస్కృతీ వారసత్వంగల బాధ్యతాయుతమైన పౌరులుగా వారి హక్కులను వినియోగించుకో గలిగిన విధంగా, నిర్బంధవిద్యను విశాల ప్రాతిపదికగా రూపొందించాలని మేము సిఫార్సు చేస్తున్నాం. 8,9,10 తరగతుల విద్యార్థుల స్థాయి అభిరుచులనుబట్టి సాధారణ విద్యయేగాక అదనంగా వారి అభిరుచులను, వారి ప్రజ్ఞను ప్రదర్శించడానికి అవకాశాన్ని కల్పించే రంగాన్ని రూపొందించాలి.

విశాల ప్రాతిపదికపై రూపొందించే సెకండరీ విద్యలో చాలా సబ్జక్టు వుంటున్నాయి. కాబట్టి ఒక్కొక్క సబ్జక్టులో చేర్చే పాఠ్యాంశాలు ఆ సబ్జక్టునర్థం చేసుకొనడానికి సరిపోయేటంత తక్కువగా నుండాలని సిఫార్సు చేస్తున్నాం. పాఠశాలలోని వివిధ స్థాయిలలో వివిధములైన సబ్జక్టులకు కేటాయించవలసిన సమయాన్ని ఈ క్రింది యిస్తున్నాం. ఇది భారతదేశంలోని అన్ని ప్రాంతాలకు వర్తింపజేయవచ్చును.

| | తరగతులు (I-IV,V) | కేటాయించబడిన కాలం |
|---|---|---|
| 1 | ఒక భాష | 20% |
| 2 | గణితము | 20% |
| 3 | పరిసర పరిజ్ఞానం (సామాజిక శాస్త్రం, ప్రకృతి విజ్ఞానం, ఆరోగ్య విద్య) | 20% |

4 సమాజానికి ఉపయోగపడే ఉత్పత్తిని సాధించే పని 20%

5 ఆటలు, సృజనాత్మక కార్యకలాపాలు (సంగీతం, నాట్యం, చిత్రకళ) 20%

| తరగతులు V/ VI-VII/ VIII | వారానికి కేటాయించ వలసిన సమయం |
|---|---|
| 1 భాషలు | 7 గంటలు |
| 2 గణితం | 4 గంటలు |
| 3 చరిత్ర ,పౌరవిజ్ఞానం, భూగోళశాస్త్రం | 4 గంటలు |
| 4 విజ్ఞాన శాస్త్రము | 4 గంటలు |
| 5 కళలు (సంగీతం, నాట్యం ,చిత్రకళ) | 3 గంటలు |
| 6 సమాజానికి ఉపయోగపడే ఉత్పత్తిని సాధించే శ్రమశక్తి మరియు సమాజసేవ | 6 గంటలు |
| ఆటలు, వ్యాయామవిద్య పర్యవేక్షక అధ్యయనం | 4 గంటలు |

## సామాజికంగా ఉపయోగపడే ఉత్పత్తి పనిచట్రము

ఇప్పటి పరిస్థితిని పరిశీలిస్తే ఈనాడు అమలులోనున్న విద్యా విధానం పుస్తకాలకు సంబంధించినది కావడం వలన సామాజికావసరాలకు సరిపడేదిగా లేదు.

జాతీయోద్యమ కాలంలో మన నాయకులు రూపొందించిన విద్యావిధానంలో స్వరాజ్యం సాధించిన తరువాత గాంధీగారు రూపొందించిన విద్యావిధానంలోనూ పనికి ప్రాధాన్యత కల్పించబడింది. శారీరక శ్రమతో సంబంధంలేని ఉద్యోగాలకు గాంధీగారు వ్యతిరేకులు 'ఉత్పత్తిని సాధించే శ్రమపై' విద్యావిధానం రూపొందిస్తే అది వ్యక్తి వికాసానికి సామాజిక మార్పుకు దోహదం చేస్తుందని గాంధీగారి అభిప్రాయం.

స్వాతంత్ర్యం సాధించిన తరువాత విద్యావిధానంలో రావలసిన మార్పులకొరకై ఎన్నో కమిటీలకు కమీషన్‌లను వేయడం జరిగింది. అందరూ కూడా విద్యా సమస్యలన్నిటికీ గాంధీగారి 'బేసిక్ ఎడ్యుకేషన్' పరిష్కరిస్తుందన్నారు. కాని సాంప్రదాయ నరనరాల జీర్ణించుకొనిపోయి వుంది. విద్యావిధానం పుస్తకాలకే పరిమితమై వుంది. సామాజిక అవసరాలకు దూరంగానేవుంది. కాబట్టి సామాజిక ఉత్పత్తి సాధించే శ్రమకు సిలబస్‌లో పాఠశాల విద్య అన్ని స్థాయిలలో అత్యంత ప్రాధాన్యత నీయవలసి వుంటుంది. వివిధ సబ్జక్టులలోని పాఠ్యాంశాలు వీలైనంతవరకు దీనికి సన్నిహితంగా వుండాలి.

## సామాజిక ఉత్పత్తిని పెంచేపని

ఇది అర్థవంతమైన ప్రయోజనాత్మకమైన శారీరక శ్రమ. ఈ శ్రమ వస్తువులనుత్పత్తి చేయవచ్చు. లేదా సమాజానికి మరొక విధంగా ఉపయోగించవచ్చు. విద్యార్థియొక్క, సమాజంయొక్క అవసరాలకు సంబంధించిన పని విద్యార్థికి ఆసక్తికరంగా వుంటుంది. పని యాంత్రికంగా జరిగిపోకూడదు. దాని ప్రణాళిక పని విభజన ఫలితాలను మధ్య మధ్యలో అంచనా వేసుకోవాలి. అప్పుడే ఆ పని విద్యా విషయమవుతుంది. అధునాతన పరికరాలు సాంకేతిక పరిజ్ఞానం అవసరమయ్యే సందర్భాలలో సమాజ పురోభివృద్ధికి విజ్ఞానశాస్త్ర సాంకేతిక శాస్త్రాల ఆవశ్యకత విద్యార్థికి అర్థమవుతుంది.

విద్యలో, పని-అనుభవాలను ప్రవేశపెట్టాలని కొఠారి కమీషన్ సిఫార్సు చేసింది. అంటే విద్యను ఉత్పత్తికి అనుసంధానం చేయడమే ఈ కార్యక్రమాలను సమాజానికి ఉపయోగపడే పనితో జోడించక పోవడమేగాక ఇతర సబ్జక్టులతోకూడా సమన్వయం కుదర్చలేదు.

ఒక ప్రత్యేక పని విభాగాన్ని సామాజిక ఉత్పత్తి పనిగా స్పష్టంగా నిర్దేశించడం వలన పనికి, విద్యకు అవినాభావ సంబంధమేర్పడుతుంది. ఇది గాంధిగారి బేసిక్ ఎడ్యుకేషన్ ఆధారంగా అభివృద్ధి పరచాలి.

## ఉద్దేశ్యము

ఇవి విద్యార్థులను పాఠశాలలో, పాఠశాల వెలుపల సామాజిక, ఆర్థిక కార్యకలాపాలలో పాల్గొనేటట్లు చేస్తుంది. వివిధ రకములైన పనులలో మిళితమైయున్న విజ్ఞానశాస్త్ర సూత్రాలు, విధానాలు విద్యార్థుల కవగతమవుతాయి. విద్యార్థులు భౌతిక సామాజిక పరిసరాలనర్థం చేసికొంటారు.

## కార్యకలాపాల నెన్నుకొనుట

పని నెన్నుకొనటంలో మెలకువలు చూపించాలి. అది ఉత్పత్తిని సాధించేది. విజ్ఞానాన్నిచ్చేది: సమాజానికి ఉపయోగపడేదిగా వుండాలి. సామాజిక ఉత్పత్తిని సాధించే పనికి ప్రాధాన్యతనీయడం వలన పనికి విజ్ఞానానికి యిప్పుడుండే అగాధాన్ని పూడ్చినట్లవుతుంది. ఇప్పటివలె పాఠశాల సమాజంతో విడివడి వుండదు. కలవారికి, బలహీన వర్గాలకు మధ్యన వుండే అగాధానికి కూడా వంతెన కట్టినట్లవుతుంది. అలాంటి పథకం కులము, తెగ, స్త్రీ, పురుష, ఆర్థికవిభేధాలను అధిగమించి, అందరికీ, పనిచేస్తూ విజ్ఞానార్జించడానికి సమానావకాశాలను కల్పిస్తుంది.

ప్రస్తుతం విద్యకొరకు పల్లెలు వదలి పట్టణాలకు తరలి వస్తున్నారు. పల్లెలకు పట్టణాలకుమధ్య అగాధాలు ఏర్పడుతున్నాయి. ఈ విధమైన విద్య నిరుద్యోగాన్ని పెంచుతుంది. జాతీయాదాయం విద్యాభివృద్ధికి ఖర్చు పెట్టబడుతున్నది. ఆ చరణలో నిరుద్యోగుల సంఖ్య పెరుగుతున్నది. ఫలితంగా జాతీయాదాయం వృధా అవుతున్నది.

## సంఘసేవ

సంఘసేవ సమాజానికి ఉపయోగపడేదిగా వుండాలి. ఉదాహరణకు విద్యార్థులు పరిసరాలను శుభ్రంచేసే కార్యక్రమం తీసికొన్నారనుకోండి దానిలో భాగంగానే వారు కంపోస్టుఎరువుల కొరకు గోతులు తీయాలి. అదే విధంగా విద్యార్థులు జనాభా లెక్కల సేకరణ, యిళ్ళ సంఖ్య, పశువుల సంఖ్యలకు సంబంధించి కార్యక్రమం తీసికొన్నారనుకోండి. అదే సమాచారం శిశు సంక్షేమం, పరిసరాల పరిశుభ్రత పథకాలకు వినియోగించుకొనవచ్చు. అలాగే నూర్పిళ్ళ సమయంలో గ్రామంలోని వారంతా పనితో తీరిక లేకుండా వుంటారు. పాఠశాలలు గ్రామాలకు అతీతంగావుండక విద్యార్థులు తమ విలువైన సహాయాన్ని గ్రామస్థులకు అందజేయవచ్చు.

## ఇతర సంస్థలకు సహాయం చేయుట-స్వీకరించుట

సామాజిక ఉత్పత్తిని పెంచే పని పాఠశాల నాలుగు గోడలకు పరిమితమై యుండనవసరం లేదు. ఉపాధ్యాయుడు మాత్రమే ఈ కార్యకలాపాలను రూపొందించాలని లేదు. స్థానిక సంఘం, సామాజికాభివృద్ధి సంస్థలు పాఠశాలలకు కార్యక్రమాలను రూపొందించడంలో సహాయపడవచ్చు. ఉదాహరణకు పంచాయితీ సహాయ సహకారాలు లేనిదే పాఠశాల పరిసరాలను శుభ్రంచేసే కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించలేదు. ఖాదీ గ్రామ పరిశ్రమల కమీషన్, అఖిల భారత చేతిపనులు బోర్డు, హరిజనోద్ధరణ సంఘం యింకా యిలాంటి ప్రభుత్వ ప్రైవేటు సంస్థలు సమాజానికి విలువైన సహాయాన్ని అందజేశాయి. అలాంటి కార్యక్రమాలలో విద్యార్థులకు అవకాశం కల్పిస్తే వారు పెద్దలకు సహాయం చేస్తున్నామనే భావంలో వారి ఆత్మ విశ్వాసం పెరుగుతుంది.

## వికేంద్రీకరణ

సామాజిక ఉత్పత్తి పనిని వీలైనంత ఎక్కువగా వికేంద్రీకరణ చేయాలి. జాతీయ రాష్ట్ర సంస్థలు నమూనా అభివృద్ధి పథకాలను తయారు చేయాలి. వివిధ శాఖలకు సంస్థలకు చెందిన వారితో జిల్లా, తాలూకా, గ్రామస్థాయి కమిటీలకు ఏర్పాటు చేయవలసి వుంటుంది. ఆయా కమిటీలు పాఠశాల కవసరమైన ప్రణాళిక, పథకాలను ముందుగా రూపొందించాలి. ఈ పథకాలను మాటిమాటికి పునః పరిశీలన చేయవలసి వుంటుంది. పథకాలకవసరమైన ముడి సరుకును సరఫరా చేయడానికి, ఉత్పత్తి యైన వస్తువుల యొక్క మార్కెటు సౌకర్యాలకుగల అవకాశాలను పరిశీలించవలసి వుంటుంది.

## సామూహిక కృషి

అవసరాలు, లభ్యమయ్యే వనరులనుబట్టి సామాజిక ఉత్పత్తి పని పాఠశాలకు మారుతుంది. అయినప్పటికీ కొన్ని సామాన్య లక్షణాలుండే విధంగా కార్యక్రమాలను రూపొందించాలి. ఈపథకాల సామాన్య లక్షణం అన్ని పాఠశాలలలోని అందరు విద్యార్థులు సంవత్సరమంతా పాల్గొనేటట్లు చేయడం.

ఉత్పత్తి పనికి సాధ్యమైనంతవరకు ప్రతిఫలము వుండేటట్లు చూడాలి. ఇది విద్యార్థులలో ఆత్మ విశ్వాసాన్ని పెంచుతుంది.

## ii లక్ష్యాలు

1. విద్యార్థులను వ్యక్తిగతంగా, సామూహికంగా శారీరక శ్రమచేయడానికి సన్నద్ధులను చేయుట.

2. విద్యార్థులకు శ్రామిక ప్రపంచంతో సంబంధాలు నెలకొల్పి వారికి శ్రమజీవుల పై గౌరవాన్ని పెంచుట.

3. విద్యార్థులను సమాజానికి ఉపయోగపడే పౌరులుగా తీర్చి దిద్ది, వారి శక్తిసామర్థ్యాలు సమాజాభివృద్ధికి వినియోగించాలనే ఆకాంక్షను పెంచుట.

4. విద్యార్థులలో ఆత్మవిశ్వాసం, శ్రమశక్తియెడల గౌరవ భావం, సహనం, సహకారం, సానుభూతి, సహాయపడే స్వభావం పెంచుట.

5. వివిధరకము లైన పనులలోని సూత్రాలను గ్రహించుట.

6. వివిధ దశలలో నేర్చిన పనుల మూలంగా పాఠశాల వదలి సమాజంలోనికి వెళ్ళేటప్పటికి తన కాళ్ళపై తాను నిలబడగలిగేటట్లు చేయుట.

## ప్రణాళిక

## సమస్య-పరిష్కార దృక్పథం

విద్యార్థులకు ఎదురయ్యే సమస్యలను చర్చించి వాటికి పరిష్కార మార్గాలు చర్చల ద్వారా పరిష్కరించుకొనే సామర్థ్యాన్ని పెంపొందించాలి.వారుచేయుపనికి కావలసిన ముడిసరుకులు,పరికరాలు, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి వారు సమస్యలను పరిష్కరించడానికి తోడ్పడుతూ, వారి అభివృద్ధిని అంచనా వేయాలి.ఈ రిపోర్టులో సిఫార్సు చేసిన విధంగా సామాజిక ఉత్పత్తిని సాధించే పనికి పదవ తరగతి చివరి పరీక్షలో కూడ మిగిలిన సబ్జక్టుకు యిచ్చే స్థాయిని యివ్వాలి.

## బోధన-అధ్యయనం: మూడు అంచెలు

విద్యార్థులు పరిసరాలను చాల జాగ్రత్తగా పరిశీలిస్తుంటారు. విద్యార్థులు పరిశీలన ద్వారా, కొన్ని ప్రశ్నలు అడగడంద్వారా, యితరులు పనిముట్లతో చేసే పనిని అనుకరించడం ద్వారా పనిచేయడం నేర్చుకుంటారు. కలిసి సమష్టిగా పనిచేయడం, పెద్దలు వారి పనిలో తోడ్పడం. వారికి ఆనందాన్నిస్తుంది. కాబట్టి సమాజానికి ఉపయోగపడే ఉత్పత్తి పనిలో బోధన అధ్యయన విధానంలో మూడు అంచెలుంటాయి.

1) పరిశీలన ద్వారా శ్రామిక ప్రపంచాన్ని అధ్యయనం చేసి కొనడం.

2) ముడిసరుకు, పనిముట్లతో సాంకేతిక పరిజ్ఞానం ద్వారా ప్రయోగాలు చేయడం.

3) పని అనుభవాలు.

## పని ఆరు విభాగాలు

ఉత్పత్తిని సాధించే శారీరక శ్రమ స్థితిగతులలో ఆరు అంశాలుంటాయి.

1) ఆరోగ్యం 2) ఆహారం 3) తలదాచు కొనడానికి చోటు 4) దుస్తులు 5) సాంస్కృతిక వినోద కార్యక్రమాలు. 6) సామాజికమైన పని లేక సంఘసేవ.

ఇంట్లో, బడిలో, సమాజంలో పనిచేయవలసిన అవసరాలు ఏర్పడుతుంటాయి. సామూహికంగాను ఒంటరిగాను పని చేయడం జరుగుతుంది. సామూహికంగా చేసే పనికి ఒంటరిగా చేసే పని విద్యార్థిని సన్నద్ధం చేస్తుంది.

పనికి ప్రతిఫలం వుండడం అవసరం. పనికి ప్రతిఫలం పొందడం ద్వారా స్వశక్తిపై విశ్వాసం పెరుగుతుంది.

## తరగతులు-కార్యక్రమాలు

III నుండి VII/VIII తరగతుల వరకు విద్యార్థులందరిలో సామాన్యంగా ఒకే రకమైన పని చేయవచ్చు. VIII, IX, X తరగతుల విద్యార్థులు వారు చేయగోరే పనులను ఒకటి ప్రధానమైనదిగా రెండవది అనుసంధానంగా ఎన్నుకొనే అవకాశము కల్పించాలి.

సమాజానికి ఉపయోగపడే ఉత్పత్తిని సాధించే పని ప్రణాళికల సారాంశం.

a) I, II తరగతులు;- ఇంట్లో, పాఠశాలలో, సమాజంలో

జరిగే పనులలో పరికరాలనందిస్తూ సహాయపడుట చిన్న పరికరాలతో చిన్న పనులు సృజనాత్మకంగా కూడా చేయవచ్చు.

b) III-VII/VIII తరగతులు: పైన చెప్పబడిన ఆరు విభాగాలకు చెందిన పనులు అందరిచే చేయించుట.

1) ఆరోగ్యం – పరిసరాలు : ఫర్నిచరుకు పట్టిన దుమ్ము దులుపుట, తరగతి గదులను, పాఠశాల పరిసరాలను పరిశుభ్రం చేయుట.

2) ఆహారం.: కూరగాయల పెంపకం, కుండీలలో మొక్కలను పెంచుట, వంట చేయుట.

3) తలదాచుకొనేందుకు నీడ : ప్లాస్టిక్, చెక్క, ఇతర పదార్థాలలో యింటి పై కప్పులకు ఉపయోగపడే సామాగ్రిని చేయుట.

4) బట్టలు : వడకుట, దారం తీయుట, కుట్టుట, బట్టలు ఉతుకుట, చిరిగిపోయిన బట్టలు కుట్టుట.

5) సాంస్కృతిక వినోద కార్యక్రమాలు : తరగతి గదిని, పాఠశాలను, ఇంటిని అలంకరించుట, పూల మొక్కలను పెంచుట, ముఖ్యమైన జాతీయ పండుగల సందర్భంగా జండా వందనం లాంటి పనులకు తగిన సన్నాహాలు చేయుట పండుగలలో పాల్గొనుట.

VI) సామాజిక కార్యకలాపాలు, సంఘసేవ, పరిసరాలను శుభ్రం చేయుట, కంపోస్టు ఎరువుల తయారీకి గుంటలు త్రవ్వుట, నీడనిచ్చు చెట్లు నాటుట, సహకార విక్రయాలను నడుపుట ఉత్పత్తి రంగంలో పెద్దలకు సహాయపడుట.

V/VI నుండి VII VIII తరగతుల విద్యార్థులు క్రింది తరగతులు విద్యార్థులకు చెప్పబడిన పనులనే నిర్వహించాలి. కాని వాటి పని స్వభావం స్వరూపం కాస్త పెద్దదై యుండాలి. ఈ దిగువ నిచ్చిన ప్రాజెక్టులలో కనీసం రెంటిని ఎన్నుకొనవలసి వుంటుంది.

1) ఆరోగ్యం, పరిసరాలు : పళ్ళపొడి, సబ్బులు, బట్టలుతికే సబ్బు, తలనూనె, చీపుర్లు, చెత్తకుండీలు, కంపోస్టు ఎరువు ప్రథమ చికిత్సకు అవసరమైన పెట్టెలు, ఆరోగ్యం పరిసరాలకు సంబంధించిన చిన్న పుస్తకములు,ఆరోగ్య పరిరక్షణ పరిసరాలు పరిశుభ్రంగా వుంచుకొనుటను ప్రచారం చేయుట, ఆరోగ్య కేంద్రాలలో పని చేయుట.

ఆహారం : కూరగాయలను పెంచుట,పూలమొక్కలను కుండీలలో పెంచుట, మొక్కలను సంపాదించుట, భూసారాన్ని పరీక్షించుట, పలురకములైన మొక్కలతో పలురకములైన ఎరువులతో ప్రయోగాలు చేయుట,విత్తనములద్వారా, కొమ్మలను నాటడంద్వారా వృక్ష సంతతిని వ్యాప్తి చేయుట భూసారాన్ని పరిరక్షించుట.

పండ్ల రసాలతో పాకములు ఊరగాయ పచ్చళ్ళు, బేకరీలలో ఉపయోగించు పదార్థములు చేయుట, కాంటీన్‌లలో చిన్న చిన్న షాపులలో నిర్ణయించిన కాలం పనిచేయుట ఆహార పదార్థములను పొందికగా కట్టుట, భద్ర పరచుట.

3. నీడ : ఇంటి పై కప్పులకు ఉపయోగపడే సామగ్రిని చేయుట, గోడలకు సున్నం కొట్టుట, తలుపులు, కిటికీలు, కుర్చీలకు పాలిష్ పట్టుట ఫర్నిచర్ రిపేరు చేయుట.

4. బట్టలు తయారు చేయుట : వడకుట, పాఠశాల సంచులను కుట్టుట, స్కూలు యూనిఫారములు కుట్టుట, చేతి రుమాళ్ళు, టేబుల్‌క్లాత్, దిండు గలీబులు కుట్టుట, చాపలు తయారుచేయుట.

5. సాంస్కృతిక, వినోద కార్యక్రమాలు– బొమ్మలను, కృత్రిమ పుష్పాలను, గ్రీటింగ్ కార్డులు, ఆటలకు పనికివచ్చే పరికరాలు. పుస్తకాలకు అందమైన అట్టలు తయారీ, పుస్తకాలు బైండింగ్.

5. సంఘ సేవ : పెద్దలు చేసే పనులకు సహాయకారులుగా వుండుట, జబ్బుగా వున్నవారికి ప్రథమ చికిత్స చేయుట, పండుగల సందర్భంగా వలంటీర్లుగా, సాంస్కృతిక ప్రచారాలకు తోడ్పడుట.

C) VIII, IX, X పని చేయడానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చుట, పెద్దపనులు అప్పగించుట.

## ముఖ్యమైన వృత్తి పనులు

1. ఆరోగ్యం పరిసరాల పరిశుభ్రత : వైద్యశాస్త్రానికి అవసరమైన మొక్కలను పెంచుట, అంటువ్యాధి నిర్మూలన, రోగులకు సేవ చేయుట.

2. ఆహారం–వ్యవసాయ పరిశ్రమలు : పెరటితోటల పెంపకం సస్య సంరక్షణ, వ్యవసాయ పరికరాల రిపేరు, భూసారాన్ని పరిరక్షించుట. పశువుల పెంపకం, పాడి పరిశ్రమ, కోళ్ళ పెంపకం, చేపల పెంపకం, తేనెటీగల పెంపకం, వంటచేయుట.

3. Shelter Poultry : బేలుదారిపని, మెకానికల్ – ఎలక్ట్రికల్ వర్కుషాపులలో పని చేయుట, ఇళ్ళు కట్టుట, వడ్రంగి పని చేయుట.

4. బట్టలు నేయుట : ప్రత్తి నుత్పత్తి చేయుట, సిల్కు దారము తీయుట, వడుకుట, బట్టలు తయారీ మేజోళ్ళ తయారీ,అల్లికపని, డ్రెస్ డిజైనులు తయారు చేయుట.

5. సాంస్కృతిక వినోద కార్యక్రమాలు : ఆట వస్తువులను తయారు చేయుట, సంగీతం పరికరాలను తయారుచేయుట, రిపేరు చేయుట కాగితముల తయారీ, ఫొటోగ్రఫీ.

## సహాయక వృత్తి పనులు

1) ఆరోగ్యం, పారిశుధ్యపు [illegible]లు : పరిసరాల పరిశుభ్రత, బావులను, చెరువులను పరిశుభ్రంగా వుంచుట, మురుగును ఆవలికి పంపుట, మురుగు దొడ్ల నిర్మాణం, కంపోస్టు ఎరువులకు గుంటలు త్రవ్వుట, పళ్ళపొడి, బట్టలు ఉతుకు సబ్బు, క్రిమిసంహారక మందుల ప్రథమ చికిత్సకు ఉపయోగపడే పెట్టెల, చెత్త కుండీల మురికిని లాగివేయుటకు ఉపయోగించే పనిముట్లు చీపుర్లు, బ్రష్‌లు, దుమ్ము దులిపే పరికరాలు వగైరాల తయారు చేయుట, కత్తీలను పట్టి వేయుట.

2. ఆహారం:– పొలానికి ఉపయోగపడే ఎరువులు, క్రిమిసంహారకమందుల పంపిణీ చేయుట, ఆహార పదార్థాలు చెడిపోకుండా నిల్వచేయుట ఖండసారీ చక్కెర తయారుచేయుట, పండ్లరసాలు, ఊరగాయ పచ్చళ్ళు, అప్పడాలు చేయుట.

3. నీడ:– ఇళ్ళు, గ్రామం, పట్టణాల ప్లానింగ్ లక్క ఉత్పత్తి చేయుట, ఇళ్ల ఫర్నిచర్ ఇంటి పనిముట్ల రిపేరుచేయుట, సున్నపురాయి, సీమసద్దముక్కలను, క్రొవ్వొత్తుల తయారీ.

4. బట్టలు:– పలురకాలైన దారాలను వడుకుట, బట్టలను రిపేరుచేయుట, బట్టలను నవీన పద్ధతులద్వారా ఉతుకుట.

5. వినోద సాంస్కృతిక కార్యక్రమాలు:– స్టేజి అలంకరణ' మేకప్ సామాగ్రిని తయారుచేయుట, ప్రదర్శన శాలల నిర్వహణం·

## IV ఉపాధ్యాయులు

సమాజానికి ఉపయోగపడే ఉత్పత్తి కార్యక్రమాన్ని సక్రమంగా అమలు జరపాలంటే నిపుణులైన ఉపాధ్యాయులు కావాలి. పాఠశాల పథకంలో దీనికి సరియైన స్థానం కల్పించడానికి ఈ క్రింది సిఫార్సులు చేయబడ్డాయి.

1) సమాజానికి ఉపయోగపడే ఉత్పత్తి కార్యక్రమాన్ని నిర్వహించే ఉపాధ్యాయుల స్థాయి ఇతర ఉపాధ్యాయుల స్థాయితో సమానంగా వుండాలి.

2) నిపుణులైన పనివారి సేవలను వినియోగించుకొనడానికి వారికి పార్ట్‌టైం పనిచేయడానికి అవకాశం కల్పించాలి.

3) ఈ కార్యక్రమానికి సంబంధించిన పథకాలు రూపొందించడానికి విద్యాశాఖలో, పరిశ్రమశాఖలో దీనికిసంబంధించిన విభాగాలు ఏర్పాటు చేయాలి.

4) ఈ కార్యక్రమానికి సంబంధించిన కోర్సులను అభివృద్ధి పరచి ఉపాధ్యాయ శిక్షణా కేంద్రాలలో శిక్షణ స్థాయి పెంచాలి.

### కమిటీలు

కేంద్ర, రాష్ట్రస్థాయిలో ఉన్నతస్థాయి కమిటీలను నియమించి ఆయా కమిటీల నిర్ణయాలు తప్పనిసరిగా అమలు జరిగేటట్లుచూడాలి. ఆయా కమిటీలు అప్పుడప్పుడు సమావేశమవుతూ సాధించిన అభివృద్ధిని సమీక్షించడమే గాక ఈ కార్యక్రమాల అమలు జరపడానికి గల ఆటంకాలను తొలగించేటట్లు చూడాలి.

### త్రిభాషా సూత్రము

1964-65 విద్యాకమీషన్ సిఫార్సులు క్రింద పొందుపరచబడ్డాయి.

కొద్ది మార్పులతో ఈ సూత్రాన్ని మేము సిఫార్సుచేస్తున్నాం.

1. మాతృభాష లేక ప్రాంతీయ భాష.
2. కేంద్ర ప్రభుత్వపు అధికార భాష.
3. అధునాతనమైన భారతీయ భాష (బోధనా భాష కాకుండా మరొకటై యుండాలి.)

### సవరింపబడిన భాషా సూత్ర ఫలితాలు

ప్రాథమిక విద్యాస్థాయిలో మాతృభాషలోగాని ప్రాంతీయ భాషలోగాని (విద్యార్థి యిష్టాన్ననుసరించి) విద్యాబోధన జరగాలి. చాలామందికి ప్రాంతీయ భాష, మాతృభాష ఒకటే అయివుంటుంది. భాషాపరంగా మైనారిటీ వర్గానికి చెందినవారుకూడ ప్రాంతీయభాషలో విద్యార్జన చేయవచ్చు. కాని ప్రాంతీయ భాషలోనే వారు విద్యార్జన చేయవలసి వుంటుందని నిర్బంధ పెట్టకూడదు. వారి మాతృభాషలో విద్య నేర్చుకునే హక్కు రాజ్యాంగబద్ధంగా వారికి వుంది. అలాంటి వారు (మైనారిటీ భాషకు చెందినవారు) తరగతికి కనీసం 10 మంది పాఠశాలలో 40 మంది వుండాలని విద్యామంత్రుల సదస్సు 1969లో నిర్ణయం తీసుకుంది. వారికికూడ మూడవ తరగతి తరువాత వారు కోరుకున్న భాషలో విద్యాబోధన జరుగుతుంది. ఈ స్థాయిలో భాషాపరంగా మైనారిటీ వర్గానికి చెందినవారికి ఇప్పుడు కొన్నిరాష్ట్రాలలో అమలులో వున్న విధంగా ప్రాంతీయ భాష నిర్బంధం చేయడానికి మేము సుముఖంగాలేము. ఈ స్థాయిలో ఇంగ్లీషును రెండవ భాషగా బోధించేందుకుకూడ సుముఖంగా లేము.

ప్రాథమిక పాఠశాలలలోని పై తరగతిలో రెండుభాషలు నిర్బంధంగా బోధింపడాలి. 1) మాతృభాష లేక ప్రాంతీయ భాష 2) అధికారభాష లేక అనుసంధాన భాష హిందీ ప్రాంతాలలోనున్న వారందరికీ, హిందీయేతర భాషా ప్రాంతాలలోని ఎక్కువమందికి సాధారణంగా ఇంగ్లీషు రెండవ భాషగా వుంటుంది. హిందీయేతర ప్రాంతాలలోని విద్యార్థులలో ఎక్కువ శాతం కూడ హిందీని కోరవచ్చు. వీటికితోడు వారి యిష్టప్రకారం మరొకభాషను నేర్చుకొనవలసి వుంటుంది. మాతృభాష హిందీ కాకుండ హిందీ ప్రాంతాలలో నివసించేవారూ, హిందీ యితర ప్రాంతాలలోని విద్యార్థులు కావాలంటే రెండవ భాషగా ఇంగ్లీషును నేర్చుకొనవచ్చు.

8, 9, 10 తరగతులలో మూడుభాషలు నిర్బంధంగా నేర్చుకోవాలి. హిందీ ప్రాంతాలలోని విద్యార్థులకు సాధారణంగా హిందీ, ఇంగ్లీషు, భారతీయ భాషలలో ఒకటి. హిందీయేతర ప్రాంతాల అత్యధికులు ప్రాంతీయ భాష, ఇంగ్లీషు, హిందీ నేర్చుకుంటారు.

రాష్ట్రాల సరిహద్దులో నున్న గ్రామాలలోని విద్యార్థులకు పొరుగు రాష్ట్రంలోని భాష మూడవ భాషగా అధ్యయనం చేయవచ్చు.

ఈ స్థాయిలో లైబ్రరీ భాషగా అభివృద్ధి చెందిన ఇంగ్లీషును విద్యార్థి నేర్చుకోవాలి. ఐనప్పటికి లైబ్రరీ భాషలుగా పరిణతి చెందిన రష్యన్, జర్మన్, ఫ్రెంచ్, స్పానిష్, చైనీస్ భాషలకు అధ్యయనం చేయడాన్ని ప్రోత్సహించడం అవసరమని మేం అభిప్రాయపడుతున్నాం. ప్రతి రాష్ట్రంలోని కొన్ని పాఠశాలలో యితర విదేశీ భాషల అధ్యయనానికి అవకాశాలు కల్పించి విద్యార్థి అభిరుచిననుసరించి అదనంగా గాని లేక ఇంగ్లీషు హిందీలకు బదులుగాగాని నేర్చుకొనడాన్ని ప్రోత్సహించాలి. అలాగే హిందీయేతర రాష్ట్రాలలో పైన చెప్పబడిన భాషాబోధల కవకాశాలు కల్పించి అదనంగా గాని హిందీ ఇంగ్లీషుకు మారుగాని ఆయా భాషల అధ్యయనాన్ని ప్రోత్సహించాలి.

హయ్యర్ సెకండరీ స్థాయిలో అనగా విద్యార్థి ఉన్నత విద్యకు సన్నద్ధ మవుతున్న విద్యార్థి రెండు భాషలు అధ్యయనం చేయాలి. ఇంతకుముందు అతడు చదివిన మూడు భాషలలో ఏ రెండైనా గాని లేక క్రింద చెప్పబడిన మూటిలో ఏ రెండయినా గాని, అధ్యయనం చేయాలి. 1) అధునాతనమైన భారతీయ భాషలు 2) ఆధునిక విదేశీ భాషలు 3) సాంప్రదాయ బద్ధమైన భాషలు. (స్వదేశీ, విదేశీ) విద్యార్థి ఆసక్తి కొలదీ అదనంగా నేర్చుకొనడాన్ని అభ్యంతరపెట్టకూడదు.

### సాంప్రదాయబద్ధమైన భాషల అధ్యయనం

సాంప్రదాయ బద్ధమైన భాషల స్థానం, భారతీయ భాషలలో సంస్కృత భాషకున్న అగ్రస్థానం విస్మరించరానిది. కాని త్రిభాషా సూత్రంలో సంస్కృతాన్ని గాని యితర సాంప్రదాయ బద్ధమైన భాషనుగాని చేయడానికి వ్యతిరేకులం.

ఈ సూత్రం ఆధునాతన భారతీయ భాషలకు పరిమితమైనదిగా భావిస్తున్నాం. మాతృభాష, సంస్కృతాన్ని కలిపి ప్రవేశపెట్టడం పోత్సహించదగింది. కాని యిది ఎక్కువమందికి ఆమోదయోగ్యమయింది కాదు. సాంప్రదాయక భాషాబోధన విద్యార్థి లభ

రుచిపై మాత్రమే జరగాలి. ఇది 8వ తరగతి స్థాయిలో విద్యార్థికి అవకాశం కల్పించవచ్చు.

### ఫలితం

విద్యలోని కొన్ని అంశాలకు ప్రాధాన్యతను పెంచడం వలన 10 సం॥ల పాఠశాల విద్య సమగ్రమైనదిగా రూపొందుతుంది.

**Realism and Flexibility**

10 సం॥ల పాఠశాల విద్యను సంస్కరించడానికి (Reappraising) నా సవ దృక్పథాన్ని అవలంబించాం గనుక కొన్ని మార్పులు (Flexibility) చేయవలసివుంటుంది.

స్థానికావసరాలకు, లభ్యమయ్యే వనరులు అవకాశాలను విద్యార్థుల స్థితిగతులు, శక్తిసామర్థ్యాలను పరిగణనలోకి తీసికొన కుండ విద్యాలక్ష్యాలలో, విద్యావిషయాలలో చేసే మార్పులు సత్ఫలితాలనివ్వవు.

విద్యార్థి కేవలం తరగతి గదినుండే అన్ని నేర్చుకొనలేడు. ఈ విషయాలను పరిగణనలోకి తీసికొని విద్యాపథకాలను రూపొందించాలి. అందుకని మూసపోసినట్లు రూపొందించే విద్యా కార్యక్రమాలు వాంఛనీయాలుకావు.

స్థానికావసరాలను, మైనారిటీవర్గం అవసరాలను, షెడ్యూల్డు కులాల తెగల అవసరాలను పరిగణనలోకి తీసికొని స్థానికసంస్థలతో సంప్రదించి రాష్ట్ర ప్రభుత్వం, పరీక్షాబోర్డులు విద్యా పథకాలను తయారుచేసి కొనవలసి యుంటుంది.

## విద్యాపథకంలోని ముఖ్యమైన విభాగాలు

మేము సిఫార్సు చేసిన పథకంలో సామాజికశాస్త్రం, విజ్ఞాన శాస్త్రం, సమాజానికి ఉపకరించే నిర్మాణాత్మకమైన పని అనే విభాగాలు ఉన్నాయి. పది సంవత్సరాల పాఠశాల విద్య యొక్క మూడు స్థాయిలలో ఆయా విభాగాలకు తగు ప్రాధాన్యత నివ్వబడింది. సామాజికావసరాలతో సంబంధంలేని పుస్తకాల చదువుకు ప్రాధాన్యత కొంత తగ్గించబడింది.

### సమాజానికవసరమైన ఉత్పత్తిపని మరియు సంఘసేవ

సమాజానికి అవసరమైన ఉత్పత్తి నిచ్చే పని విద్యావిధానానికి నిర్దిష్టమైన (లక్ష్యాన్నిస్తుంది) కాబట్టి ఉత్పత్తిని సాధించే పనికి పాఠశాల విద్యలో అత్యంత ప్రముఖస్థానం కల్పించడం అత్యవసరంగా భావిస్తున్నాం. ఇది గాంధేయ సిద్ధాంతానికి చాలా సన్నిహితంగా వుంటుంది. శారీరశ్రమ ద్వారా సమాజానికవసరమయ్యే ఉత్పత్తి పనికి ఈ క్రింది విధంగా టైంను కేటాయించవలసి వుంటుంది.

1) 4, 5 తరగతులకు విద్యాకాలంలో 20%.

2) 5/6 నుండి 7/8 తరగతులకు వారానికి గల 32 పని గంటలలో 6 గంటలు.

3) 8, 9, 10 తరగతులకు వారానికి గల 32 పనిగంటలలో 6 గంటలు.

స్థానిక అవసరాలను బట్టి ఈ పథకంలో మార్పులు చేసికొన వచ్చునని ఇంతకు ముందు సూచించాం. ఈ మార్పులు పనిగంటలను తగ్గించడానికి సంబంధించినవై యుండకూడదు.

### సామాజిక అవసరాలకు ఉత్పత్తిని సాధించే పనికి సబ్జక్టు స్థాయి

సమాజ అవసరాలకు ఉత్పత్తిని సాధించే పనికి ఇతర సబ్జక్టుల స్థాయి కల్పించబడాలి. పదవ తరగతి చివరజరిగే పరీక్షలలో ఇది ఒక సబ్జక్టుగా వుండాలి. సంవత్సరమంతా జరిగిన పనికి కొన్ని మార్కులు, చివరి పరీక్షకు కొన్ని మార్కులు కేటాయించబడాలి.

# 1-5 తరగతులు

## 1) పనిగంటలు

1 నుండి 5 తరగతుల వరకుగల విద్యార్థులకు బోధనా కాలం తగ్గించాలి. వారుసృజనాత్మకమైన కార్యకలాపాలలోపాల్గొంటూ ఉల్లాసంగా కాలం గడపాలి. కాబట్టి వారికి బోధనా సమయం 2½ నుండి 3 గంటలకు మించకూడదని అభిప్రాయపడుతున్నారు.

పనిగంటలు తగ్గించడంవలన మరొక ప్రయోజనం వుంది. మిగిలిన సమయంలో ఉపాధ్యాయుడు చదువు మధ్యలో మానుకొని మరలా చదవాలనే ఆసక్తిగల విద్యార్థులకు బోధించవచ్చు. ఒకే ఉపాధ్యాయుడున్న పాఠశాలలో షిఫ్టు పద్ధతిని ప్రవేశపెట్టి బోధన మరికొంత ప్రయోజనాన్ని చేకూర్చేటట్లు చేయవచ్చు. వయోజన విద్యా కార్యక్రమాలు చేపట్టవచ్చు.

చాలా యితర దేశాలలోవలెనే తోటపని, వంటచేయడం, వ్యాయామ విద్యలను బోధించడానికి సమాజంలోని యితరుల సహాయం పొందవచ్చు.

## 2) నిర్దిష్టమైన టైమ్‌టేబులు లేదు

ప్రాథమికస్థాయి విద్యాబోధనకు మొత్తం పని గంటలలో దీనికింత శాతం అని కేటాయించడం జరిగింది. ప్రత్యేకించి టైమ్‌టేబుల్ అవసరం లేదని అభిప్రాయపడుతున్నాం.

## 3) పాఠ్యపుస్తకాలు

మన విద్యావిధానంలో పుస్తకాలకత్యంత ప్రాధాన్యత వుందని యింతకు ముందు చెప్పాం. మనం ముఖ్యంగా పట్టణాలలో విద్యార్థులు మోయజాలని పాఠ్యపుస్తకాలు బరువులో కృంగిపోతూ వుండడం అనునిత్యం చూస్తూవున్నాం.

ఒకటి రెండు తరగతుల విద్యార్థులకు భాషాపరమైన పాఠ్య పుస్తకమొక్కటితప్ప యితర పుస్తకాలేమీ అవసరం లేదని అభిప్రాయ పడుతున్నాం. 3 నుండి 5 తరగతుల విద్యార్థులకు భాషా పరమైన పాఠ్యపుస్తకం గణిత పాఠ్యపుస్తకం, పరిసర విజ్ఞాన పాఠ్యపుస్తకం, మొత్తం 3 పాఠ్యపుస్తకాలు మాత్రం అవసరం.

## 4) ఉపాధ్యాయులకు పుస్తకాలు, బోధనోపకరణములు

బోధన క్రమపద్ధతులలో జరిగేందుకు ఉపాధ్యాయులకు పుస్తకాలు, బోధనోపకరణాలు సమకూర్చాలి. సంగీతం, నాట్యం, నాటక కళలు, వ్యాయామ క్రీడలకు సంబంధించిన ఉపాధ్యాయులకు ప్రత్యేక శిక్షణ అవసరం. ప్రాథమిక స్థాయిలో వ్యాయామం పూర్తిగా నిర్లక్ష్యం చేయబడుతున్నది.

## V) 1-5 తరగతుల విద్యార్థులకు ఇంటిపని (Home work) లేదు

ప్రస్తుతం విద్యార్థులు పాఠశాలలో 4,5 గంటలు పుస్తకాలతో కుస్తీ పడుతున్నారు. ఈ విధంగా పాఠశాల, ఇంటి నాలుగుగోడల మధ్య రోజులో ఎక్కువభాగం బందీ అవుతున్నారు, ఈ విధంగా విద్యార్థులలో ఎక్కువమంది జీవితంలో ఉల్లాసం కలిగించే కార్య కలాపాలలో పాల్గొనలేక పోతున్నారు. పిల్లలకు ఇంటిపని యిచ్చే పద్ధతిని వ్యతిరేకిస్తూ ఇంటిపని ఇవ్వకూడదని సిఫార్సు చేస్తున్నాం. మేము సూచించిన విధానంలో విద్యార్థి తనంతట తాను చదివి అరం చేసికొనవలసిన అంశాలుంటే అదికూడ పాఠశాల పని వేళల లోనే ఉపాధ్యాయుని పర్యవేక్షణలోనే జరగాలి.

## 6) నిర్దిష్టమైన విద్యా సంవత్సరం అవసరంలేదు

ప్రాథమిక పాఠశాలలో 80% గ్రామీణ ప్రాంతాలలోనే వున్నవి గనుక నిర్దిష్టమైన విద్యాసంవత్సరాన్ని నిర్ణయించనవసరం లేదు. పాఠశాల స్థానిక అవసరాలను బట్టి నడుస్తుంది.

# 5/6-7/8 తరగతులు

## 1) టైమ్ టేబుల్

1 నుండి 5 తరగతి వరకు నిర్దిష్టమైన Time table అవ సరంలేదని సూచించాం. కాని ఈస్థాయిలో వివిధ సబ్జక్టులను బోధించ డానికి టైమ్ టేబుల్ అవసర మవుతుంది. అన్ని సబ్జక్టులు చెప్ప డానికి వీలుగా రూపొందించుకొనవచ్చును.

## 2) పాఠ్య పుస్తకాలు

ఈ స్థాయిలో పాఠ్యపుస్తకాలుండాలి. కాని పుస్తకాల సంఖ్య పరిమితంగా వుండాలి. చరిత్ర, పౌర విజ్ఞానాలకు ఒక పుస్తకం చాలు.

ప్రతి పుస్తకంలోని పేజీల సంఖ్య వీలైనంత తక్కువగా వుండాలి. పిల్లలకు స్పష్టంగా అర్థమయ్యే భాషలో పుస్తకాలుండాలి.

## ఉపాధ్యాయుల పర్యవేక్షణలో చదివించుట

ఉపాధ్యాయుల పర్యవేక్షణలో విద్యార్థులను చదివించాలి. 5, 6 తరగతుల విద్యార్థులకు రోజుకు రెండు సబ్జక్టులు చొప్పున ఒక్కొక్క సబ్జక్టును అరగంట చదివించాలి. 8వ తరగతికి వచ్చేటప్ప టికి ఈ కాలాన్ని 2 గంటలకు పెంచవచ్చు.

విద్యార్థులు తమంతట తాము చదువుకొనే అలవాటును ప్రోత్స హించడానికి బొమ్మల పుస్తకాలను, సులభంగా అర్థమయ్యే భాషలో ఉపవాచకాలను ప్రచురించాలి. ఇవి సరసమైన ధరలకు అందుబాటులో వుండేలా చూడాలి.

## 8, 9, 10 తరగతులు

సెకండరీస్థాయి సిలబస్‌లో కొన్ని మార్పులను సూచించాం. 10వ తరగతి చివర పబ్లిక్ పరీక్షలు జరపాలి.

### 1. గణిత విజ్ఞాన శాస్త్రాలకు మారుగా ఇతర సబ్జక్టు

ఈ స్థాయి విద్యాబోధన విశాల ప్రాతిపదికపై జరగాలి. విద్యార్థి గణితం, విజ్ఞానశాస్త్రం అభ్యసించాలి. విద్యార్థుల అవసరాల కనుగుణంగా లేబరేటరీ సౌకర్యాలు, పరికరాలను బట్టి, లభ్యమయ్యే ఉపాధ్యాయులనుబట్టి పాఠ్యాంశాలను రూపొందించాలి.

గణితం, విజ్ఞాన శాస్త్రానికి మారుగా చదువవలసిన విషయా లను క్రింద సిలబస్‌లో యిచ్చాం. సిలబస్‌కు సంబంధించిన సూచనలు మాత్రం యిచ్చాం. మారుమూల ప్రాంతాల విద్యార్థులకు యిబ్బంది కరంగా వుంటుందనే అభిప్రాయంతో గణితం, విజ్ఞాన శాస్త్రాలకు మారుగా చదువవలసిన అంశాలు పొందుపరుస్తున్నాం.

### 2. చరిత్ర, పౌరవిజ్ఞానం, భూగోళం

కొన్ని ప్రాంతాలలో ప్రస్తుతం సోషల్‌స్టడీస్‌లో చరిత్ర, పౌరవిజ్ఞానం, భూగోళం, ఆర్థికశాస్త్రం, కామర్స్, మన సత్వశాస్త్రం బోధింపబడుతున్నాయి. కాని ఆ సబ్జక్టులో చరిత్ర, పౌరవిజ్ఞానం, భూగోళం వరకు బోధిస్తే చాలు.

### 3. ఆప్షనల్ సబ్జక్టు

అభిమాన విషయాలలో అభిరుచిని పెంచేందుకు ఈ క్రింది వానిలో ఒకటి Optinal Subjectగా ఎన్నుకొనవచ్చును.

కళలు (సంగీతం, నృత్యం, చిత్రకళ వగైరాలు), Home Scinces, వ్యవసాయం, ఆర్థిక శాస్త్రం, వాణిజ్య శాస్త్రం, సామా జిక స్వరూపం, సాంప్రదాయ భాషలు.

## సిలబస్

సిలబస్‌కు సంబంధించిన సూచనలు యిచ్చాం. సూచనలనను సరించి స్థానిక సంస్థలు, విద్యాబోర్డులుసిలబస్‌రూపొందించుకోవాలి.

ప్రతి సబ్జక్టులో బోధించవలసిన అంశాలు ఉపాధ్యాయుడు చెప్పడానికి అనుగుణంగా విద్యార్థి నేర్చుకోవడానికి అనుకూలంగా వుండాలి. ముఖ్యమైన విషయాలుమాత్రం బోధించాలి, వివరణలు విద్యార్థికి విసుగు కలిగిస్తాయి. విజ్ఞానాన్ని పెంచకపోగా విద్యార్థి కంఠతపట్టవలసిన అవసరాన్ని కల్పిస్తాయి.

యన్. సి. యి. ఆర్. టి. వారు విద్యా విషయాలు రూపొం దించాలని వాటిని అభివృద్ధిచేసి విద్యాబోర్డులు ఎగ్జామినేషన్ బోర్డులు స్థానిక అవసరాలనుబట్టి పాఠ్యపుస్తకాలను తయారు చేసు కోవాలి.

## ముగింపు

తరగతి గదులు పాకలలో, షెడ్‌లలో నడపబడుతున్నాయి. విద్యార్థులనెంతో ఉన్నతి స్థితికి తీసుకొనిరావాలనే ఉన్నతమైన ఆశ యాలతో పాఠశాలలో అడుగుపెట్టిన ఉపాధ్యాయులు అక్కడి వాతా వరణం పరిసరాలనుచూచి దిగ్భ్రమ చెందుతున్నారు. గదిలో 50, 60 మంది పిల్లలు గాలి వెలుతురు సరిగా రాని గదులు పిల్లలిచ్చిన వ్రాత పనిని దిద్దడం, కాంపోజిషన్ దిద్దడం వగైరాల గానుగెద్దు పనితో సృజనాత్మకత బండబారి పోతుంది.

సిలబస్‌ను రూపొందించుకొనే బాధ్యత పాఠశాలలకే అప్ప జెప్పాలి. సెమినార్లు ఏర్పాటుచేసి ఉపాధ్యాయులు హాజరగుటకు ప్రోత్సహించాలి.

ఉపాధ్యాయుడు బోధించడానికి విద్యార్థి నేర్చుకొనడానికి అనువైన పరిస్థితులు కల్పించాలి. కావలసినంత గాలి, వెలుతురు ప్రసరించే విశాలమైన తరగతి గదులుగల పాఠశాలను నిర్మించాలి సైన్సు పరికరాలను బోధనోపకరణాలను సమకూర్చాలి. సమాజానికి ఉపయోగపడే ఉత్పత్తికి సంబంధించినవనికి, వినోద కార్యక్రమాలకు తగు ఏర్పాట్లు చేయాలి.

* * *

# పటేల్ కమిటీ నివేదికను అమలు పరుస్తూ ప్రభుత్వం జారీచేసిన జి.ఓ.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పటేల్ కమిటీ రిపోర్టులోని ముఖ్యాంశాలను అమలుపరుస్తూ జి.ఓ యస్. నెం. 1295 తేదీ 26-12-78 ద్వారా ఉత్తర్వులు జారీ చేసింది. దానిలోని ప్రధానాంశాలు క్రింది విధంగా ఉన్నవి

1. పది సం॥ల పాఠశాల కోర్సులో 1 నుండి 5 తరగతుల వరకు ప్రైమరీ దశగాను, 6,7 తరవతుల వరకు అప్పర్ ప్రైమరీ దశగాను, 8 నుండి 10వ తరగతుల వరకు సెకండరీ దశగానూ విభజించటం జరిగింది.

2. ప్రస్తుతం అమలులో వున్న త్రిభాషాసూత్రం పాఠశాల విద్యాదశలో క్రిందివిధంగా అమలుజరుపబడుతుంది. మాతృభాష లేక ప్రాంతీయ భాషగా బోధన 1 నుండి 10వ తరగతి వరకు కొనసాగింపబడుతోంది. ఇంగ్లీషు భాషాబోధన 5వ తరగతి నుండి హిందీ రెండవ భాషగా 6వ తరగతి నుండి ప్రారంభింపబడుతుంది.

3. సైన్సు, సోషల్‌స్టడీస్ స్థాయిలో పరిసరాల విజ్ఞానం, అనే ప్రత్యేక పాఠ్యాంశం ప్రవేశపెట్టబడుతుంది. అది 1, 2 తరగతులను ఒక పుస్తకంగాను. 3 నుండి 5 తరగతుల వరకు వేర్వేరు పుస్తకాల రూపంలో ఉంటుంది.

4. క్రాఫ్ట్సుకు బదులు 'సాంఘికంగా' ఉపయుక్తమైన ఉత్పాదనా కార్యక్రమం 1 నుండి 10వ తరగతి వరకు ఇతర సబ్జక్టులకిచ్చే ప్రాధాన్యతనిస్తూ ప్రవేశపెట్టబడుతుంది.

5. ప్రస్తుతమున్నట్లు లెక్కలసబ్జక్టు కాంపోజిటు, జనరల్ అని రెండుగా కాకుండా 8 నుండి 10 తరగతులవరకూ ఒకే లెక్కలు ప్రవేశపెట్టబడతాయి.

6. 6 నుండి 10 తరగతుల వరకు సోషల్‌స్టడీస్ సబ్జక్టుకు ప్రస్తుతమున్న చరిత్ర, భూగోళం, సివిక్సులతోపాటు ఎకనామిక్సు కూడా ప్రధాన భాగంగా చేర్చటం జరుగుతుంది.

7. ఆప్షనల్ సబ్జక్టు అనేవి ఇక ఉండవు.

8 ప్రైమరీ దశలో క్రింది పాఠ్యాంశాలు పాఠ్యప్రణాళికలో ఉంటాయి.

(1). భాషలు:- 1వ తరగతినుండి మాతృభాష లేక ప్రాంతీయ భాష. ఇంగ్లీషు 5వతరగతినుండి(2) గణితం, (3) పరిసరాల విజ్ఞానం, (4) సాంఘికముగా ఉపయోగపడే ఉత్పాదనాకృషి, (5) నీతిబోధ, (6) ఆటలు-ఆరోగ్యవిద్య, (7). క్రియేషన్ యాక్టీవిటీస్.

## అప్పర్‌ప్రైమరీ దశలో

1. భాషలు (మాతృభాష లేక ప్రాంతీయ భాష. ఇంగ్లీషు, హిందీ) 2. గణితము, 3 సైన్స్, 4. సోషల్‌స్టడీస్(చరిత్ర,భూగోళం, సివిక్సు, ఎకనామిక్సు) 5. సాంఘికంగా ఉపయోగపడే ఉత్పాదన కార్యక్రమం, 6. ఆటలో ఆరోగ్యవిద్య, 7. క్రియేటివ్ యాక్టివిటీస్.

## సెకండరీ దశ

అప్పర్ ప్రైమరీ దశలోనివే ఉంటాయి,

ఆయా పాఠశాలలు సాంఘికంగా ఉపయోగించే ఉత్పాదనా కార్యక్రమం, ఆటలు, క్రియేటివ్ యాక్టివిటీస్ విషయాల్లో ప్రభుత్వంసూచించే పెద్ద జాబితా నుండి తమ ఇష్టంవచ్చిన వాటిని ఎంపిక చేసుకొనే స్వేచ్ఛ కలిగి ఉంటాయి.

9. ఆయా సబ్జక్టులకు కేటాయించిన సమయం వివిధ అంశాలకు వివిధ దశలలో క్రింది విధంగా ఉంటాయి.

| సబ్జక్టు | 1 నుండి నాలుగు తరగతులు | 5వ తరగతి | యు.పి, సెకండరీ దశలు |
|---|---|---|---|
| భాషలు | 20 శాతం | 30 శాతం (మాతృభాష 18 ఇంగ్లీషు 12) | 30 శాతం (మాతృభాష 12 ఇంగ్లీషు 12 హిందీ 6) |
| గణితం | ,, | 20 శాతం | 14 శాతం |
| పరిసరాల విజ్ఞానం | ,, | ,, | .... |
| సైన్సు | .... | .... | 13 శాతం |
| సోషల్‌స్టడీస్ | .... | .... | ,, |
| సాంఘిక ఉత్పాదక కార్యక్రమం | 20 శాతం | 20 శాతం | 15 శాతం |
| ఆటలు,ఆరోగ్యవిద్య క్రియేటివ్ యాక్టివిటీస్ | 15 శాతం | 5 శాతం | 10 శాతం |
| నీతిబోధన | 5 శాతం | 5 శాతం | 5 శాతం |

పాఠశాల విద్యా డైరెక్టర్ ప్రతి అంశానికి ఎన్ని పీరియళ్ళు కేటాయించవలసింది నిర్ణయించటం జరుగుతుంది.

10. ఇంటిపని బెడద నుండి విద్యార్థుల్ని తప్పించే ఉద్దేశంతో ఆయా సబ్జక్టులకు కేటాయించిన ప్రతి పీరియడ్‌ను రెండు భాగాలు చేసి ఒక భాగంలో బోధనను, రెండో భాగంలో సూపర్‌వైజ్ స్టడీకి కేటాయించటం జరుగుతుంది.

11. కొత్త పాఠ్య ప్రణాళిక తప్పనిసరిగా కొంత తగ్గించవలసినఅవశ్యకతగుర్తిస్తూ పాఠశాలవిద్యాడైరెక్టర్ ప్రతివిషయంపైన సిలబస్ కమిటీలు నియమించి, సిలబస్‌లను తయారుచేసి ప్రభుత్వామోదానికి పెట్టాల్సి వుంది. దీనికి కావలసిన నిధులు ప్రభుత్వం కేటాయింపగలదు.

12. మధ్యలో చదువు మానుకొన్న వారుకూడా ప్రైవేటుగా పరీక్షలకు, 6, 8, 9 తరగతులకు జిల్లా తాలూకా పరీక్షలలో పాల్గొని మరల ఫార్మల్ విద్యలో భాగంగా చేరటానికి, డ్రాప్ అవుట్సును 6, 8 లలో అరికట్టటానికి ప్రభుత్వం అవకాశం కల్పించటం జరిగింది.

13. నూతన పాఠ్యప్రణాళిక దశలవారీగా క్రింది విధంగా అమలు జరుగుతుంది.

1, 2 తరగతులు 79-80, 3 నుండి 5 తరగతుల వరకు 80-81 సం. 6, 7 తరగతుల 81-82 సం. 8 నుండి 10 తరగతులు 82-83 లలో ప్రవేశపెడతారు.

14. ప్రస్తుతంలాగాకుండా పూర్వంలాగా 10వ తరగతి సర్టిఫికెట్లు ఒక రికార్డు రూపంలో తయారు చెయ్యాలని, దానిలో విద్యార్థి 8, 9, 10 తరగతులలో సాధించిన పాఠశాల విద్యా ప్రగతిని, ప్రణాళికేతర కార్యక్రమ ప్రగతిని నమోదుచేసిన ఆఫీసు కాపీకూడా సిద్ధపరచే పద్ధతి ప్రవేశపెట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది.

15. అభ్యుదయ విద్యాసంస్థల్లో ఈ పాఠ్య ప్రణాళికను అమలు జరిపేందుకు ప్రత్యేక జి. ఓ. జారీచేయటం జరుగుతుంది.

ఇవీ ప్రభుత్వం జారీచేసిన జి. ఓ.లో గల అంశాలు.

* * *

# మన సూచనలు - అభిప్రాయాలు

ఇటీవల కాలంలో విద్యారంగ సంస్కరణలకువచ్చిన రిపోర్టులలో ఈశ్వరీభాయి కమిటీ రిపోర్టు అత్యంత ప్రాధాన్యత గలది. అపైన మన రాష్ట్రప్రభుత్వం ఆ రిపోర్టును అంగీకరించి 1979-80 విద్యా సంవత్సరం నుండి అమలుపరచటంతో దానికి మరింత ప్రాధాన్యత వచ్చింది.

అంతటి ప్రాధాన్యతగల రిపోర్టును క్రిందిస్థాయివరకు అన్ని వర్గాల ఉపాధ్యాయులు అధ్యయనం చేయటానికి, ఆచరణలో వచ్చే అవకతవకల్ని, ఇబ్బందుల్ని సరిచేసుకోటానికి అవకాశం కల్పించక హడావిడిగా ప్రవేశపెట్టటం శోచనీయం. బండి ముందు గుఱ్ఱంవెనకా విధానం దీన్ని విజయవంతం చేయదు. ఈ సంవత్సరం 6, 7 తరగతులకు ఒక్కసారే నూతన సిలబస్ ప్రవేశపెట్టడం, వచ్చేయేడు 8, 9, 10 తరగతులను ఒక్కసారే ప్రవేశపెడతామని జి.ఓ.లో నిర్దేశించటం వల్ల విద్యార్థులలో ఉపాధ్యాయుల్లో గందరగోళం, విద్యాసంస్థలో అవ్యవస్థిత దాపురించింది. దీనిని నిర్మాణయుతంగా సరిచేసుకోకపోతే అన్ని నివేదికలా ఆచరణలో ఇదీ నిష్ఫలమవుతుంది.

ఏ నూతన సంస్కరణనైనా క్రమబద్ధంగా ప్రవేశపెట్టాలి. అన్నిస్థాయిల్లో విద్యాగోష్ఠులద్వారా, సెమినార్లద్వారాఉపాధ్యాయులకు అవగాహన అయ్యేట్టు చేసి మార్పుకు కావలసిన వాతావరణం కల్పించి, ఆర్థిక వనరులు సమకూర్చి,క్రమబద్ధంగా నిర్మాణయుతంగా ప్రవేశపెట్టడానికిబదులు ఇదికూడా నాన్‌డిటెన్షన్ స్కీములాగా అర్థరాత్రి నిర్ణయమవుతుంది. ఇప్పటికైనా తక్షణ చర్యలుగా పునశ్చరణ తరగతులు నిర్వహించి, ఉపాధ్యాయుల స్థాయిపెంచి, క్రమబద్ధంగా వచ్చేయేటినుండి ఒక్కొక్క తరగతికి అమలుపరిస్తే గుడ్డిలోమెల్లగా కొంతయినా మేలుజరుగుతుంది. అందువలన ఉద్యమపరంగా ఈ డాక్యుమెంటు ప్రతినిధులకు సమర్పిస్తున్నాం.

పటేల్ కమిటి నివేదికలో మనం ఆశించిన కొన్ని ముఖ్య సంస్కరణలున్నాయి. ప్రతిపాఠశాలలో ఒక వర్క్‌షాపు అనుబంధించబడి వుండాలని కొఠారీ కమీషన్ నివేదికలో ముఖ్యాంశం. దాని కనుగుణమైన సూచనలు ఈ రిపోర్టులో కూడా వున్నాయి, విద్యా విధానంలో పని అనుభవాన్ని ప్రవేశపెట్టడం, విద్యను సాంఘికంగా ఉపయుక్తమైన ఉత్పాదక కార్యక్రమాన్ని అనుబంధించాలని సూచించటం, ఆ విధంగా విద్యను ఉత్పత్తికి అనుసంధానం చేసి సామాజిక ప్రయోజనాలు సాధించాలనటం, శ్రమ గౌరవం కల్గించే కార్యక్రమాల ద్వారా ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించాలనటం. ప్రత్యక్షజ్ఞానానికి ప్రాధాన్యత ఇవ్వాలనటం, రాజ్యాంగ నిబంధనల కనుగుణంగా 14సం.ల వయసు లోపువారికి నిర్బంధవిద్య అమలు జరిపి, మధ్యలో చదువుమానువారి దుస్థితి తొలగించాలనటం, హర్షణీయాంశాలు.

అయితే పైఅంశాలకు చెందినమౌలిక సూచనలుఈరిపోర్టులో నొక్కి చెప్పబడలేదు.

1. మనదేశంలోగాని, రాష్ట్రంలోగాని పలువురు బాధపడే తీవ్ర సమస్య దారిద్ర్యం. తిండిలేకుండా బడికి పంపటంగాని, ఆకలితో పాఠాలు వంటబట్టటంగాని, పోషకాహారం లేకుండా ఆరోగ్యంగా ఉండటంగాని జరగదు. దారిద్ర్యం వలన ఎక్కువమంది మధ్యలో చదువు మానుకొంటున్నారు. దాని పరిష్కారానికి ఈ కమిటీ నివేదికలో మౌలిక సూచన ఏదీలేదు.

2. గాంధీజీ సూచించిన బేసిక్ విద్యావిధానం ఆదర్శంగా నివేదికలో పదేపదే పేర్కొనడం జరిగింది కాని అది ఆచరణలో విఫలమయింది. వేగం పుంజుకొన్న సాంకేతిక జ్ఞానానికనుగుణంగా దేశకాల మార్పుల కనుగుణంగా, రాజ్యాంగంలో నిర్దేశింపబడిన లక్ష్యాల కనుగుణంగా భాష, విషయం అభివృద్ధి చేసుకొంటూ సిలబస్ రూపొందించుకొంటూ ఉపాధ్యాయులకు శిక్షణ, వృత్తి భద్రత, ఆధునిక బోధనా పరికరాలు, ఆర్థిక వనరులు సమకూర్చుకొంటూ ముందుకు పోవాల్సివుంది. దానికి క్రమబద్ధమైన సూచనలు నివేదికలో అస్పష్టంగా వున్నాయి.

3. కుల వివక్ష మత మౌఢ్యం పెంచే విషయాల కొత్త సిలబస్ ప్రణాళికతో రూపొందింపబడిన పుస్తకాలలో గూడా కోకొల్లలుగా వున్నాయి. ఆ పైన మతమౌఢ్యాన్ని మూఢ [illegible] కొన్ని పెంచుతున్న ఆదర్శ పాఠశాల రద్దును ఈ కమిటీ సూచన చేయలేదు సరిగదా....ప్రభుత్వ జి. ఓ.లో అభ్యుదయ ప్రాథమిక పాఠ్యవ్యవస్థ అలాగే కొనసాగే విధానం పేర్కొనబడింది

4. విద్యాబోధనకు, వ్యక్తిగత శ్రద్ధకు ముఖ్యమైన ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి సూచింపక పోవటం ఈ నివేదికలో ప్రధానలోపం.

5. శిక్షణ పొందినవారు వేలాది ఉన్నా సంవత్సరాల తరబడి ఖాళీ పోస్టుల్ని నింపక, సెక్షన్లు శాంక్షన్ చేయక ఇప్పటిలా ఉపేక్ష వహిస్తే ప్రణాళిక ఎంత మంచిదైనా నిష్ఫలమవుతుంది

6. నూతన ప్రణాళిక అమలువల్ల భాషలు బోధించే వారికి రిట్రెంచ్‌మెంట్ వస్తుంది. దాని పరిష్కారం ఈ నివేదికలో లేదు

7. అన్నిటికంటె ప్రధానలోపం....దీనిఅమలును ప్రభుత్వం బాధ్యత వహింపక స్థానిక ప్రజలపైన పెడుతున్నది — అందువల్ల పటేల్ నివేదిక సక్రమంగా అమలు జరగాలంటే ఈ క్రింది మౌలిక మార్పులు తక్షణం రావాల్సి వుంటుంది.

## వైరుధ్యాలు

1) ఈ సిఫారసులలో 6, 7 తరగతులలో కేవలం రెండు భాషలే బోధించాలని ఉండగా ప్రస్తుతం మూడుభాషలూ నిర్బంధంగా బోధించడంలో ఔచిత్యమేమిటి? అసలు నిరక్షరాస్యత ఎక్కువగా ఉన్న మన రాష్ట్రంలో భాషల భారం పెంచడం, విద్యాభివృద్ధికి తోడ్పడుతుందా?

హిందీ రాష్ట్రాలలో 6, 7 తరగతులలో మాతృభాషతోపాటు ఆంగ్లం మాత్రమే నేర్పుతూ ఉండగా మనకు మూడుభాషలు దేనికి?

మూడోభాషను ఐచ్ఛిక భాషగా చేస్తే ఇష్టపడినవాళ్ళు నేర్చుకోటానికి, కష్టం అనుకునేవాళ్ళు వదులుకోటానికి వీలవుతుంది గదా!

2) ఈ సిఫార్సులలో ప్రతికార్యక్రమం పంచాయితీల, సేవా సంస్థల సహకారంతో కొనసాగించాలని సూచించబడింది. ఆర్థికంగా, సాంఘికంగా అభివృద్ధియైన దేశాలలో ఆ సహకారం సాధ్యమవుతుందేమోగాని, 50 శాతం దరిద్రరేఖకు దిగువ అంచున బ్రతుకుతున్న మన సమాజంలో ఆ సహకారం కష్టం అనేది అనుభవైక విదితం. ప్రభుత్వం బాధ్యత వహిస్తేదప్ప దాన్ని ఇతరులపై పెట్టే ప్రయోజనమేమీ ఉండదు. అదీగాక కొంతమంది డబ్బుగలవాళ్ళు దానధర్మాలక్రింద, పాఠశాలల్ని నడపడమంటే, పరోక్షంగా వారి పెత్తనంక్రింద విద్యావిధానం తీసుకుపోవటం అవుతుంది.

3) గణితంలో జనరల్, కాంపోజిట్ రెంటినీ ఒకటిచేయటం సగటు విద్యార్థికి భారంకాదా? మొత్తాన్ని ఒకటిచేసి అందరిపై రుద్దేకంటే, దాన్ని రెండుభాగాలుచేసి, సాధారణ విద్యార్థికి అవసరమైన విషయాలతో 1 వ భాగంగాను, మేధావంతులైనవారికి విశేష విషయాలతో 2 వ భాగంగాను ఉంచితే సరిపోదా?

ఈ విషయాలన్నీ మనం ఆలోచించి పరిస్థితికి తగిన, ఆచరణయోగ్యమైన సూచనల్ని చేయాల్సి ఉంది.

## ముఖ్య సూచనలు

1. ఖేర్‌కమిటీ సిఫార్సుల ప్రకారం జాతీయాదాయంలో 10 శాతం విద్యకు కేటాయించాలి.

రాష్ట్రాల బడ్జెట్‌లో విద్యకు 30 శాతం కేటాయించాలి.

దానిలోకూడా ప్రాథమిక విద్యకు 60 శాతం కేటాయించి ఆ పాఠశాలలు ఆకర్షణీయంగా,ఆధునికంగాఉండేట్టు విద్యాభ్యాసానికవసరమైన అన్ని హంగులూ సమకూర్చాలి. ఆవిధంగా పునాది గట్టిపడాలి.

2. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి హైస్కూళ్ళలో 1:30 ప్రాథమిక పాఠశాలల్లో 1;20, ఏజన్సీ ప్రాంతాల్లో 1:10గా తక్షణం మార్చాలి.

3. సెక్షన్లు శాంక్షన్‌చేసి, ఖాళీపోష్టుల్నినింపి వేలాది మందికి ఉద్యోగకల్పన చేయటమేగాక, సిలబస్ సక్రమంగా సకాలంలో పూర్తిచేసే భౌతిక పరిస్థితి కల్పించాలి.

4. బోధించే వృత్తి విద్య ఆధునికంగా ఉండాలి. సామాజికంగా ఉపయోగపడే ఉత్పత్తులకు ప్రతిఫలం తక్షణం ముట్టేవిగా ఉండాలి.

5. విద్యాహక్కులు – పనిహక్కు రాజ్యాంగ నిబద్ధం చేయటంద్వారా అందరికి గ్యారంటీ కల్పించాలి.

6. మాతృభాషలోనే విద్యాబోధన కొనసాగించాలి.

7. తలిదండ్రుల ఆర్థిక, సాంఘికంగా పరిస్థితుల మార్పును మౌలిక సంస్కరణలు అమలు పరచాలి.

8. పైమార్పు వచ్చేలోగా విద్యార్థులకు హాస్టలువసతి, ఆహార ఏర్పాట్లు చేయాలి.

9. పైమార్పు తెచ్చినా హడావుడిగా గాక ఉపాధ్యాయుల తోనూ, సంఘాలతో, చర్చించి, గోష్ఠులద్వారా, సెమినార్లద్వారా అవగాహన అయ్యేటట్టుచేసి, పునశ్చరణ తరగతుల ద్వారా స్థాయి పెంచి ఆ తర్వాత మాత్రమే నూతన సిలబస్ ప్రవేశపెట్టాలి.

10. మారిన పుస్తకాల్ని సకాలంలో, సక్రమంగా విద్యార్థులకు అందించాలి.

ఈ సామాన్య కర్తవ్యాన్ని నిర్వహిస్తే నూతన మార్పులకు అనుగుణమైన పరిస్థితి వాతావరణం పాఠశాలల్లో ఏర్పడుతుంది. లేకపోతే ఎప్పటిలా విఫలమైతీరుతుంది.

---

మా ఉద్దేశంలో విప్లవం అంటే కొంతమంది వ్యక్తుల్ని చంపటం మాత్రం కాదు. ఒకమానవుణ్ణి మరోమానవుడు దోచుకోవటాన్ని అంతంజేసి యీ దేశంలో సమసమాజాన్ని నిర్మించటం మాఆదర్శం

ఇంక్విలాబ్ జిందాబాద్! —భగత్ సింగ్.

'చుట్టూరా ఉన్న చీకటిని తిడుతూ కూర్చోవటంకంటే ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నయినా వెలిగించటం మంచిది!'

---

## నవోదయం

ఈడుపుగంటి విశ్వనాథ్

బి. ఎ., బి. ఇడి.,

సిద్ధాంతం – ప॥ గో॥ జిల్లా

గ్రీష్మతాపం నుండే – శైత్య వర్షం!
ప్రసవవేదన నుండే – శిశువు జననం!
నిశీధి గహ్వరం నుండే – బాల భానూదయం!
సమైక్యతా జ్యోతి నుండే – చైతన్య శక్తి!
సంఘర్షణ కుక్షి నుండే – సంబరాల ప్రగతిపథం!
విప్లవాల వెలుగు నుండే – విశ్వానికి నవోదయం!!

## "ఇదే మా కథ!"

—శ్రీ మాకరాజు శ్రీనివాసరాజు

సత్యాలపాడు, కృష్ణాజిల్లా

కోడి కూయగానే – కుక్కిమంచమెత్తి
కునికిపాట్లు పడుతూ – కాలకృత్యాలు తీర్చుకొని
కాళీ కుండ చూసుకొని – కాలే కడుపు తడుముకొని
కన్నీళ్ళు తుడుచుకొని – కాళ్ళకి బుద్ధిచెప్పి
పరుగెత్తుకెళ్ళి పగలంతా పనిచేసి – పస్తులతో పడుతూలేస్తూ
కొంపకొచ్చి కాళీకుండ చూస్తూ–కుక్కిమంచంలో కూలబడ్డా....
కోడి కూసింది! – మళ్ళీ కథ మొదలు!!

## లెండి-లెండి!

శ్రీ పి.జె.పి. రత్నం

త్రిపురాపురం, గుంటూరుజిల్లా.

లెండి.... లెండి.... లేవండి
రండి.... రండి.... రారండి
చేతులు చేతులు కలపండి!
నీతిని–జాతిని నిలపండి!
మన పంచల చేరే యాచకుల
ధన సంచులు కోరే కీచకుల
అమ్మాయ్యాల వంచకుల
అరికట్టగ వేగమె రారండి!

---

'మంచియన్నది మాలయైతే మాలనేనౌదున్' –గురజాడ.

'పీడిత వర్గాన్ని పోరాటం మాత్రమే విద్యావంతం చేస్తుంది' –లెనిన్.

'కదిలేదీ కదిలించేదీ.... పెనునిద్దుర వదిలించేదీ–మునుముందుకు నడిపించేదీ–పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీకావాలోయ్ నవకవనానికి –శ్రీశ్రీ

'ఏ మాల్యమూ చెల్లించకుండా ఏఆశయమూ సాధించలేము'

# భారతదేశంలోని ఉపాధ్యాయుల స్థితిగతుల సంగ్రహ స్వరూపం

[ఆగ్నేయాసియా దేశాల ఉపాధ్యాయుల స్థితిగతుల గురించి చర్చించుటకు ప్రపంచ ఉపాధ్యాయసమాఖ్య (ఫిసే)నాయకత్వాన 1980 డిశంబరులో కటక్‌లో ఏర్పాటు చేసిన విద్యాగోష్ఠిలో, భారతదేశ ఉపాధ్యాయుల పక్షాన సమర్పింపబడిన యీ పత్రం అందరికి ఉపయుక్తమైనది గాన అవగాహన కొరకు మీ ముందుంచుతున్నాము.]

## భారతదేశంలో ఉపాధ్యాయ స్థితిగతులు

1. భారతదేశం చాలా ప్రాచీన నాగరికతగల దేశం. క్రీస్తు పూర్వం 3000 సం॥ల వేదకాలంనాటి సాహిత్యంలోనే గురువుల ప్రసక్తివుంది. అయినప్పటికీ పాఠశాల సామాజిక సంస్థగా ఉపాధ్యాయుడు జీతం తీసుకొని పనిచేసే వ్యక్తిగా గుర్తింపు ఈ మధ్య కాలంనాటిదే. ప్రాచీనకాలంలో గురువు కేంద్రంగా పాఠశాల అభివృద్ధి చెందింది. అప్పటి ఉపాధ్యాయుడు విద్య బోధించడమేగాక మత ప్రచారకుడుగా కూడా వుండేవాడు. గురువు ఇల్లే అప్పటి పాఠశాల. అప్పటి గురువు శిష్యులనుండి బోధనారుసుము వసూలు చేసేవాడుకాదు. అప్పుడు రాజు, సమాజంలోని ధనికులు యిచ్చిన విరాళాలతో గురువు కుటుంబ పోషణ జరుపుకునేవాడు. ఆర్థికపరంగా ఉపాధ్యాయుని స్థితిగతులు అంత ఉన్నతంగా వుండకపోయినప్పటికి అతడికి సమాజంలో మంచి గౌరవముండేది. అతడినుండి అతి సామాన్యజీవనము ఉన్నతమైన ఆలోచనావిధానం సమాజం ఆశించేది.

2. భారతదేశంలో బౌద్ధమతం ఉచ్ఛస్థితిలో వున్నకాలంలో విద్యావ్యాప్తి విస్తృతంగా జరిగింది. తక్షశిల, నలంద, నాగార్జున లాంటి విశ్వవిద్యాలయాలు నెలకొల్పబడ్డాయి, విద్యార్థులు వేలసంఖ్యలో వుండేవారు. విశ్వవిద్యాలయాలలో ఉపాధ్యాయుల సంఖ్యకూడా గణనీయంగా వుండేది. బౌద్ధమతం క్షీణించడంతో ఈ విశ్వవిద్యాలయాలు కాలగర్భంలో కలవక తప్పలేదు.

3. భారతదేశంలో సంస్కృతం, అరబిక్, పర్షియన్ భాషలు ఉపాధ్యాయ కేంద్రంగా వ్యాప్తిచెందుతూ వచ్చాయి. ఈనాడు కూడా ప్రాచ్యభాషాబోధన ఒక ఉపాధ్యాయుని ద్వారానే ప్రభుత్వంయిచ్చే గ్రాంటుతో జరుగుతూవుంది.

4. బ్రిటిషువారు ప్రవేశపెట్టిన విద్యావిధానమే ఈనాడు అమలులోవుంది. ఇది వలసపాలకుల పాలనా యంత్రాంగం నడిచేందుకుపయోగపడే విద్య. విధేయులైన భారతీయులకొరకు ఇంగ్లీషు భాష ప్రవేశపెట్టబడింది. పాలకుల కనుకూలమైన విద్యావ్యాప్తి అవసరమయింది. 1857 లో కలకత్తా, బొంబాయి, మద్రాసులలో విశ్వవిద్యాలయాలు స్థాపించబడ్డాయి. విద్యాస్థాయిని నిర్ణయించడానికి అక్కడొకటి యిక్కడొకటిగా ప్రభుత్వ విద్యాసంస్థలు ఏర్పాటుచేసి మిగిలినవిద్యారంగాన్ని ప్రైవేటుయాజమాన్యానికివదిలివేసింది సాంప్రదాయ బద్ధమైన గురువుల స్థానంలో జీతంతో పనిచేసే ఉపాధ్యాయులు ఉనికిలోనికి వచ్చారు. వలసపాలన కనుగుణమైన విద్యావిధానాన్ని ప్రవేశపెట్టడం బ్రిటిషు పాలకుల ధ్యేయం. దీనికి వ్యతిరేకంగా దేశభక్తిని పెంపొందించే విద్యావిధానం కావాలని ప్రజలు డిమాండ్ చేశారు. శాస్త్రీయ విద్యావిధానం కొరకు విద్యారంగంలో ప్రజాస్వామ్య విలువల కొరకు ప్రజల తహ తహ యిప్పటినుండి పుట్టింది.

5. స్వాతంత్ర్య పోరాట కాలంలోనూ, స్వాతంత్ర్య సముపార్జనానంతరం నాటినుండి నేటివరకు భారతీయ విద్యావిధానంలో గణనీయమైన మార్పులు వచ్చాయి. విద్యా సంస్థల సంఖ్య, విద్యార్థుల సంఖ్య, ఉపాధ్యాయుల సంఖ్య, యాజమాన్యాల సంఖ్య పెరిగింది. సమాజంలోని ఉపాధ్యాయుల స్థాయి, ఉపాధ్యాయ సంఘాల స్థాయి విద్యా విషయాలు పెరిగాయి.

6 విద్య ప్రజల బాధ్యతగా భావించడం బ్రిటిషు పాలకుల విధానం. ప్రజలు స్థాపించుకున్న విద్యాసంస్థలకు ప్రభుత్వం సహాయకారిగా ఉంది. భారతదేశంలో నివశించిన బ్రిటిషువారి పిల్లల సౌకర్యార్థం ఖర్చుతో కూడిన పబ్లిక్ స్కూల్స్ తెరువబడ్డాయి. పాలనా యంత్రాంగంలోని పిల్లల సౌకర్యార్థం కొన్ని ప్రభుత్వ పాఠశాలలు ప్రారంభింపబడ్డాయి.

భారతదేశంలో అదే విధానం యిప్పటికీ కొనసాగుతున్నది. ప్రతి బిడ్డకు విద్యావసతి కల్పించడం ప్రభుత్వం తన బాధ్యతగా గుర్తించడంలేదు. ప్రజల ఔదార్యంపై విద్యావ్యాప్తి ఆధారపడింది. ప్రభుత్వం కొంత గ్రాంటు యిస్తుంది. ప్రభుత్వ పాఠశాలలూ కొన్ని వున్నాయి. ఉన్నత వర్గాలవారికి మాత్రమే అందుబాటులో వుండే ఇంగ్లీషు మీడియం స్కూల్స్ వున్నాయి. ఈ విధానం వలన స్వప్రయోజనపరులు, లాభార్జనా పరులైన వ్యాపార వర్గాలకు విద్యా సంస్థలపై యాజమాన్యం లభించింది. ఈ పరిస్థితులు ఇప్పటికీ కొనసాగుతున్నాయి. అన్ని రంగాలలోని అత్యధిక విద్యాసంస్థలు ప్రైవేటు యాజమాన్యం క్రింద వున్నాయి. యాజమాన్యం ఉపాధ్యాయుల మధ్య సంబంధం యజమాని బానిసలమధ్య సంబంధం, భారతదేశంలో అత్యధిక సంఖ్యాక అధ్యాపకుల ఆర్థిక సామాజికస్థాయి, వారి విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడంలో ఎదురయ్యే సాధక బాధకాలు, ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తి, ఇత్యాదులన్నీ దీనిపైననే ఆధారపడివుంటాయి.

## ఈనాటి స్వరూపం

7. సాంప్రదాయకంగా మన విద్యాసంస్థలను మూడు రకాలుగా విభజించవచ్చు. 1) ప్రాథమిక పాఠశాలలు, 2) సెకండరీ పాఠశాలలు, 3) కళాశాలల విశ్వవిద్యాలయాలు. ఉపాధ్యాయసంఘాల

నిర్మాణం ఈ విధంగానే జరిగింది. (కాని ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్‌లో ఎలిమెంటరీస్థాయినుండిజూనియర్ కాలేజిఉపాధ్యాయులవఱకు సభ్యత్వముంది సం॥) ఈ వర్గీకరణ స్పష్టమైన వర్గీకరణ అనడానికి వీలులేదు, ప్రాథమిక స్థాయినుండి సెకండరీ స్థాయివరకు తరగతులున్న పాఠశాలలు కొన్నివున్నాయి. అలాంటి పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయుడు. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు అతడే సెకండరీ పాఠశాల ఉపాధ్యాయుడుకూడా అవుతాడు.

8. ఇంకా నర్సరీ పాఠశాలలు, కిండర్‌గార్డెన్ పాఠశాలలు అవసరాలకు సరిపడినంతగా లేకపోయినా అక్కడొకటి ఇక్కడొకటి వున్నాయి. ఇలాంటి పాఠశాలలలో పనిచేసే ఉపాధ్యాయుల ఉద్యోగ స్థితిగతులకు యితర పాఠశాలల ఉపాధ్యాయుల స్థితిగతులకు ఎంతో భేదముంది. అంతేగాదు, ఇలాంటి పాఠశాలలలోనే ఒకదానిలో పని చేసే ఉపాధ్యాయులకు మరియొక దానిలో పనిచేసే ఉపాధ్యాయుల పని తీరుతెన్నులు, ఉద్యోగ భద్రతలాంటి విషయాలలో కూడా యాజమాన్యాన్నిబట్టి, ఉపాధ్యాయుల సంఘ నిర్మాణాన్నిబట్టి ఎన్నో వ్యత్యాసాలున్నాయి. ప్రస్తుతం అలాంటి పాఠశాలలు పుట్టుకొస్తున్నాయి. అక్కడ పనిచేసే ఉపాధ్యాయులు పొందే జీతాలు బహు తక్కువ. అక్కడ ఉపాధ్యాయులు సంఘటితం కాలేకపోతున్నారు. ఉపాధ్యాయ సంఘాలలో సభ్యులుగా కూడా చేరటానికి భయపడుతున్నారు.

9. పాలిటెక్నిక్, కార్మికుల పరిశ్రమలకు సంబంధించిన శిక్షణా తరగతులను నిర్వహించేవి మరోరకమైనవిద్యాసంస్థలు ఇంకా ఉన్నత విద్యకు సంబంధించిన రీసెర్చి ట్రైనింగులకు సంబంధించిన సంస్థలు వున్నాయి. డిఫెన్సు ఎకాడమీ, ఎడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ ట్రయినింగ్ కాలేజి, యన్. సి. ఇ. ఆర్. టి. మొదలగు సంస్థలు ఈకోవకు చెందినవి. కళాశాలలు, విశ్వవిద్యాలయాలు సాంప్రదాయకంగా ఒకే కోవకు చెందినవిగా పరిగణింపబడుతున్నప్పటికీ విద్యాస్థాయినిబట్టేగాక అచట పనిచేసే అధ్యాపకుల జీతాల స్థాయిలలో కూడా భేదముంది.

10. కొద్దీగొప్ప తేడాలున్నప్పటికి స్థూలంగా విద్యాస్థాయిని ఉపాధ్యాయుల స్థాయినిబట్టి మూడు రకాలుగా వర్గీకరించడం అర్థవంతంగా వుంటుంది.

## విద్యా సంస్థల అజమాయిషీ - ఉద్యోగ భద్రత

11. పార్లమెంటు, ఆయా రాష్ట్ర శాసనసభలు తగుచట్టాలు చేసి భారతదేశంలో విశ్వవిద్యాలయాలను స్థాపించాయి. యాజమాన్యం దృష్ట్యా విద్యాసంస్థలను 3 రకాలుగా విభజించవచ్చు (1) ప్రభుత్వ విద్యాసంస్థలు (2) కార్పొరేషన్లు మునిసిపాలిటీలు జిల్లా బోర్డులచే నడుపబడుతున్నవిద్యాసంస్థలు (3) ప్రభుత్వగుర్తింపుతో మైనారిటీలచే నడుపబడుతున్న విద్యాసంస్థలు. స్కూల్‌ఫైనల్ పరీక్షలు సెకండరీ విద్యాబోర్డుచే నిర్వహింపబడుతున్నాయి. శాసనసభలు తగుచట్టాలు చేసి సృష్టించబడినవి ఈ సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డులు. పాఠ్యాంశాలను రూపొందించటం, పరీక్షలను నిర్వహించడం పాఠశాలలకు గుర్తింపునివ్వడంతోపాటు ప్రైవేటు యాజమాన్యం క్రింద పని చేస్తున్న విద్యాసంస్థలలోని ఉపాధ్యాయుల ఉద్యోగభద్రతవగైరాల పై అజమాయిషీ కలిగివుంటుంది.

12. భారతదేశంలో ఉపాధ్యాయులను కార్మిక సంఘాలకు దూరంగా ఉంచడానికి ప్రయత్నాలు జరిగాయి. సాంప్రదాయకంగా ఉపాధ్యాయ సంఘాలు యితర ట్రేడ్‌యూనియన్లతో సంబంధాలు లేకుండా నిర్మాణంలోకి వచ్చాయి. సామాన్య సమస్యలపై ఉపాధ్యాయ సంఘాలు కార్మికసంఘాలతో చేతులు కలిపిన సంఘటనలున్నాయి. కాని అంత సాన్నిహిత్యం పెంచుకోలేదనే చెప్పవలసివుంటుంది.

13. కార్మికుల, చిన్నరైతుల, రైతుకూలీల ప్రజాస్వామ్య ఉద్యమాలు అభివృద్ధి చెందిన కొలదీ ఉపాధ్యాయ ఉద్యమం నిర్దిష్టమైన ధ్యేయాన్ని, క్రొత్తబలాన్ని సంతరించుకుంటుంది.

దేశంలో ప్రజాస్వామ్యవిలువలు పటిష్ఠంగావున్నప్రాంతాలలో ఉపాధ్యాయ ఉద్యమం రోజురోజుకూ బలాన్ని పుంజుకుంటున్నది. ప్రజలు చైతన్యవంతంగా ప్రజాస్వామ్య విలువలకొరకు జరిపే ఉద్యమాలతోను, కార్మికుల, రైతుల కూలీల ఉద్యమాలతోను ఉపాధ్యాయ ఉద్యమాలు సత్సంబంధాలనుపెంచుకొనడం విద్యావ్యాప్తి యొక్క అవశ్యకతను అందరూ గుర్తించేటట్లు చేయడానికి దోహదపడుతుంది.

సంఘ నిర్మాణం ఉద్యమాభివృద్ధి :- వేరు వేరు ప్రాంతాలలో వేరువేరుగా వుండడంవలన ఉపాధ్యాయులు సాధించిన ఫలితాలు కూడా రాష్ట్రానికి రాష్ట్రానికి భిన్నంగా వున్నాయి. పశ్చిమ బెంగాల్, కేరళ త్రిపుర రాష్ట్రాలలోని ఉపాధ్యాయులు ఉద్యోగ భద్రతకు ముప్పులేకుండా రాజకీయ కార్యకలాపాలలో పాల్గొనడానికేగాక సాధారణ ఎన్నికలలో పోటీచేయడానికి కూడ హక్కు కలిగి వున్నారు. మరికొన్ని యితర రాష్ట్రాలలో ఈ హక్కు తిరస్కరింపబడింది. ప్రభుత్వ సంస్థలలో పనిచేసే ఉపాధ్యాయులకు ఈ హక్కు అన్ని రాష్ట్రాలలో తిరస్కరింపబడింది.

14. సాధారణంగా మనదేశంలో విద్యారంగంలో పనిచేసే వారికి ఉద్యోగభద్రతలేదనే చెప్పాలి. యాజమాన్యం ఉపాధ్యాయుల మధ్య సంబంధం యజమాని బానిస సంబంధంగానేవుంది. ఒక ఉపాధ్యాయుణ్ణి సరియైన కారణాలు లేకుండ ఉద్యోగం నుండి తొలగిస్తే దేశంలోని అత్యున్నత న్యాయస్థానాలు కూడ అతడివి ఉద్యోగంలో ప్రవేశపెట్టలేదు. ఉపాధ్యాయ ఉద్యమాలు ఉద్యోగ భద్రతలకు దేశవ్యాప్తంగా డిమాండ్ చేస్తున్నాయి. చాలా రాష్ట్రప్రభుత్వాలు ఉద్యోగ భద్రత విషయమై శాసనాలు చేశాయి. కొన్ని రాష్ట్రాలలో విద్యను జాతీయం చేయాలని ఉపాధ్యాయులు డిమాండు చేస్తున్నారు. కొన్ని రాష్ట్రాలలో ప్రైవేటు యాజమాన్యం కబంధ హస్తాలలో వున్న ఎలిమెంటరీ సెకండరీ పాఠశాలలను రాష్ట్రప్రభుత్వ యాజమాన్యం క్రిందికి తీసికొని వచ్చాయి. దేశవ్యాప్తంగానున్న పరిస్థితిని గురించి ఆలోచిస్తే ప్రైవేటు యాజమాన్యాన్ని తక్కువగా అంచనా వేయడానికి వీలులేదు ఉపాధ్యాయులకు ఉద్యోగభద్రత ఏర్పాట్లు పటిష్ఠంగా లేనందున నేషనల్ లేబర్ కమీషన్ మరియు సుప్రీంకోర్టు పారిశ్రామిక వివాదచట్టాన్ని సవరించి విద్యారంగంలో పనిచేసే వారిని కూడ ఆ చట్ట పరిధిలోనికి తీసికొనిరావాలని సిఫార్సు చేశాయి. పారిశ్రామిక వివాద చట్టాన్ని ఆ విధంగా సవరిస్తే పారిశ్రామిక కార్మికులకు గల ఉద్యోగ భద్రత విద్యారంగంలో పనిచేసే వారికి గూడ వర్తిస్తుంది.

15. అందుకు భిన్నంగా ఉపాధ్యాయ హక్కులపై ఉపాధ్యాయ సంఘాల పై తీవ్రమైన దాడులు జరుగుతున్నాయి. ఎమర్జన్సీ కాలంలో ఉపాధ్యాయుల హక్కులు సంఘాల హక్కులను

తాత్కాలికంగా రద్దు చేశారు. ఉపాధ్యాయులను పారిశ్రామిక వివాద చట్ట పరిధిలోనికి తీసికొనివచ్చే ప్రసక్తి రాలేదు. ఆగస్టు 78 సుప్రీంకోర్టు సలహా మేరకు ప్రవేశ పెడుతున్నట్లుగా లోక్‌సభలో ఒక బిల్లు ప్రవేశపెట్టబడింది. బిల్లు విద్యా సంస్థలు, ఆస్పత్రులకు సంబంధించింది. ఈ బిల్లులోని అంశాలు ఉపాధ్యాయ వ్యతిరేక, కార్మికవర్గ వ్యతిరేక, ప్రజాస్వామ్య వ్యతిరేక స్వభావంగలవి. ఈ బిల్లుపై వెల్లుబికిన తీవ్ర వ్యతిరేకతవలన దీనిని శాసనం చేయడానికి సాహసించలేకపోయింది. ఆరవ లోక్‌సభ రద్దు కావడంతో ఈ బిల్లు రద్దయిపోయింది. అయినా 1980 లో కేంద్ర ప్రభుత్వం జాతీయ భద్రతా ఆర్డినెన్సును విధించింది. ఇది కేవలం ఉపాధ్యాయులపైననే గాక కార్మికవర్గ ప్రజాస్వామ్య హక్కులపై గురిపెట్టబడింది. దేశంలో ఎవరైనా ముందు హెచ్చరిక లేకుండా నిర్బంధంలోనికి తీసికొని విచారణ లేకుండా జైలులో క్రుక్కే విస్తృతమైన, నిరంకుశాధికారాలను ప్రభుత్వానికి సంక్రమింపజేసింది ఈ ఆర్డినెన్స్. ఉపాధ్యాయ సంఘాలు, విద్యారంగంలో పనిచేసే ఇతర ఉద్యోగుల సంఘాలు, విద్యాసంస్థలు ఆస్పత్రుల బిల్లుపైవలెనే దీనిపై తీవ్రమైన పోరాటం చేయడం వారి విద్యుక్తధర్మంగా భావిస్తున్నాయి.

16. భాషాపరమైన, మతపరమైన మైనారిటీ సంస్థలు వారి యాజమాన్యం కొనసాగింపుకు విద్యాసంస్థలను నెలకొల్పుకొనుటకు చట్టపరమైన రక్షణ కలిగివున్నాయి. చట్టపరమైన రక్షణ అవకాశంగా తీసుకొని మైనారిటీ విద్యాసంస్థల యాజమాన్యం ఉపాధ్యాయులను దోపిడిచేస్తుంది. దేశంలో పలుప్రాంతాలలో ఉపాధ్యాయసంఘాలు యిలాంటి యాజమాన్యాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు నడుపుతూ అకారణంగా ఉద్యోగాలనుండి తొలగింపబడిన ఉపాధ్యాయులను ఉద్యోగాలలో చేర్చుకొనమని ఇబ్బందులకు గురిచేయబడుతున్న అమాయకులైన ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించమని డిమాండ్ చేయవలసి వస్తున్నది. ఉపాధ్యాయ సంఘాలు మైనారిటీ వర్గాల హక్కులకు వ్యతిరేక దృక్పధం కలిగిలేవు. ఇతర విద్యాసంస్థలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకున్న ఉద్యోగ భద్రత సౌకర్యం మైనారిటీ సంస్థలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు కూడా వుండాలనేదే సంఘాల దృక్పధం. యాజమాన్యపు హక్కు దుర్వినియోగ పరచ వద్దనే వాటి డిమాండ్.

## ఉపాధ్యాయుల నియామకం

18. ప్రభుత్వ విద్యాసంస్థల ఉపాధ్యాయులు పబ్లిక్ సర్వీస్ కమిషన్‌చే ఎన్నికచేయబడుతున్నారు. ఈఎన్నిక చేయడానికికమీషన్ చాలాకాలం తీసుకొంటుంది. ఫలితంగా కొందరిని తాత్కాలికంగా నియమించడం జరుగుతుంది. తాత్కాలికంగా నియమింపబడినవారు చాలాకాలం పనిచేస్తున్నప్పటికి వారికి ఉద్యోగభద్రత లేకపోవడంతో పాటు యితర సౌకర్యాలు పొందే అవకాశాలను కోల్పోతున్నారు.

19. ప్రైవేటు విద్యాసంస్థలలో ఎన్నిక చేసుకొనడం ఉద్యోగాలు యివ్వడం ప్రైవేటు యాజమాన్యం చేస్తుంది. విద్యాబోర్డులు విశ్వవిద్యాలయాలు కనీసార్హతలను నిర్దేశిస్తాయి. ప్రైవేటు యాజమాన్యపు దోపిడీని అరికట్టేందుకు కొన్ని రాష్ట్రప్రభుత్వాలు కాలేజి సర్వీసు కమీషన్, హైస్కూలు సర్వీసు కమీషన్‌లను నియమించాయి. మరికొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ప్రైవేటు యాజమాన్యపు ఎన్నిక నిష్పాక్షికంగా జరిపించేందుకు సెకండరీబోర్డు లేక విశ్వవిద్యాలయం అధికారులను నియమిస్తున్నాయి.

క్రొత్తగా నియమింపబడిన ఉపాధ్యాయులందరు బోర్డులేక విశ్వవిద్యాలయం లేక ప్రభుత్వం ఆమోదం పొందవలసియుంటుంది. కాని వారి జీతాలు యితరాలు అన్ని ప్రభుత్వ గ్రాంటు నుండే ఇవ్వబడుతున్నాయి. ప్రభుత్వగ్రాంటు పొందని విద్యాసంస్థలకు ఈ నిబంధనలు వర్తించవు.అంటే అలాంటి విద్యాసంస్థలలో ఉపాధ్యాయులను నియమించడంలోను యితర విషయాలలోను యాజమాన్యం విశృంఖలమైన స్వేచ్ఛ కలిగి వుంటుంది. అన్ని సంస్థలలో పనిచేసేవారి కనీసార్హతలు మాత్రం ఆయా బోర్డులు గాని విశ్వవిద్యాలయాలు గాని నిర్దేశిస్తాయి.

## పని భారం

20. భారత దేశంలో విద్యాసంస్థలు వారానికి 6 రోజులు లేక 5½ రోజులు పనిచేస్తాయి. ఒక ఉపాధ్యాయునిచే వారానికి ఇన్నిగంటల కంటే ఎక్కువపని చేయించరాదనే నిబంధనవుంటుంది. ఈ పనిభారం స్థాయినిబట్టి అంటే ఉపాధ్యాయుడు పనిచేసేది ప్రాథమిక పాఠశాల ఉన్నతపాఠశాలా లేక కళాశాలా అనేదాన్నిబట్టి అతడి హోదానుబట్టి మారుతుంది.

21. పాఠశాల పనిగంటలు వారానికి 39. ఈ 39 గంటలు ఉపాధ్యాయుడు పాఠశాలలో వుండాలి. ఒక ఉపాధ్యాయుడు తీసికొనవలసిన పిరియడ్ల సంఖ్య ఒక రాష్ట్రానికి మరొక రాష్ట్రానికి, ఒక స్కూలుకు మరొక స్కూలుకు మారుతుంటుంది. కాని ఈ సంఖ్య ఎక్కడా 25కితక్కువగాలేదు.ప్రాథమికపాఠశాలలలో ఈఅవకాశంలేదు ఎక్కువ ప్రాథమిక పాఠశాలలు ఏకోపాధ్యాయ పాఠశాలలు, పాఠశాలలలో ఉపాధ్యాయుల సంఖ్య కంటె అక్కడుండే తరగతుల సంఖ్య ఎక్కువగా వుండడం సర్వసామాన్యం. అక్కడి ఉపాధ్యాయులు ఎలా పనిచేయగలరనేది అద్భుతమే. కాని మన ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయుడు రెండుమూడు తరగతులకు ఒకేసారి బోధిస్తూ అద్భుతాలనే సాధిస్తున్నాడు. సెకండరీ పాఠశాలలలో, కళాశాలలలో అదనంగా ఉపాధ్యాయులను నియమించవలసిన అవసరాన్ని విస్మరించడంవలన అచట పనిచేస్తున్నవారే అదనపు పనిభారాన్ని భరించవలసి వస్తుంది. కాలేజీలోగాని, యూనివర్శిటీలోగాని పనిచేసే ఉపాధ్యాయుడు విద్యాసంస్థయొక్క పూర్తి పనిగంటల కాలం సంస్థలో వుండాలనే నిబంధనలేదు. అతడు తన క్లాసు సమయానికి రావచ్చు. కాలేజి ఉపాధ్యాయునికి 18 లెక్చరు పీరియడ్లు వుంటాయి. ఉపాధ్యాయుడు పాఠశాలలో పనిభారాన్ని భరించడంతోపాటు పాఠశాలకు, ఇంటికి మోసుకుని పోవలసివుంటుంది. పాఠ్యప్రణాళిక సిద్ధం చేసుకోవాలి. ప్రశ్నపత్రాలు తయారుచేయాలి. పరీక్షపేపర్లుదిద్దాలి. విద్యార్థులకు విద్యపైన, నడవడిపైన ఆసక్తి పెంచడానికి యితరములైన అదనపు కార్యక్రమాలు చేపట్టాలి.

22. పనిభారం ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిపై ఆధారపడి వుంటుంది. వివిధములైన విద్యాకమీషన్లు కమిటీలు విద్యావ్యాప్తి సరియైన విధంగా జరగడాని కనుగుణంగా ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిని సిఫార్సు చేశాయి. ఆదర్శాలకు అల్లంత దూరంలో లేకపోవడమేకాదు. అవి కనుచూపుమేరలో కనిపించడమేలేదు.

23. ఉపాధ్యాయులకున్న శలవులు కాజువల్‌లీవు, ఎరండ్ లీవు, ప్రివిలేజ్‌లీవు, మెటర్నిటీలీవు, సబాటికల్‌లీవు మొదలయినవి. కాని శలవు వ్యవధి, శలవు పొందడంలోని వైవిధ్యం, వైరుధ్యాలు క్లుప్తంగా చెప్పగలిగినవికావు.

## యాజమాన్యం

24. ఉపాధ్యాయుల ప్రయోజనాల దృష్ట్యానేగాక విద్యావ్యాప్తికి, విద్యాసంస్థలను క్రమబద్ధంగా నడిపేందుకు, విద్యాసంస్థల యాజమాన్యంలో ఉపాధ్యాయులకు తగుప్రాతినిధ్యం కల్పించబడాలి. ఈ రంగంలో సాధించబడిన ప్రగతి సంతృప్తికరంగా లేదు.

25. భారత రాజ్యాంగం ఫెడరల్‌స్వభావం కలిగినదైనప్పటికీ అంచెలంచెలుగా అధికారాలన్నిటిని కేంద్రం దఖలుపరచుకొనడంవలన ఫెడరల్ స్వభావాన్ని కోల్పోయింది. భారతదేశం బహుభాషలు, బహు జాతులుగల దేశం. భారతదేశంలోని వివిధ రాష్ట్రాలకు వారి వారి భాషా సంస్కృతులను అభివృద్ధిపరచుకొనడానికి సమానావకాశాలిస్తే వెనుకబాటుతనం సంకుచిత భావాలను నిర్మూలించడం సాధ్యమయి వుండేది. ఈవిధంగా చేయడంవలన సాంస్కృతికాభివృద్ధి, జాతీయ సమగ్రతాసాధన సాధ్యమవుతాయి. మాతృభాషలో విద్యాబోధన సాంస్కృతికాభివృద్ధికి జాతీయ దృక్పధాన్ని పెంచడానికి తోడ్పడుతుంది.

26. 1975 వరకు విద్య రాష్ట్రజాబితాలోనే వుంది. 75 లో ఒక సవరణతో ఉమ్మడి జాబితాలో చేర్చబడింది. విద్యా విషయమై కేంద్రం చేసే శాసనాలు బహుస్వల్పం. కేంద్రంలో కేంద్ర విద్యా విషయ సలహా సంఘం (CABE) వుంటుంది. దీనిలో కేంద్ర రాష్ట్ర విద్యామంత్రులు, కేంద్ర విద్యాశాఖ మంత్రిచే నియమించబడిన విద్యావేత్తలు సభ్యులుగా వుంటారు. విద్యాపరమైన ముఖ్య నిర్ణయాలు, పంచవర్ష ప్రణాళికలో విద్యను గురించి ఈ సంఘం చర్చించి నిర్ణయాలు చేస్తుంది. జాతీయస్థాయి ఉపాధ్యాయ సంఘాలు దీనిలో తమకు ప్రాతినిధ్యముండాలని చాలాకాలం నుండి డిమాండ్ చేస్తున్నాయి. ఇప్పటివరకు అధికారంలోనికివచ్చిన కేంద్రప్రభుత్వాలన్నీ ఈ డిమాండును తిరస్కరిస్తూ వచ్చాయి. ఉన్నత విద్యారంగంలో యూనివర్శిటీ గ్రాంట్సు కమీషన్ చాలా ముఖ్యమైంది. అఖిలభారత కళాశాలల మరియు విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయుల సంఘం (AIFUCTO) దీనిలో తమ ప్రాతినిధ్యం వుండాలని డిమాండ్‌చేస్తున్నది. కేంద్ర విద్యా మంత్రిత్వశాఖ యు. జి. సి. లో కూడా సభ్యులను తమ చిత్తం వచ్చినవారిని నియమిస్తున్నది. అదే విధంగా జాతీయ విద్యాపరిశోధన మరియు శిక్షణా మండలి (NCERT), రాష్ట్ర విద్యాపరిశోధనా శిక్షణామండలలు( SCERT ) కూడా వుండవలసిన విధంగానే వున్నాయి. అంటే వాటిలోని సభ్యులందరూ నామినేటెడ్ సభ్యులే. వీటిలోకూడ ఉపాధ్యాయ సంఘాలకు ఎలాంటి ప్రాతినిధ్యమివ్వబడలేదు.

27. దేశం స్వాతంత్ర్యం సాధించిన వెంటనే కేంద్ర ప్రభుత్వము ఖేర్ కమీషన్‌ను నియమించింది. ఈ కమిషన్ కేంద్రబడ్జెట్లో 10% రాష్ట్ర బడ్జెట్‌లో 30% విద్యకు కేటాయించాలని సిఫార్సు చేసింది. కేంద్రప్రభుత్వం యిప్పటికి ఈ సిఫార్సు నమలువరచడం లేదుకాని కొన్ని రాష్ట్రప్రభుత్వాలు జమ్మూ కాశ్మీరు, పశ్చిమబెంగాల్, కేరళ, మహారాష్ట్ర వారివారి బడ్జెట్లలో 30 శాతానికధికంగా విద్యకు ఖర్చు పెడుతున్నాయి. ఆయా స్థాయిలలోని విద్యాభివృద్ధికి ఆర్థిక సహాయం అందజేయడానికి యూనివర్శిటీగ్రాంట్సు కమిషనువలెనే ప్రాథమిక, సెకండరీ విద్యాకమీషన్ల నేర్పాటు చేయాలని ఉపాధ్యాయ సంఘాలు వత్తిడి చేస్తున్నాయి. సాధారణ ప్రజాస్వామ్య ఉద్యమాలు బలంగా వున్న రాష్ట్రాలలో ప్రజాస్వామ్య యాజమాన్యాన్ని ఎన్నుకొనడం సాధ్యపడుతుంది. ఉపాధ్యాయులు విద్యారంగంలో పని చేస్తున్న యితర ఉద్యోగులు కొన్ని హక్కులు సాధించుకొనగలరు. సెకండరీ స్థాయివరకు ఉచితవిద్య ప్రాథమిక స్థాయిలో పాఠ్యపుస్తకాలు అందరికీ ఉచితంగా సరఫరా చేయడం సాధించారు.

28. ప్రైవేటువిద్యాసంస్థలలోగాని ప్రభుత్వవిద్యాసంస్థలలోగాని యాజమాన్యంలో ఉపాధ్యాయుని భాగస్వామ్యం లేదనే చెప్పాలి. కళాశాలల, విశ్వవిద్యాలయాల యాజమాన్య పరిస్థితినిపరిశీలించేందుకు రిటైరయిన సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి పి. బి. గజేంద్ర గడ్కర్ నాయకత్వాన యూనివర్శిటీ గ్రాంట్సు కమిషన్ ఒక కమిటీని నియమించింది. ఆ కమిటీ రిపోర్టు అసమగ్రంగా వున్నప్పటికీ యాజమాన్యం వికేంద్రీకరించబడాలని ప్రజాస్వామ్య సంస్థలకు యాజమాన్యంలో ప్రాతినిధ్యముండాలని సిఫార్సుచేసింది. సిఫార్సుల అమలులో విపరీతమైన జాప్యంకన్పిస్తోంది. క్రమబద్ధత లోపించింది.

29. భారతీయ సాంకేతిక శాస్త్ర విద్యాసంస్థలు(I.I.T.) యాజమాన్య శాస్త్రాన్ని బోధించే విద్యాసంస్థలు(I.I.M.)స్థాయిగల విద్యాసంస్థలు. ఇవి ప్రత్యేకమైన విశ్వవిద్యాలయాలుగా పరిగణింపబడుతున్నాయి. ఈ విద్యాసంస్థల యాజమాన్యం కూడ ప్రజాస్వామ్య విరుద్ధంగా నిరంకుశంగా వుంది. విద్యార్థులకు ప్రాతినిధ్యం లేదు. కేరళ పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో విద్యార్థుల ప్రాతినిధ్యానికి అవకాశం కల్పించబడింది. సెకండరీ హయ్యర్ సెకండరీ బోర్డులనుకూడ ప్రభుత్వమే సాధారణంగా నామనేట్ చేస్తుంది. కాని కొన్ని రాష్ట్రాలలో గుర్తింపుపొందిన ఉపాధ్యాయ సంఘాలకు ఈ బోర్డులలో ప్రాతినిధ్యం కల్పించబడింది. ప్రాథమిక పాఠశాలలలో అత్యధికం జిల్లాబోర్డుల యాజమాన్యం క్రింద వుంటాయి. ఈ బోర్డు సభ్యులు కూడ ప్రభుత్వంచే నామనేట్ చేయబడినవారే వుంటారు. కాని పశ్చిమ బెంగాల్‌లో గుర్తింపు పొందిన ఉపాధ్యాయసంఘాలకు బోర్డులలో ప్రాతినిధ్యం కల్పించబడింది.

30. పాఠశాలల, కళాశాలల యాజమాన్యంలో ఎంతో వైవిధ్యముంది. మైనారిటీల, మతపరమైన విద్యాసంస్థల యాజమాన్యం ప్రజాస్వామ్య విరుద్ధంగా వుంది. ప్రభుత్వంచే నియమింపబడిన ఒకరిద్దరికి ఆ సంస్థల యాజమాన్యంలో భాగస్వామ్యముంటుంది.

కళాశాలల యాజమాన్యం విషయంలో విశ్వవిద్యాలయాల పాత్ర గణనీయంగా, అభివృద్ధికాముకంగా వుంటూ వస్తున్నది. పాఠశాలల యాజమాన్యంలో ఎన్నికయిన విద్యార్థుల తల్లిదండ్రుల ప్రాతినిధ్యం నామమాత్రంగా వుంది. విద్యావిధానం ప్రజాస్వామ్యయుతం చేయాలని దానిలో భాగంగా విద్యాసంస్థల యాజమాన్యం ప్రజాస్వామ్యబద్ధంగా వుండాలని ఉపాధ్యాయ ఉద్యమాలు ప్రధానంగా డిమాండ్ చేస్తున్నాయి. ఈ విషయంలో కొన్ని రాష్ట్రాలలో గుర్తింపదగిన అభివృద్ధి సాధింపబడింది.

## జీతాలు

31. అంతర్జాతీయ ప్రమాణాలతో కొలిస్తే అభివృద్ధి చెందని దేశాలతో పోల్చినప్పటికీ భారతదేశంలోని ఉపాధ్యాయుల జీతాలు చాలాతక్కువ. గుర్తింపు పొందని పాఠశాలలలో ప్రభుత్వ గ్రాంటు లభించని విద్యా సంస్థలలో మరీ తక్కువ జీతాలకు పనిచేస్తున్న ఉపాధ్యాయులు వున్నారు. అలా రెండు మూడు సంవత్సరాలు పనిచేస్తే పూర్తి జీతంతో పనిచేయడానికి అవకాశాలు లభిస్తాయనే ఆశతో పనిచేస్తుంటారు. లక్షలాది విద్యావంతులై ఉపాధ్యాయశిక్షణ పొంది నిరుద్యోగులుగా నున్న యువకులను 400 మిలియనుల నిరక్షరాస్యులను కలిపి చూస్తే మనదేశంలోని విద్యారంగం ఆర్థిక రంగాల సంక్షోభాలు స్పష్టంగా అర్థమవుతాయి.

32. ఒక ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుని జీతానికి ఒక విశ్వవిద్యాలయంలోని ప్రొఫెసర్‌జీతానికి ఎంతో తేడావుంది. ఇరువురి జీతాల నిష్పత్తి 1: 10, ప్రాథమిక ఉపాధ్యాయుని వార్షిక యింక్రిమెంటు కూడా చాలా తక్కువగా వుండటం వలన కొన్ని సంవత్సరాల తరువాత కూడా జీతాల మధ్య వ్యత్యాసం తగ్గడానికి అవకాశంలేదు. పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో ద్రవ్యోల్బణం జీవితంలో ఒక భాగం. కొంతకాలం నుండి ఈ ద్రవ్యోల్బణం మరీ పెరుగుతున్నది. 1979-80 లో 18 శాతం ఇలాంటి పరిస్థితులలో పెరిగే కరువుభత్యం ఉద్యోగులకు కొంత ఊరట కలిగిస్తుంది. ఉపాధ్యాయ సంఘాలు ఇతర కార్మిక సంఘాలు నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుదల కనుగుణంగా (పాయంటు టు పాయంటు) కరువుభత్యం పెంచాలని డిమాండ్ చేస్తున్నాయి. కరువుభత్యాలు కొంతవరకు పెంచబడ్డాయి. ఇంటిఅద్దె, మెడికల్ అలవెన్సులు, సిటీ అలవెన్సులు కొన్నిచోట్ల యివ్వడంలేదు. ఇస్తున్నవాటిలో తేడాలున్నాయి, ప్రైవేటు విద్యా సంస్థలలో పనిచేసే ఉపాధ్యాయుల ప్రభుత్వ విద్యాసంస్థలలో పనిచేసే ఉపాధ్యాయులతో సమానమైన ప్రయోజనాలను పొందడం లేదు.

## ఇంటివసతి — వైద్యసదుపాయాలు

33. అభివృద్ధి చెందిన యితరదేశాలలో వలెనే భారతదేశం ముఖ్యంగా పట్టణప్రాంతాలలో యిళ్ళకొరత చాలా తీవ్రంగావుంది. ఉపాధ్యాయులకు యింటివసతి కల్పించబడలేదు. అందువలన ఉపాధ్యాయుడు తన జీతంలో యింటిఅద్దెకే 40 శాతం ఖర్చుపెట్టవలసి వస్తుంది. ఉపాధ్యాయులకు య్యింటివసతి కల్పించాలనేది ఉపాధ్యాయ ఉద్యమంలో ఒక ప్రధానమైన డిమాండ్. ఉపాధ్యాయులు విద్యా రంగంలో పనిచేసే యితర ఉద్యోగులు డాక్టరు సర్టిఫికేట్‌పై కొన్ని రోజులు శలవు పెంచగలగడంతప్ప ఎలాంటివైద్య సదుపాయం వారికి అందడంలేదు. శలవుమంజూరుకూడ అధికారుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడివుంటుంది.

## ఉద్యోగ విరమణ వయస్సు - ప్రయోజనాలు

34. ఉపాధ్యాయుని ఉద్యోగవిరమణవయస్సు 55-65 సం॥ల మధ్యవుంటున్నది, సాధారణంగా 60 సం॥లు కొన్నిసందర్భాలలో ఉద్యోగకాలాన్ని పొడిగించడం లేక తిరిగియివ్వడం జరుగుతున్నది. ఉపాధ్యాయులు విద్యారంగంలో పనిచేసే యితర ఉద్యోగులు ఉద్యోగవిరమణ తరువాత పొందే ప్రయోజనాలలో ఒక రాష్ట్రానికి మరోక రాష్ట్రానికి ఎంతో వైవిధ్యముంది. ఉద్యోగ విరమణచేసే ఉపాధ్యాయుడు పొందగలిగే అధిక ప్రయోజనాలు ట్రిపుల్ బెనిఫిట్ స్కీము ద్వారా పొందగలుగుతాడు. 1) పెన్షన్ 2) గ్రాడ్యుటి 3) జనరల్ ప్రావిడెంటుఫండ్ లేక కాంట్రిబ్యూటరీ ప్రావిడెంటు ఫండ్ మరియు గ్రాడ్యుటీ.

$$\text{పెన్షన్} - \frac{\text{ఉద్యోగ విరమణకు ముందు 12 నెలల సగటు జీతం} \times \text{పనిచేసిన సంవత్సరాల సంఖ్య}}{80} \text{ తో}$$

గణిస్తారు. ఈ భిన్నం 33/380 కంటే మించదు (3 సం॥రాల కంటె ఎక్కువ కాలం పనిచేసినప్పటికి) పని చేసిన సంవత్సరానికి 15 రోజుల క్రితం గ్రాట్యువిటీగా గణిస్తారు. ఉపాధ్యాయుడు ఎంత పొదుపు చేస్తాడో అంతే మొత్తం యాజమాన్యం కలిపి యివ్వడాన్ని సి.పి.యఫ్. అంటారు. పి.యఫ్.సాధారణంగా 6.25%జి.పి.యఫ్ లో యాజమాన్యం ఉపాధ్యాయుడు పొదుపు చేసిన మొత్తంపై వడ్డీ యిస్తుంది. కాని సాధారణంగా ఉపాధ్యాయుడు పొందేది పైనచెప్పిన వాటికంటె తక్కువే వుంటుంది. చాలా రాష్ట్రాలలో పి. యఫ్. సౌకర్యంలేదు. కాని 'అన్ని రాష్ట్రాలలో కూడ రూల్సు గందరగోళంగా వుండటం వలన ఉద్యోగ విరమణ చేసిన తరువాత సంవత్సరాల తరబడి అతడికి రావలసింది రాకపోవడం మాత్రం సామాన్యం. ఉద్యోగ విరమణ తరువాత ఎక్కువకాలం బ్రతికితే కొన్ని ప్రయోజనాలను పొందుతాడు. పరిస్థితులిలా వున్నవి గనుకనే ఉద్యోగ విరమణ వయస్సు పెంచాలని కోరుతుంటారు ఉపాధ్యాయులు.

## ఉపాధ్యాయుల స్థాయి

35. విపరీతమైన వైరుధ్యాలతో కూడుకుని వున్న భారత దేశ సమాజంలో ఉపాధ్యాయ వృత్తికి అంత ప్రాధాన్యతలేదు. ప్రతిభావ్యుత్పత్తులు గల విద్యావంతులైన యువకులు సాధారణంగా ఉపాధ్యాయ వృత్తికి అత్యధిక ప్రాధాన్యత నివ్వరు. అలా అని అసామాన్య ప్రతిభావంతులు అధ్యాపక వృత్తిలో లేరని చెప్పడం కాదు. కొందరు ఈ వృత్తిని గొప్పదిగా భావించి ఉపాధ్యాయులయ్యే వారూ వున్నారు.

36. ఇతర ఉద్యోగులతో పోల్చిచూస్తే ఉపాధ్యాయుల జీతం తక్కువనే చెప్పాలి. ఇవే విద్యార్హతలు గలిగి వేరే డిపార్టుమెంటులో పనిచేసేవారి జీతాలు ఎక్కువగా వుంటున్నాయి. ఉపాధ్యాయ వృత్తిలో ప్రమోషన్ దాదాపు లేదనేచెప్పాలి.

37. ఉపాధ్యాయునికి సమాజంతో సంబంధాలు తక్కువ. 'అందుకే తమపనేదో తాను చూసుకుంటాడు. ఒకరి జోలికిపోడు మంచి వాడు' అంటారు ఉపాధ్యాయుణ్ణి. భారత దేశంలో ప్రభుత్వోద్యోగులకు రాజకీయ హక్కులు అంటే ఒక రాజకీయ పార్టీకి చెందడానికి గాని, తాను నమ్మిన రాజకీయ సిద్ధాంతం కొరకు తీవ్రంగా పని చేసే హక్కుగాని నిరాకరింప బడ్డాయి. అందువలన ప్రభుత్వ పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయులకు ఈ హక్కులు లేవు. ప్రైవేటు విద్యా సంస్థలలో పనిచేసేవారు కూడా ఎన్నికలలో పోటీ చేయరాదని, రాజకీయ పార్టీలకు చెందియుండ కూడదని ఈ మధ్య వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు శాసనాలు చేశాయి.

## ము గిం పు

38. యునెస్కో — ఐ. యల్.ఒ. సిఫార్సుల పై 1966లోనే సంతకం చేసిన భారతదేశం అప్పటి నుండి ఆ సిఫార్సులన్నీ ఉల్లంఘిస్తుడడం విచారకరమైన అంశం.

39. యునెస్కో—ఐ. ఎల్. ఓ. సిఫార్సులను, భారతదేశంలోని ఉపాధ్యాయులను దృష్టిలో పెట్టుకొని ఈ సెమినార్ ఈ క్రింది సూచనలు చేస్తుంది.

A) సమాజాభివృద్ధికిమూలకారణమైనఉపాధ్యాయులస్థానాన్ని సమాజం గుర్తించేటట్లు చేయడానికి కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలు విద్యా వ్యాప్తికి తగు నిధులను కేటాయించాలి.

B) ప్రైవేటు యాజమాన్యం కబంధ హస్తాల నుండి ఉపాధ్యాయులను విముక్తుల్ని చేయాలి. పనిగంటలు, పనిభారం, ఉద్యోగ భద్రత, జీతాలు, యితర లాభాలు న్యాయబద్ధంగా వుండాలి.

C) విద్యా విధానానికి సంబంధించిన అంశాల రూపకల్పనలో ఉపాధ్యాయ సంఘాలకు, విద్యారంగంలో పనిచేసే యితర ఉద్యోగ సంఘాలకు ప్రాతినిధ్యముండాలి.

D) ప్రాథమిక స్థాయిల నుండి .విశ్వవిద్యాలయ స్థాయి వరకు గల అన్ని విద్యా సంస్థలను ప్రజాస్వామ్య బద్ధం చేయాలి. ఉపాధ్యాయులకు విద్యాపరమైన నిర్ణయాలు చేయడంలో భాగస్వామ్యం కల్పించబడాలి.

E) స్థానిక స్థాయి నుండి జాతీయ స్థాయి వరకు గల అన్ని ప్రజాస్వామ్య సంస్థలలో బాధ్యులను ఎన్నుకొనడానికీ, ఎన్నికకాబడడానికీ, సామాజిక, రాజకీయ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనడానికి వీలైన ప్రజాస్వామ్య హక్కుల గ్యారంటీ ఉపాధ్యాయులకు, విద్యారంగంలో పనిచేసే యితర ఉద్యోగులకు కల్పించబడాలి.

F) i) ఉపాధ్యాయులకు విద్యారంగంలో పనిచేసే యితర ఉద్యోగులకు దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాలలో ఉద్యోగ భద్రతకు క్రమబద్ధమైన సర్వీసు రూల్సు ప్రవేశపెట్టాలి.

ii) ఉపాధ్యాయులకు విద్యారంగంలో పనిచేసే యితర ఉద్యోగులకు జరిగే అక్రమాలను పరిష్కరించడానికి సంఘాలు ఏర్పాటు చేస్తూ ఈ సంఘాలలో ఉపాధ్యాయులకు, విద్యారంగంలో పనిచేస్తున్న యితర ఉద్యోగులకు సంతృప్తికరమైన ప్రాతినిధ్యం కల్పించబడాలి.

G) ఉపాధ్యాయులకు విద్యారంగంలో పనిచేసే యితర ఉద్యోగులకు ఆర్థిక పరమైన ప్రయోజనాలను సమకూర్చి వారి ఆర్థిక స్థాయి తద్వారా సామాజికస్థాయిని పెంచడానికి తగు ఏర్పాట్లు చేయబడాలి.

## ప ట్టి క - 1

1978–79లో భారతదేశంలో గల విద్యాసంస్థలు

| విద్యాసంస్థలు | సంఖ్య |
|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 4,74,630 |
| మాధ్యమిక పాఠశాలలు | 1,12,404 |
| సెకండరీ/హయ్యర్ సెకండరీ పాఠశాలలు | 47,104 |
| కళాశాలలు | 4,460 |
| విశ్వవిద్యాలయాలు | 108 |
| మొత్తము | 6,38,707 |

## పట్టిక-2

ప్రాథమిక, సెకండరీ పాఠశాలలో నమోదయిన విద్యార్థుల సంఖ్య — 1978

| తరగతులు | విద్యార్థుల సంఖ్య |
|---|---|
| 1–5 తరగతులు | 5,25,34,367 |
| 6–8 తరగతులు | 1,74,76,281 |
| 9–10 తరగతులు | 85,05,230 |
| మొత్తం విద్యార్థుల సంఖ్య | 7,85,15,378 |

(1980 జూలైలో యన్.సి.ఇ.ఆర్.టి వారిచే ప్రచురించబడిన విద్యా విషయముల సర్వే ఆధారంగా)

## పట్టిక-3

ఉన్నత విద్యలో నమోదయిన విద్యార్థులు

| తరగతులు | విద్యార్థుల సంఖ్య |
|---|---|
| గ్రాడ్యుయేట్ | 22,94,785 |
| పోస్టు గ్రాడ్యుయేట్ | 2,49,528 |
| రీసెర్చి | 30,078 |
| డిప్లొమా/సర్టిఫికెట్ | 43,837 |
| ఉన్నతవిద్య | 26,18,228 |

(1978–79 యు.జి.సి. రిపోర్టు ఆధారంగా)

## ప ట్టి క - 4

1978–79 లో వివిధ విద్యా సంస్థలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులు

| విద్యా సంస్థలు | ఉపాధ్యాయుల సంఖ్య |
|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 12,87,499 |
| మాధ్యమిక పాఠశాలలు | 8,24,559 |
| సెకండరీ పాఠశాలలు | 5,50,097 |
| హయ్యర్ సెకండరీ పాఠశాలలు | 2.88,182 |
| అనుబంధ కళాశాలలు (Affiliated Colleges) | 1,42,824 |
| విశ్వవిద్యాలయ కళాశాలలు (University Colleges) | 10,353 |
| విశ్వవిద్యాలయ విభాగములు (University Departments) | 28,482 |
| మొత్తము | 31,21,996 |

## పట్టిక-5

యాజమాన్యం వారీగా విద్యాసంస్థలు

| యాజమాన్యం | ప్రాథమిక పాఠశాలలు | మాధ్యమిక పాఠశాలలు | సెకండరీ/హయ్యర్ సెకండరీ పాఠశాలలు | మొత్తము |
|---|---|---|---|---|
| ప్రభుత్వం | 1,84,900 | 45,306 | 14,388 | 2,44,594 |
| స్థానికసంస్థలు | 2,61,196 | 42,858 | 4,108 | 3,08,157 |
| ప్రైవేటుఎయిడెడ్ | 20,982 | 18,997 | 26,991 | 66,970 |
| ప్రైవేటుఅన్ఎయిడెడ్ | 7,558 | 5,143 | 1,672 | 14,473 |
| మొత్తము | 4,74,636 | 1,12,404 | 47,104 | 6,34,194 |

# భీమవరం మహాసభల్లో ఆమోదించిన తీర్మానాలు

## సంతాప తీర్మానాలు

గత సంవత్సర కాలములో మరణించిన ప్రపంచ ప్రముఖులు జాతీయ నాయకులు, రచయితలు, ప్రజా సంఘాల కార్యకర్తలు, యు. టి. ఎఫ్. సభ్యులు, కార్యకర్తలు, ప్రకృతి బీభత్సం వాత పడిన వారికి ఈ మహాసభ సందర్భముగా శ్రద్ధాంజలి ఘటించుట మన కనీస కర్తవ్యముగా భావిస్తున్నాము. ఈ దిగువ సంతాప తీర్మానాలు ఆ దృష్టితో ప్రవేశ పెట్టుట జరుగుతున్నది.

1. రష్యా ప్రధాని, పోలిట్ బ్యూరో సభ్యులు శ్రీ అలెగ్జి కొసిగిన్, జన చైనా ఉపాధ్యక్షురాలు శ్రీమతి మదామ్ సన్ యట్ సేన్, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖా మాత్యులు కీ. శే. శ్రీ రాజారాం, పంచాయతీరాజ్ శాఖా మంత్రి శ్రీ పరకాల శేషావతారంగార్ల అకాల మరణానికి ఈ మహాసభ శ్రద్ధాంజలి ఘటిస్తున్నది.

2. భారత దేశములో కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంలో ముఖ్యులైన కామ్రేడ్ పి. సి. జోషి, కామ్రేడ్ భూపేష్‌గుప్తా, ప్రముఖ న్యాయవాది, మాజీ విద్యా మంత్రి శ్రీ యం. సి. చాగ్లా, ట్రేడ్ యూనియన్ నాయకులు దినేష్ భట్టాచార్య, శ్రీ యమ్. వి. ఎస్. కపర్దీ, స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ కడప కోటిరెడ్డిగార్ల మరణానికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నదీ మహాసభ.

3. ఈ కాలములోనే ఆకస్మికమరణానికి గురియైన శ్రీ మస్తానయ్య (ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స టీచర్స్ అసోసియేషన్), శ్రీ వై. గోపాలరావు (ఎ. పి టి. యు. కార్యదర్శి) వరంగల్లు జిల్లా కల్లుగీత కార్మిక సంఘాధ్యక్షులు పెరుమాళ్ళ జగన్నాథంగార్ల మరణానికి సంతాపాన్ని తెలియజేస్తున్నదీ మహాసభ. ఇదే కాలంలో మరణించిన అనేక ప్రజా సంఘాల కార్యకర్తలకు శ్రద్ధాంజలి అర్పిస్తూంది.

4. మన సంఘ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొంటూ విద్యార్థుల అభివృద్ధి కోసము కృషిచేస్తూ మరణించిన సర్వశ్రీ ఆర్. విజయబాబు (విజయవాడ), జె భీమ్యానాయక్ (మహబూబ్‌నగర్), పి. లక్ష్మిపతి (గుంటూరు), వల్లాబొట్ల రాధాకృష్ణమూర్తి (భీమడోలు సమితి), విద్యాసాగర్ (విస్సాకోడేరు సమితి), శ్రీమతి కె. నానమ్మ (అమలాపురం సమితి), శ్రీమతి చిరంజీవులు (కైకలూరు సమితి), షేక్ ఇమామ్ (గన్నవరం సమితి), కె. పకీరయ్య (రాజంపాలెం సమితి), జి. లింగరాజు (విస్సాకోడేరు సమితి), రాష్ట్ర కార్యవర్గ సభ్యులు శ్రీమతి కె రమణమ్మ (కర్నూలు), ప గో. జిల్లా ఉద్యమ కార్యకర్త శ్రీ లింగరాజు,......... గార్ల అకాల మరణానికి ఈ మహాసభ సంతాపాన్ని ప్రకటిస్తోంది.

5. వేర్పాటువాద ధోరణులను తిరస్కరించి తమ చుట్టూవున్న అస్సాం ప్రజలకు వేర్పాటు ఉద్యమ విచ్ఛిన్నకర పోకడలను ఎరుకపరుస్తూ, విధి నిర్వాహణకు పాఠశాలకు వెళ్ళుచున్న అస్సాం ఉపాధ్యాయ సోదరులను వేర్పాటు ఉద్యమ కారులు ఘోరంగా హత్యగావించారు ఈ అమరులకు శ్రద్ధాంజలి ఘటిస్తూ వారి వేర్పాటు వాద ధోరణులను తిరస్కరించుటలో యు టి యఫ్. సభ్యులు, కార్యకర్తలమైన మేము ముందుంటామని ప్రతిజ్ఞ గైకొంటున్నాము.

6. ఈ సంవత్సరము జూన్, జులై, ఆగస్టు నెలలలో కురిసిన వర్షాల వల్ల ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, అస్సాం, బీహార్, ఆంధ్ర ప్రదేశ్‌లోని గోదావరినది ప్రాంతాలలో వరద ప్రమాదానికి లోనై మరణించిన వారి పట్ల ఈ మహాసభ సంతాపాన్ని తెలియజేస్తోంది. వారి కుటుంబాలకు ఈ మహాసభాముఖంగా సానుభూతిని తెలియజేస్తున్నాం.

## ఖండన తీర్మానం

అలీఘడ్ ముస్లిం విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ శ్రీ ఇర్ఫాన్ హబీబ్‌ను సస్పెండు చేయడాన్ని విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ అనుచిత చర్యను ఈ మహాసభ ఖండిస్తోంది. విశ్వవిద్యాలయంలో అభ్యుదయ భావాలువున్నందునే ఆయనను సస్పెండ్ చేయడాన్ని ఈసభ తీవ్రంగా ఖండిస్తోంది. శ్రీ హబీబ్‌ను వెంటనే ఉద్యోగంలోనికి తీసుకోవాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

## జనరల్ సమస్యలపై తీర్మానాలు

1. రోజు రోజుకు నిత్య జీవితావసరవస్తువుల ధరలు చుక్కలంటుతున్నాయి. కేంద్ర బడ్జెట్‌లో లోటు పూరించుటకు పెట్రోలియం ధరలను పెంచుతూ కేంద్ర ప్రభుత్వము వారు నిర్ణయము తీసికొన్నారు. క్షీణిస్తూన్న ఆర్థిక పరిస్థితులు చక్కబడే పరిస్థితి కనుపించుటలేదు. ఈ పరిస్థితి నుండి తట్టుకొనుటకు శ్రామిక వర్గము చైతన్యముతో సంఘటితమై తమకోర్కెల సాధనకు ఐక్యపోరాటాల వైపు మళ్ళుతున్నారు. దౌర్జన్యాగ్రాలపై చేయిచేసుకొనే సాహసము లేక వారి ప్రయోజనాలను కాపాడే నిమిత్తమే అత్యవసర సర్వీసుల ఆర్డినెన్సును ఇందిరాగాంధీ ప్రభుత్వము తెచ్చింది. శ్రామికుల న్యాయమైన పోరాటాలను అణచివేయటానికి ఈ చట్టాన్ని ఉపయోగించుటనే వారి హక్కులను హరించటానికి ఈ దుర్మార్గపు ఆర్డినెన్సును ప్రయోగించుటకు భూమిక సిద్ధమైనది. యజమానులు శ్రామికుల న్యాయమైన కోర్కెలను ఆమోదించక కక్ష సాధింపు చర్యల కొడిగట్టిన వారిపై చర్యగైకొనుటకే నిర్దేశించబడిన ఈ ఆర్డినెన్సును వెంటనే విరమించుకోవలసినదిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది. ఈ దుర్మార్గపు ఆర్డినెన్సును విరమింపచేయటానికి జరిగే ఐక్యశ్రామికపోరాటాలలో మనముభాగస్వాములము కావలసిన అవసరాన్ని గుర్తింపవలసినదిగా ఈ మహాసభ ఉపాధ్యాయ లోకానికి విజ్ఞప్తి చేస్తోంది.

2. జాతీయభద్రతా చట్టం : నల్లబజారు వ్యాపారస్తులు బడా పెట్టుబడిదార్లు, విదేశీ మిషనరీలు, పెద్ద భూస్వాములు ఈ జాతి భద్రతకు నిజమైన ప్రమాదకారులు. తమ వద్దనున్న గుప్తధనముతో మార్కెట్టుపై ఆధిపత్యము వహిస్తూ ప్రజల నిత్యావసర వస్తువుల కృత్రిమ కొరతను సృషిస్తున్నారు. శ్రామికులకు రావలసిన లాభాల లోని వాటాను సక్రమముగా పంపక, హక్కులసాధనకై పోరాటానికి సమాయత్తమైన కార్మికులను లాకౌట్, రిట్రెంచ్‌మెంట్ల ద్వారా

'అత్యవసర సర్వీసుల నిర్వహణ ఆర్డినెన్సు ఉపసంహరించాలి.'

ఇబ్బందులుపాలు చేస్తున్నారు. మిషనరీలు, బడా భూస్వామ్యవర్గాలు ప్రజలపై తమ అదుపుతప్పుతున్నదని భావించినప్పుడల్లా చాకచక్యముగా వేర్పాటుధోరణులను కులమత విద్వేషాలను రెచ్చగొట్టే ప్రయత్నాలు గతములో జరిగినవి. నేడు జరుగుతున్నవి. ఇకముందు జరుపుతారు. జాతీయ భద్రతకు ప్రమాదకారులైన ఈ శక్తులను అదుపులో పెట్టటానికి చిత్తశుద్ధితో కూడిన ప్రయత్నాలు లేకపోగా శ్రామికుల న్యాయమైన కోర్కెలకై జరిగే పోరాటాలను అణచటానికి ప్రజాతంత్ర ఉద్యమాన్ని కాలరాయటానికనే కుబుద్ధితో జాతీయ భద్రతా చట్టాన్ని ఇందిరా కాంగ్రెస్ ప్రభుత్వం తెచ్చింది. ఆచరణలో దీనిని శ్రామికవర్గ ప్రయోజనాలను దెబ్బతీసేందుకు సంపన్నవర్గాల ప్రయోజనాలను కాపాడటానికే వుపయోగిస్తున్నారు. కావున ఈ దుర్మార్గపు చట్టాన్ని విరమించవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

3. ధరల అదుపు : నిత్యము పెరుగుతున్న ధలల వలన జీవన వ్యయసూచిక నానాటికి పెరుగుతోంది. పెరిగిన వ్యయసూచి కాధారముగా పెంచే కరువు భత్యాలు రేట్ల పెరుగుదలను భర్తీ చేయుటకు తోడ్పడుటలేదు. కావున ధరలను అదుపు చేయటానికి ప్రభుత్వమే నేరుగా అత్యవసర వస్తువుల క్రయ విక్రయాలను స్వాధీనము చేసికొని 31 జనవరి 1981 నాటిరేట్ల ప్రకారము అత్యవసర వస్తువులన్నింటిని సరఫరా చేయవలసినదిగా కేంద్ర ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

4. వేతన నిర్ణయములో జరిగిన అనామలీస్ సరిజేయు నిమిత్తమై ప్రసాద్ పే కమిటీ నియమింపబడినప్పటికి వానిని సరిజేయుటకు బదులు సరికొత్త అనామలీస్ సృష్టించుట జరిగింది. కృష్ణస్వామి పే కమిటీకి ఉపాధ్యాయ సంఘాల సమాఖ్య సమర్పించిన మెమోరాండములో అనామలీస్‌ను సరిజేసి క్రొత్త స్కేళ్ళను రూపొందింపవలసిందిగా కోరుట జరిగినది. కృష్ణస్వామిగారు అనామలీస్‌కు సరిక్రొత్త అశాస్త్రీయ నిర్వచనాన్నిచ్చి దాటవేశారు. ఈ విధముగా ఉపాధ్యాయులకు వేతన నిర్ణయములలో అనేకమైన అనామలీస్ కొనసాగింపబడు తున్నవి. వీటన్నింటిని ఉపాధ్యాయ ప్రతినిధుల సూచనమేరకు సరిచేయవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్నిఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

5. రెబెల్లో కమిటీ రిపోర్టును పరిశీలించి అమలు జరుపుటకు వేసిన నలుగురు కమిటీ చర్చలను ప్రకటించవలసిందిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

6. ఫ్యాప్టోతో 51 సమస్యలపై కుదిరిన ప్రభుత్వ ఒడంబడికను అమలు పరచవలసిందిగా ఈ మహాసభ కోరుతోంది.

7. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు వెంటనే డైరెక్టు పేమెంట్ స్కీము అమలు జరుపవలసినదిగా కోరుతున్నాం

8. సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయులకు రెండవశ్రేణి పండితుని స్కేలును ఇవ్వవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది(530-850).

9. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు గ్రూపు ఇన్సూరెన్సు స్కీము 1980లో అమలులోనికి వచ్చినది. స్థానిక సంస్థల ఉద్యోగులు ఆ సౌకర్యమును ఆగస్టు 1975 నుండి పొందుచున్నారు. అందువలన ఎయిడెడ్ ఉపాధ్యాయులలో ఆగస్టు 1975-80 మధ్య చనిపోయిన లేక రిటయిరయిన వారికి కూడా పదివేలు ఇప్పించ గోరుచున్నాము.

10. ఉపాధ్యాయులకు సంవత్సరమునకు ఒక నెల జీతము బోనసుగా ఇవ్వాలని ఈ మహాసభ కోరుతోంది.

11. ఉపాధ్యాయులకు పి. యఫ్: పై ఇచ్చు వడ్డీరేటుబ్యాంకు వడ్డీరేటు ప్రకారం 10 శాతం పెంపు చేయాలి.

12. రాష్ట్రవ్యాపిత నిర్మాణము కలిగి, అన్ని యాజమాన్యాల ఉపాధ్యాయుల సభ్యత్వము కలిగి, 10,000 పైన సభ్యత్వముగల ఉపాధ్యాయ సంఘాలకు గుర్తింపు నివ్వాలి.

13. బదిలీ కోడ్‌ను ఉపాధ్యాయ సంఘాల సూచనలతో రూపొందించాలి.

14. తెలంగాణా ప్రాంతములో 1003, 1062ల విషయంలో మార్చి 27 న విద్యాశాఖ మంత్రిగారు 8 మంది ఉపాధ్యాయ ఎం.ఎల్.సి.లతో శాశ్వత పరిష్కారానికి కుదిరిన ఒప్పందం మేరకు వెంటనే ఉత్తర్వులీయవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

15. తెలంగాణా ప్రాంతములో 1-11-56పూర్వము 42-54 లో నియమితులైన మెట్రిక్యులేట్స్‌కు 54-98½ రక్షిత స్కేలు నిచ్చి 80-150 లేక 96-200లో గరిష్టస్థాయిని చేరిన నాటినుంచి సెలక్షన్ గ్రేడ్ నిచ్చునట్లుగా ఉత్తర్వులీయవలసిందిగా ఈ మహాసభ కోరుతోంది.

16. 1-16-56....1-11-58 మధ్య కాలములో 30-60/40. 42-54/40 42-90/40 నియమింపబడిన మెట్రిక్యులేట్స్ అందరికి ఫ్యాప్టో ప్రతినిధివర్గము ఇతర ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులతో జరిగిన చర్చలలో అంగీకరించిన ప్రకారము నియామకపు తేదీ నుండి 45-90/45 నిచ్చే ఉత్తర్వులు వెంటనే ఇవ్వవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

17. 1-11-56కు పూర్వము నియమింపబడి రక్షణల క్రింద 54-98½, 81-130, 130-190 పొందుటకు అవసరమైన మెట్రిక్యులేట్, మెట్రిక్ ట్రయిన్డ్ లేక ఇంటర్, మరియు ఇంటర్ ట్రైన్డ్ లేక గ్రాడ్యుయేట్ అర్హతగల వారికి ప్రమోషన్స్‌నిచ్చే అధికారాలను డి.ఇ ఓ. లకిస్తూ ఉత్తర్వులీయవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

18. 1-11-56, 1-11-59 మధ్య కాలములో బి. ఇ. డి. అర్హతతో పాఠశాల డైరెక్టరుగారిచే తాత్కాలికంగా బి. ఇ. డి. స్కేలులో నియమింపబడి కొనసాగింపబడిన వారి సర్వీసు రెగ్యులరైజేషన్, వారి నియామకపు తేదీ నుండి చేయవలసినదిగా మహాసభ కోరుతోంది.

19. అన్ని క్యాటగిరీలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులకు సెలక్షన్ గ్రేడ్ ప్రమోషన్ల అవకాశము కల్పించవలసినదిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

20. నాన్ గెజిటెడ్ ఉద్యోగులకిచ్చే సౌకర్యాలన్నింటిని అన్ని యాజమాన్యములలో పనిచేయుచున్న ఉపాధ్యాయులకు వర్తింప చేయవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

21. కంటింజెన్సీ గ్రాంట్లను 6 శాతము నుండి 10 శాతమునకు

'ప్రభుత్వ ఉద్యోగులకిచ్చే సౌకర్యాలన్నీ ఉపాధ్యాయులకు వర్తింపజేయాలి.'

పెంచవలసినదిగా ఈ మహాసభ తీర్మానిస్తోంది.

22. 1–6–1977 వరకు బి.ఇ.డి. అర్హత పొంది ఆర్ట్స్, మాథ్స్, సైన్సు ఇన్ సర్వీస్ ఉపాధ్యాయులందరిని సబ్జెక్ట్ రిక్వయిర్ మెంట్స్‌తో నిమిత్తము లేకుండా బి.ఇ.డి. స్కేలుకు ప్రమోట్‌చేసి ప్రస్తుతము అదనపు సెక్షన్లు, పాఠశాలలు తెరచిన చోట్ల సర్దవలసినదిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

23. జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలను జూనియర్ కాలేజీలుగా మార్చుటవలన వానిలోనికి బదలాయించబడిన హైస్కూలు స్టాఫ్‌ను విలీనం చేసుకొన్నట్లుగా వెంటనే ఉత్తర్వులీయగోరుతాం.

24. జూనియర్ కాలేజీలలో విలీనం చేసికొనిన స్టాఫ్ జిల్లా పరిషత్‌లో పనిచేసిన కాలములో మంజూరైన సెలక్షన్ గ్రేడ్లలోనికి సీనియారిటీ ప్రాతిపదికపై వారిని ప్రమోట్ చేయాలని కోరుతున్నాం.

25. జూనియర్ కాలేజీలలో 2 సంవత్సరముల సర్వీసు పూర్తిచేసిన వారందరి సర్వీసు క్రమబద్ధము చేయవలసినదిగా కోరుతున్నాము.

26. జూనియర్ కాలేజీలలో హైస్కూలు విభాగాన్ని పరిశీలించే సీనియర్ బి.యి.డి అసిస్టెంటుకు రు. 75/–లు అలవెన్సు యివ్వాలి.

27. ప్రభుత్వ పాఠశాలలో పనిచేసే స్కూలు అసిస్టెంట్లకు స్థానిక సంస్థలలో పనిచేసే వారివలె డిపార్టుమెంటల్ పరీక్షలతో నిమిత్తము లేకుండా వారికి ఇంక్రిమెంటు ఇవ్వాలని కోరుతున్నాము.

28. జూనియర్ కాలేజీలలో పనిచేసే వారికి వివాహపు అప్పులను మంజూరుచేసే అధికారము ప్రిన్సిపాల్‌కు ఇవ్వాలని కోరుతున్నాము.

29. జూనియర్ లెక్చరర్ల సర్వీసు క్రమబద్ధం చేయాలి.

30. జూనియర్ లెక్చరర్లకు యు. జి. సి. స్కేలు ఇవ్వాలని కోరుతున్నాము.

31. పోస్టు గ్రాడ్యుయేషన్‌లో స్పెషలైజ్ చేసిన సబ్జక్టు ఆధారముగా ఆయా సబ్జక్టులకు విడివిడిగా లెక్చరర్ల నియామకం జరగాలి.

32. అన్ని గ్రేడులలోని ఉపాధ్యాయులకు అదనపు అర్హతలకు అదనపు సౌకర్యాలు కల్పించాలి.

33. నూతన పెన్షను రూల్స్ స్థానిక సంస్థలు, ఎయిడెడ్ యాజమాన్యాలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులందరికి వర్తింపచేస్తూ ఉత్తర్వు లీయవలసినదిగా ఈ మహాసభ కోరుతున్నది.

34. రెండవ శ్రేణి పండితుల పోస్టులలో పనిచేస్తూ బి ఓ యల్. లేక ఓరియంటల్ టైటిల్‌తో పండిట్ శిక్షణపొందిన భాషా పండితులనందరిని ఒకటవ శ్రేణి పండితులుగా ప్రమోట్ చేయవలసిందిగా ఈ మహాసభ కోరుతోంది.

25. ఎయిడెడ్ పాఠశాలల ఉపాధ్యాయులకు 1933 ఎ.పి. లీవు రూల్స్ వర్తింపజేస్తూ ఉత్తర్వు లీయవలసిందిగా ఈ మహాసభ కోరుతున్నది.

36. 1981 మే పంచాయితీ ఎన్నికల నిమిత్తము ఉపాధ్యాయులందరిని నిర్బంధముగా పాఠశాలయున్న గ్రామములలోనే యుండవలసినదిగా కోరియున్నారు. వీరంతా పంచాయితీ ఎన్నికల నిర్వహణలో భాగస్వాములు. వేసవి శలవులను వాడుకొనకుండా నిరోధించినందుకుగాను 30 దినముల పూర్తి జీతము శలవును జమ చేయుటకు ఉత్తర్వులీయ వలసిందిగా ఈ మహాసభ కోరుతోంది.

37. అర్హతగల ఇన్ సర్వీసు ఉపాధ్యాయులను ప్రమోట్ చేసిన తదుపరి ఆ ఖాళీ లోనికి కొత్తవారిని నియమించుకొనే విధముగా ఉత్తర్వులీయ వలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

38. గ్రామీణ ప్రాంతాలలో పనిచేసే ఉపాధ్యాయులందరికి ఇంటి అద్దె సౌకర్యము కలిగిస్తూ ఉత్తర్వులీయ వలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

39. శిక్షణ పొందని ఉపాధ్యాయులు పూర్తి జీతముపై శిక్షణ పొందుటకు ఏ విధమైన షరతులతో [ఖాళీ ఖర్చీ చేయనిచో] నిమిత్తం లేని విధముగా ఉత్తర్వులీయ వలసిందిగా ఈ మహాసభ కోరుతోంది.

40. అభ్యుదయ ప్రథమిక పాఠశాలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులు పండుగ అడ్వాన్సు, సరెండరు లీవు సౌకర్యాలు, లీవు ట్రావెల్ కన్సెషన్ మొదలుగాగల సౌకర్యములను ప్రభుత్వోద్యోగులతో పాటుగా పొందుటకు కావలసిన నిధులను డి.ఇ.ఓ.లకు విడుదల చేయవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

## విద్యావిషయక తీరాన్మాలు

41. భారతదేశపు భవిష్యత్తు తరగతి గదులలో తీర్చిదిద్దబడుతుందని కొఠారి విద్యా కమీషనువారి అభిప్రాయము. అంటే భారత దేశములోని ప్రజలందరు నూటికి నూరుపాళ్లు విద్యావంతులైననాడే నిజమైన ప్రగతిని సాధించగలము. మన రాజ్యాంగములో 6–14 వయోపరిమితిలో నున్న వారిని 100 శాతం పాఠశాలలో 1972 నాటికే చేర్చుకోవాలని నిర్దేశించియున్నా, ఈ నాటికీ ఆ లక్ష్యము మనరాష్ట్రములో నెరవేరలేదు. నూతనముగా స్వాతంత్ర్యము పొందిన సోమాలియా లాంటి దేశాలు ఈ లక్ష్యాన్ని స్వాతంత్ర్యము సిద్ధించిన అతికొద్ది కాలములోనే సాధించగలిగాయి. పశ్చిమ బెంగాల్ వామపక్ష ప్రభుత్వము వారు ఈ లక్ష్యాన్ని 1981–82 లోనే పూర్తిచేయుటకు బద్ధకంకణులైనారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు ఈ లక్ష్యాన్ని 2–3 సంవత్సరములలోనే చేరుటకు తగిన ప్రణాళికను వెంటనే సిద్ధముచేసి అమలుకు చర్యలు తీసుకొనవలసినదిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

42. పౌష్టికాహారము:– ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ ప్రధాన రాష్ట్రము. మన రాష్ట్రములోని ప్రజలలో 80 శాతం వ్యవసాయ వృత్తిపై ఆధారపడి జీవించే వారు. వారిలో 50 శాతము పైగా దారి

'జూనియర్ లెక్చరర్లకు యు. జి. సి. స్కేళ్ళు ఇవ్వాలి.'

'విద్య రాష్ట్ర జాబితాలో చేర్చాలి.'

ద్రవ్యపు రేఖకులోగా బ్రతుకులు వెళ్ళ మారుస్తున్నవారు. మనవిద్యాలయాలకు వచ్చే పిల్లలలో అధిక శాతము ఈ కుటుంబాల నుండి వచ్చేవారు. ప్రస్తుతం పాఠశాలలకు వచ్చే బిడ్డలలో 90శాతం పౌష్టికాహారము దొరకనివారే. పౌష్టికాహారలోపము విద్యావ్యాసంగము పై ప్రతిఫలిస్తుంది. వీరు ఉపయోగకరమైన పౌరులుగా రూపొందిననాడే ఈ జాతి ప్రగతిని సాధింపగలదు. 6-14 సంవత్సరముల వయోపరిమితిలోను పాఠశాలవిద్యార్థులకు పౌష్టికాహారాన్ని అందజేసే బాధ్యతను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు తీసికోవాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

43. నిరక్షరాస్యత:- ప్రపంచములోనున్న నిరక్షరాస్యులలో సగభాగము భారత ఉపఖండములో నున్నారని గణాంక శాఖవారి వివరములు తెలుపుచున్నవి. అందులో ఆంధ్రప్రదేశ్ జనాభాలో 68 శాతము నిరక్షరాస్యులని 82 వ గణాంక వివరములు తెలుపుతున్నవి. రోజువారి జీవితసమస్యలతో ముడిపడియున్న అంశములను పొందుపరుస్తూ వయోజన విద్యా సిలబస్‌ను రూపొందించి సంఘసేవాసక్తిగల నిరుద్యోగ యువకులతో గ్రామ గ్రామాన వయోజన విద్యాపాఠశాలలను తెరువ వలసినదిగా ఈ మహాసభ కోరుతున్నది.

44. విద్య-రాష్ట్ర జాబితా:-భారతదేశము బహుభాషలదేశము. భాషా ప్రాతిపదికపై రాష్ట్రముల విభజన జరిగింది. మాతృభాషలోనే విద్యాబోధన విశ్వవిద్యాలయ స్థాయివరకు జరుగవలెననెడి నినాదము అత్యధికామోదము పొందిన అంశము. మాతృభాష ద్వారా విద్యావ్యాప్తికి, జాతీయ సమగ్రత, ఆయాప్రాంతాల సారస్వత, సాంస్కృతిక అభివృద్ధి సర్వతోముఖంగా జరగాలంటే విద్య రాష్ట్ర జాబితాలో ఉండుట సముచితము. విద్యను కేంద్ర జాబితాలో లేక ఉమ్మడి జాబితాలో చేర్చాలనే అభిప్రాయము అశాస్త్రీయమైనది. వెంటనే విద్యను ఉమ్మడి జాబితానుండి తొలగించి రాష్ట్ర జాబితాలో చేర్చవలసినదిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

45. విద్య - కేటాయింపులు :- విద్యపై పెట్టుబడి జాతీయ ఉత్పత్తికి దోహదకారి. ఉత్పత్తి సాధనాల ప్రమాణాల పెంపుదలకు ఉత్పత్తిశక్తుల సామర్థ్యం పెరుగుదలకు విద్య దోహదకారి. అట్టి విద్యపై ప్రణాళిక-ప్రణాళికేతర పెట్టుబడులను పెంచవలసియున్నది. భారతదేశములోనే అత్యధిక అక్షరాస్యతను సంపాదించిన కేరళలో విద్యపై పెట్టుబడి వార్షిక బడ్జెట్‌లో 40 శాతము కాగా, ఆంధ్రప్రదేశ్ వార్షిక బడ్జెట్‌లో అది 25 శాతము మాత్రమే. పశ్చిమబెంగాల్ ప్రభుత్వము విద్యపై ప్రణాళిక, ప్రణాళికేతర పెట్టుబడులను గత నాలుగు సంవత్సరాల కాలములో రెట్టింపుకు పెంచగా మన రాష్ట్రంలో కేటాయింపులలో పెరుగుదల నామమాత్రముగానే వున్నది. కేరళను ఆదర్శముగా తీసికొని మన రాష్ట్రములో విద్యాభివృద్ధికి విద్యా బడ్జెట్ వార్షిక బడ్జెట్‌లో 35 శాతము వుండునట్లు చేయవలసినదిగా ఈ మహాసభ విజ్ఞప్తిచేస్తోంది. ప్రాథమిక, సెకండరీ విశ్వవిద్యాలయాల విద్యలకు బడ్జెట్ కేటాయింపులు 3:2:1 లో వుండాలని కోరుతోంది.

46. ఖేర్ కమిటీ సిఫార్సులు:- కేంద్ర ప్రభుత్వ బడ్జెట్‌లో 10 శాతం విద్యావ్యాప్తికొరకు కేటాయించాలని కేంద్రప్రభుత్వముచే నియమించబడిన ఖేర్ కమిటీ 1952సంవత్సరములో సిఫారసుచేసిన సంగతిని ఈ మహాసభ కేంద్రప్రభుత్వ దృష్టికి తీసికొని వస్తున్నది. ఆ సిఫారసులను అమలు జరిపి విద్యారంగ పురోభివృద్ధికి తోడ్పడాలని ఈ మహాసభ కేంద్రప్రభుత్వము వారిని కోరుతూ తీర్మానించడమైనది.

47. విద్యా గ్రాంట్ల కమీషన్ :- విశ్వవిద్యాలయాల గ్రాంట్ల కమీషన్ ప్రాతిపదికమీద ప్రాథమిక విద్యా గ్రాంట్ల కమీషన్, సెకండరీ విద్యా గ్రాంట్ల కమీషన్ వేర్వేరుగా ఏర్పాటుచేసి అన్ని రాష్ట్రములలోను ఒకే విధమైన స్థాయి స్వరూపముగల ప్రాథమిక, సెకండరీ విద్యావిధానములు ఏర్పరచి అమలు జరుపుటకును, ఉపాధ్యాయులకు ఒకే రకమైన జీతాల స్కేళ్ళు, సర్వీసు కండిషన్లు, శెలవు, పెన్షన్ సదుపాయాలు, సర్వీసు రక్షణలు కల్పించుటకును ఈ కమీషన్ల ద్వారా గ్రాంట్లు మంజూరు చేయబడుటకు తగు చర్యలు తీసుకోవాలని ఈ మహాసభ కేంద్ర ప్రభుత్వమువారిని కోరుతూ తీర్మానిస్తున్నది.

48. ఫ్రీ ప్రైమరీ పాఠశాలలు :- పాఠశాల విద్య వయస్సు రాని బిడ్డలందరికీ ఫ్రీ ప్రైమరీ పాఠశాలల నేర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

49. జూనియర్ పాలిటెక్నిక్ పాఠశాలలు :- ఉన్నత విద్యాభ్యాసమునకు అవకాశములేని అసంఖ్యాకమైన పేద, మధ్యతరగతి విద్యార్థులు విద్య పూర్తిచేసిన తరువాత చిన్న, మధ్యతరహా ఉత్పత్తి రంగములలో ఉపయోగపడుటకు, ఏదో ఒక వృత్తిని చేపట్టుటకు వీలుగా శిక్షణ పొందవలసియున్నది. కావున ప్రతి జిల్లాలోను గణనీయమైన సంఖ్యలో జూనియర్ పాలిటెక్నిక్ పాఠశాలలను, ఇండస్ట్రియల్ ట్రైనింగ్ సెంటర్లను ఏర్పాటు చేయవలసినదిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

50. ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తి :-ప్రాథమిక, సెకండరీ స్థాయిలో విద్యాప్రమాణము పెరుగుటకు వ్యక్తిగత శ్రద్ధ చూపవలసి యున్నది. తరగతి విద్యార్థుల సంఖ్య అధికముగానున్న వ్యక్తిగత అభిరుచులను గమనించుటకు వెనుకబడిన విద్యార్థులయెడ ప్రత్యేక శ్రద్ధ వహించుటకు సాధ్యముకాదు. కావున ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి ప్రాథమిక పాఠశాలలో 1:20 గాను, సెకండరీ పాఠశాలలో 1:30గాను, ఏజన్సీ ప్రాంతాలలో 1:10 గాను ఉండాలని ఉపాధ్యాయ సంఘాలు స్వానుభవముతో డిమాండ్ చేస్తున్నప్పటికీ తగ్గించకపోవటం సముచితముగాదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువెంటనే పరిశీలించి ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తిని పై సూచన ప్రకారము సవరించవలసినదిగా ఈ మహాసభపక్షాన కోరుచున్నాము.

51. ఏకోపాధ్యాయ పాఠశాలలు :- ఈ దేశములో 6-14 సంవత్సరముల మధ్యవయస్సు గల ప్రతి బిడ్డకు ఉచిత విద్యను గరుపుట మన రాజ్యాంగ ప్రధాన లక్ష్యము. 1 నుండి 5వ తరగతుల

'ప్రాథమిక, సెకండరీ గ్రాంట్ల కమిషన్లు ఏర్పాటు చేయాలి.'

వరకున్న విద్యార్థులకు ఒకే ఉపాధ్యాయుడు, ఒకే పీరియడులో అభ్యాసన కృత్యములు విడివిడిగా ఏర్పాటు చేయుట కష్టసాధ్యము. 5 గంటల బోధనాకాలంలో పూర్తిగా ప్రతి విద్యార్థికి సద్వినియోగ పడవలెనన్న బహుళోపాధ్యాయులున్ననే సాధ్యపడును. విద్యార్థుల క్షేమము దృష్ట్యా ఏకోపాధ్యాయ పాఠశాలలన్నింటినీ బహుళోపాధ్యాయ పాఠశాలలుగా మార్చవలసినదిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

52. పాఠశాలల భౌతిక వనరులు :– రాష్ట్రములో అన్ని యాజమాన్యాల క్రింద పనిచేస్తున్న పాఠశాలలకు శాశ్వత భవనములు ఆటస్థలములు, గ్రంథాలయము, సైన్సు పరికరములు, తోట పెంపకమునకు అవసరమైన పరికరములను సమకూర్చుటకు ప్రణాళికను రూపొందించి వాటి అమలునకవసరమైన నిధులను బడ్జెట్‌లో కేటాయించాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

53. సిలబస్ మార్పు : పెరుగుతున్న సమాజ అవసరాలు, అభివృద్ధి చెందుతున్న శాస్త్రవిజ్ఞానము దృష్ట్యా పాఠ్యప్రణాళికలలో మార్పులు చేయుట హర్షించదగినదే. ఈ మార్పును ఒక పథకము ప్రకారము క్రిందనుండి తీసికొని రావలసియున్నది. నూతన పాఠ్య ప్రణాళికలోని అంశములతో ఉపాధ్యాయులకు గత పరిచయము లేనిచో ముందుగా ఉపాధ్యాయులకు పునశ్చరణ తరగతులను నిర్వహించి సిద్ధము చేయవలసియున్నది. ఈ సంవత్సరం 6,7తరగతుల పాఠ్యప్రణాళికను ఒకేసారి మార్చుట, రాబోయే సంవత్సరములలో 8,9,10 తరగతుల ప్రణాళిక మార్పును చేయ నిశ్చయించుట శాస్త్రీయ దృక్పథంగా జరుగుచున్నదిగాదు. ఆశించిన ఫలితములు లభించకపోగా దుష్ఫలితములు కలుగును. ఈ అశాస్త్రీయ పద్ధతులకు భరతవాక్యము పలకవలసినదిగా క్రమపద్ధతిలో పాఠ్యప్రణాళికలో మార్పులను తేవలసినదిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

54. పాఠ్యగ్రంథాలు : పాఠ్యపుస్తక ప్రచురణ జాతీయము చేయబడినను పాఠశాలలు తెరచిన తరువాత నెలల తరబడి పాఠ్య పుస్తకములు లభ్యమగుటలేదు. పుస్తక విక్రేతలు పాఠ్యపుస్తకములను గైడ్సు కొన్నవారికే సరఫరా చేయుట జరుగుచున్నది. విద్యార్థుల నుండి పుస్తకముల వ్యాపారముల పేరుతో ద్రవ్యార్జన జరుగుచున్నది. ఈ పరిస్థితిని ప్రభుత్వమువారు అదుపు చేయవలసియున్నది. విద్యా సంవత్సర ప్రారంభములోనే పాఠ్య పుస్తకములు జిల్లా, సమితి ప్రాంతముల అవసరాల దృష్ట్యా జిల్లా, సమితి స్థాయిలలో కేంద్రము నేర్పాటుచేసి సరఫరా చేయవలసినదిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

2) సమసమాజ లక్ష్యాలకు అనుగుణంగా పాఠ్యాంశములను రూపొందించవలసియున్నది. ప్రస్తుత పాఠ్యప్రణాళికలో ఈ మౌలిక లక్ష్యాలనే దెబ్బతీసే పాఠ్యాంశములు కోకొల్లలుగా నున్నవి. సమసమాజ లక్ష్యాని కనుగుణమైన అంశములతో శాస్త్రీయ దృక్పథమును పెంపొందించే పాఠ్యపుస్తకాలను తిరిగి వ్రాయించాలని ఈ మహాసభ కోరుతోంది.

3) పాఠ్యగ్రంథాల రచనలలో బోధనానుభవముగల ఉపాధ్యాయులకు తగు ప్రాతినిధ్యము కల్పించవలసినదిగా కోరుతూ తీర్మానించుచున్నాము.

55. విద్యాబోర్డులు:– ప్రస్తుతమున్న పాఠశాలలను ప్రభుత్వ జిల్లాపరిషత్, పంచాయితీ సమితి, మునిసిపాలిటీ అభ్యుదయ, ఎయిడెడ్ యాజమాన్యాల క్రింద విభజించి నడుపుట జరుగుచున్నది. వీటన్నింటికి నూటికి నూరుపాళ్ళు గ్రాంట్లు ప్రభుత్వమే చెల్లించుచున్నది. ఈ వివిధ యాజమాన్యములు తాము నడుపుచున్న పాఠశాలల భౌతిక వనరుల అభివృద్ధిలో చూపవలసిన శ్రద్ధాసక్తులు లోపించి తమ స్వార్ధ, సంకుచిత ప్రయోజనాలకు నిలయాలుగా మారుతున్నారు. విద్యారంగములో ఆశించిన పురోభివృద్ధికి బదులు దుష్ఫలితాలు అధికమైనవి. ఈ పాఠశాలలలో పనిచేసే సిబ్బంది దైనందిన సమస్యలు కుప్పతెప్పలు. విద్యారంగము మూడుపువ్వులు ఆరు కాయలుతో శోభిల్లాలంటే కొఠారి కమీషన్, ఉపాధ్యాయ సూచన సంఘాల ప్రకారము యాజమాన్యాలన్నింటిని రద్దుచేసి విద్యాబోర్డు క్రిందకు పాఠశాలలను తేవలసినదిగా ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

56. రిఫ్రెషర్ కోర్సులు:– పాఠ్యాంశాలలో చేర్చబడుచున్న ఆధునిక శాస్త్రీయ విషయములు, బోధనా పద్ధతులలో దినదినము వస్తున్న క్రొంగొత్త సాంకేతిక మార్పులతో ఎప్పటికప్పుడు ఉపాధ్యాయుడు పరిచయమగుటకు రిఫ్రెషర్ కోర్సులను జిల్లా సమితి స్థాయిలలో 3 సంవత్సరముల కొకసారి ఏర్పాటు చేయవలసినదిగా ఈ మహాసభ ముఖ్యముగా ప్రభుత్వాన్ని కోరుచున్నది. ప్రతి సంవత్సరము జిల్లా, రాష్ట్ర స్థాయిలలో విద్యాగోష్ఠులను నిర్వహించవలసినదిగా కోరుచున్నాము.

57. తెలుగు బోధనా భాషగల పాఠశాలలో ఉర్దూ, కన్నడం, తమిళం, ఒరియా మాతృభాషగాగల విద్యార్థులు 10 మందికి మించిన ఆయా భాషలను బోధించు ఉపాధ్యాయులను నియమించి వారి మాతృభాషాభివృద్ధికి తోడ్పడవలసినదిగా కోరుచున్నాము.

58. మైనారిటీ వర్గాలవారికి వారివారి భాషల బోధనకై ఉపాధ్యాయులను తర్ఫీదు చేయుటకై ప్రత్యేక ట్రయినింగ్ పాఠశాలలను నెలకొల్పవలసినదిగా కోరుచున్నాము.

59. (ఎ) అప్పర్ ప్రైమరీ పాఠశాలలు:– సామాన్య ప్రజలందరికీ విద్యా సౌకర్యములు కలుగజేసేందుకు ప్రతి మూడు మైళ్ళకు ఒక అప్పర్ ప్రైమరీ పాఠశాలను నెలకొల్పవలసినదిగా కోరుచున్నాము.

బి) అప్పర్ ప్రైమరీ పాఠశాలలు ప్రస్తుతము ఇద్దరు లేక ముగ్గురు ఉపాధ్యాయులచే నడుపబడుచున్నవి 7వ తరగతి వరకు గల ఈ పాఠశాలలకు ఇరువురు శిక్షణ పొందిన పట్టభద్రులు (గణితము లేక విజ్ఞానశాస్త్రము మరియు ఆర్ట్సు) తెలుగు, హిందీ పండితులు, వ్యాయామోపాధ్యాయుడు 1 నుండి 5 తరగతులకు ఒక్కొక్కరు చొప్పున సెకండరీగ్రేడు శిక్షణ పొందిన ఉపాధ్యాయులను నియమించిననే న్యాయము చేకూరును. ఈ కనీస ప్రాతిపదికపై ఉపాధ్యాయుల నియామకం చేయవలసినదిగా కోరుచున్నాము.

60. భాషాపండితులు : ప్రతి సెకండరీ పాఠశాలలోను పని భారమును బట్టి గానక మొదటిశ్రేణి తెలుగు, హిందీ భాషా పండితులను నియమింపవలసినదిగా కోరుచున్నాము.

61. విద్యార్థుల దేహ దారుఢ్యము పెంపొందుటకు ప్రాథమిక

స్థాయినుండే క్రీడలకు ప్రాధాన్యత నీయవలెను. విద్యార్థి దేహ దారుఢ్యముతో విజ్ఞానాభివృద్ధి పొందగలడు. క్రీడల ద్వారానే ఆరోగ్యకరమైన సంఘ జీవనమును విద్యార్థుల కల్గును. క్రీడలలో దేశము ముందంజ వేయవలసియున్నది. కావున ప్రతి అప్పర్ ప్రైమరీ పాఠశాలకు ఒక పి.ఇ.టి.ని, 400 వరకు విద్యార్థులు గల ఉన్నత పాఠశాలలకు ఒక పి.ఇ.టి.ని, 100 మంది విద్యార్థినులు గల ఉన్నత పాఠశాలలకు ఒక స్త్రీ పి.ఇ.టి.ని, 800 దాటిన ప్రతి ఉన్నత పాఠశాలకు అదనముగా ఒక ఫిజికల్ డైరెక్టరును నియమించి క్రీడాభివృద్ధికి కావలసిన ఇతర సదుపాయములను కల్పించవలసినదిగా కోరుచున్నాము.

62. ప్రాథమిక దశనుండి, యూనివర్శిటీ దశవరకు మాతృ భాషలో విద్యాబోధన జరగాలని ఈ మహాసభ కోరుతోంది.

63. బోధనా పరికరాలు:– (ఏ) విద్యాబోధన ఉపయోగపడుటకుగాను అన్ని మేనేజిమెంట్ల క్రిందగల పాఠశాలలకు దృశ్య, శ్రవ్య విద్యా పరికరాలను లేబరేటరీ, లైబ్రరీ సౌకర్యాలను, మ్యాపులు చిత్రపటములను సప్లయి చేయవలెను. విద్యుత్ సౌకర్యం లేని ప్రదేశములకు ప్రభుత్వమువారు సంచార సినిమాలద్వారా సౌకర్యాలను ఏర్పాటు చేయవలెనని కోరుచున్నాము.

(బి) విద్యార్థులను విజ్ఞాన వంతులను చేయాలంటే ఉపాధ్యాయుడు విజ్ఞానవంతుడు కావాలి. దేశంలో జరిగేఅభివృద్ధి, ప్రాజెక్టులు చారిత్రక ప్రదేశములను ఉపాధ్యాయునికి చూపించుటకుగాను ప్రభుత్వము ప్రతి సంవత్సరము ప్రత్యేకముగా విహార యాత్రలను నిర్వహించాలని కోరుచున్నాము. సంవత్సరమున కొకసారి పర్యటించుటకు ఉచిత రైల్వే పాసులు మంజూరు చేయగోరుచున్నాము.

64. టార్గెట్లు : పరీక్షా ఫలితాలు ఉపాధ్యాయుల కృషి, పాఠశాల భౌతిక వనరులు, తల్లిదండ్రుల శ్రద్ధ, ప్రోత్సాహము, విద్యార్థుల కృషి మొదలగు అంశములపై ఆధారపడియుండును. టార్గెట్లను నిర్ణయించి వాటిని చేరుకొనని ఉపాధ్యాయులపై క్రమశిక్షణా చర్య గైకొంటామని ప్రభుత్వంవారు ప్రకటించుట అనుచితమని ఈ మహాసభ అభిప్రాయపడుతోంది. కావున టార్గెట్ల పద్ధతిని వెంటనే ఉపసంహరించుకోవాలని కోరుతున్నాము.

65. రాష్ట్రములోని వివిధ జిల్లా కేంద్రములలో ఆయా జిల్లాలకు సంబంధించిన సెకండరీ గ్రేడు ఉపాధ్యాయులకు ఇ. యల్. టి. సి. ట్రయినింగునకు డెప్యూట్ చేస్తున్నారు. వారికి ఆయా పట్టణాలలో తగిన వసతి సౌకర్యాలు కల్పించుటలేదు. దాని కారణంగా ఉపాధ్యాయులు పట్టణాలలో అనేక ఇబ్బందులకు గురికాబడుచున్నారు. కనుక ప్రభుత్వం ఉపాధ్యాయులకు తగిన వసతి సౌకర్యములు కల్గించి, వారికి ఇచ్చు అలవెన్సులను రోజుకు రు. 10/– కు పెంచి ట్రయినింగు పూర్తియగు సమయములోనే చెల్లించే ఏర్పాటు చేయవలసినదిగా తీర్మానించడమైనది.

66. 1976కి పూర్వము మునిసిపాలిటీలకు ప్రభుత్వం 50 శాతం గ్రాంటు ఇచ్చిన కారణంగా మునిసిపాలిటీలు ఉపాధ్యాయుల జీతములు చెల్లించుటలో బకాయి పడినవి. అప్పుడు ప్రభుత్వము సదరు బకాయి గ్రాంటు, ఉపాధ్యాయులకు జీతములు చెల్లించుటకు తాత్కాలికపద్ధతిపై విడుదలచేసినది. అయితే మున్సిపాలిటీలు వాయిదాల ప్రకారం సదరు బకాయి చెల్లించని కారణంగా నరసాపురం మొదలగు మున్సిపాలిటీలో 81–82 ఉపాధ్యాయుల జీతముల గ్రాంటు నుండి ప్రభుత్వం మినహాయించినది. అందుచే ఉపాధ్యాయులకు నాల్గు నెలలనుండి జీతములు లేవు. ఉపాధ్యాయులు జీతముల నుండి బకాయిలు మినహాయించుకొనుట రద్దుచేసి నర్సాపురం మున్సిపల్ ఉపాధ్యాయుల జీతములు వెంటనే చెల్లించకోరుచున్నాము.

67. ఏజన్సీ పాఠశాలలు, తిరిగి పాఠశాల విద్యా డైరెక్టరుకు అప్పగించిన కారణంగా శాఖలమధ్య సమన్వయం లోపించి, మార్చి నెల నుండి ఇప్పటివరకు జీతములు చెల్లించలేదు. ఇటీవల జీతముల గ్రాంటు విడుదల చేసినా, రాష్ట్ర, జిల్లా ట్రజరీ ఆఫీసులలో అలసత్వ కారణంగా ఏజన్సీ ఉపాధ్యాయులకు జీతములు అందలేదు. వెంటనే వారికి జీతములు చెల్లించుటకు తగు చర్య గైకొనాలని కోరుచున్నాము.

68. రిటయిరు ఉపాధ్యాయులకు పెన్షను నిర్ణయించుటలో 10 నెలల సగటు జీతమునకు బదులు చివరినెల జీతమునుబట్టి పెన్షను, గ్రాట్యుటీ చెల్లించాలని కోరుచున్నాము.

69. 20 సం॥ల సర్వీసు దాటి ఇచ్ఛాపూర్వకముగా రిటైరగు వారికి 33/66 పద్ధతి ప్రకారం పూర్తి పెన్షన్ వచ్చునట్లు ఉత్తర్వులు ఇప్పించ కోరుచున్నాము.

70. ఉపాధ్యాయుల పిల్లలకు యూనివర్శిటీ స్థాయివరకు ఉచిత విద్యా సౌకర్యములు కల్గించాలని వారికి వృత్తి విద్యాకళాశాలలోను, ఉద్యోగములలోను, రిజర్వేషన్ అవకాశాలు కల్పించాలని కోరుచున్నాము.

## మహాసభల్లో ఆమోదించిన నిబంధనావళి సవరణలు

(1) 2వ చాప్టరు–2వ అంశము 'సెకండరీల' అనుమాటలో 'ల'ను తొలగించి దాని ప్రక్కన 'జూనియర్ కాలేజీల' అను మాటలను, 'సంఘము'నకు 'ఉద్యమము' అని చేర్చవలెను.

(2) 3వ చాప్టరు–2వ అంశము "ఈ సంఘ కేంద్ర కార్యాలయము విజయవాడలోను బ్రాంచి కార్యాలయము హైదరాబాదులోను ఉండును" అని సవరించవలెను.

(3) 3వ చాప్టరు–3వ అంశముగా ఈ దిగువ విధముగా చేర్చవలెను. 3. జెండా: ఎరుపురంగు జెండా, దానిపై యు టి యఫ్. అను ఆంగ్ల అక్షరములుకలది ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ జెండాగా నుండును.

(4) 4వ చాప్టరు–19 అంశముగా ఈ దిగువ విధముగా చేర్చవలెను. భారతదేశములోని యితరరాష్ట్రాలలోని సోదరసంఘాల మహాసభలకు సౌహార్ద్ర ప్రతినిధులను పంపి వారి అనుభవములను సేకరించుట.

5. 5 వ చాప్టరు–3 వ అంశము "గడువు లోపల" అను మాటలకు బదులుగా "గడువు లోపలగాని" అను మాటలను చేర్చవలెను.

6. 5 వ చాప్టరు–3 వ అంశము రెండు అను మాటకు బదులుగా నాలుగు అని చేర్చవలెను.

7. 5 వ చాప్టరు_6 వ అంశము ఈ దిగువ విధముగా సవరించవలెను. సభ్యత్వ రుసుములో రు. 0_50 లు సెంటరు శాఖలకును, రు. 1_25 లు సమితి/పట్టణ శాఖలకును, రు. 1_25 లు జిల్లా శాఖలకును, రు. 1_00 ప్రదేశ్ ఫెడరేషన్‌కు చెందును.

8. 5 వ చాప్టరు_8 వ అంశములో "దీనిని 30 శాతం సమితి, 45 శాతం జిల్లా, 25 శాతం రాష్ట్ర సంఘానికి చెందవలెనని" చేర్చవలెను."

9. 7(అ)చాప్టరు_1 వ అంశము"ప్రదేశ్ ఫెడరేషన్ ఆఫీసు బేరర్సు" అను మాటల తరువాత "ఫెడరేషను మద్దతుతో శాసన మండలికై యు. టి. యఫ్. సభ్యత్వము కలిగియున్నవారూ" అను మాటలను గూడ చేర్చవలెను.

10. 7 (అ) చాప్టరు_1 వ అంశమును తొలగించి ఈ క్రింది విధముగా చేర్చవలెను.

ఫెడరేషను ఆఫీసు బేరర్లు:-ప్రతి జిల్లా ప్రధాన కార్యదర్శి, ఎన్నికలు జరగని జిల్లాలో కన్వీనరు లేక అడ్‌హాక్ కమిటీ కార్యదర్శి, వేరే ఆఫీసు బేరరుగాకూడా ఎన్నికయినచో ఆ జిల్లా శాఖ అధ్యక్షులు, జిల్లా ప్రధానకార్యదర్శి, అధ్యక్షులు రాష్ట్ర కౌన్సిలర్లుగా ఎన్నిక కానిచో ఆ జిల్లానుండి ఎన్నికయిన రాష్ట్ర కౌన్సిలు సభ్యుల నుండి ఒకరిని, ఐక్య ఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకుడు, ఒక మహిళ (రిజర్వుడు) కౌన్సిలు అవసరమని భావించిన మైనారిటీ వర్గాల ప్రతినిధులు ఒక్కొక్కరు, రాష్ట్ర కౌన్సిలరుగాయున్న శాసన మండలి సభ్యులు కార్యవర్గ సభ్యులుగా ఉందురు. ఆఫీసు బేరర్ల సంఖ్యను, కార్యవర్గ సభ్యుల సంఖ్యను ప్రతి సంవత్సరము నూతన కౌన్సిలు ఖరారు చేయును.

11. 9 వ చాప్టరు_3 వ అంశమును ఈ క్రింది విధముగా సవరించవలెను.

సమితి లేక పట్టణ కౌన్సిలులోని మొత్తము సభ్యులలో ప్రతి అయిదు మందికి దాని ప్రాతినిధ్యమునకు ఒకరు చొప్పున వారి నూతన కౌన్సిలు సమావేశములలో జిల్లా శాఖ కౌన్సిలు సభ్యులను దామాషా పద్ధతిలో ఎన్నుకొనవలెను.

12. 9 వ చాప్టరులో 8 వ అంశము ఈ క్రింది విధముగా సవరించవలెను.

8. జిల్లా శాఖ సబ్ కమిటీగా ఉందురు. రాష్ట్ర కార్యవర్గములో క్రింది శాఖల ప్రతినిధులకు అనుసరించిన సూత్రమే జిల్లా శాఖకుగూడా వర్తించును.

13. 10 వ చాప్టరు 6 వ అంశములో చివరి వాక్యము ఈ క్రింది విధముగా యుండవలెను.

ఫెడరేషన్ నియమములే కార్యవర్గ సభ్యుల ఎన్నికకు వర్తించును.

14. 10 వ చాప్టరు_4 వ అంశము "అన్ని సెంటరులకు"అను మాటలకు బదులు "అన్ని టి. ఎ. సెంటరు ప్రాంతములకు" అను మాటలను చేర్చి సవరించవలెను.

15. 11 వ చాప్టరు_2 వ అంశము "హైస్కూలులలోని"అను మాటలు తొలగించి వాటికిబదులుగా "అన్ని పాఠశాలలు, జూనియర్ కాలేజీలలోని" అను మాటలు చేర్చి సవరించవలెను.

16. 12వ చాప్టరు 4(అ) అంశము "ఫెడరేషన్ మహాసభ" అను మాటల తర్వాత "రాష్ట్ర జనరల్‌కౌన్సిల్ సభ్యులు" అను మాటలను చేర్చవలెను.

12వ చాప్టరు 4(ఆ)లో పట్టణ తర్వాత సెంటరు తొలగించాలి. ఆఫీసు బేరర్లు తర్వాత సెంటరుశాఖ అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు అని చేర్చాలి.

17. 12వ చాప్టరు 4(ఇ)అంశము "సెంటరుశాఖల సభ్యులు" అను మాటలను తొలగించి, బదులుగా సెంటరు శాఖల కార్యవర్గ సభ్యులు అని చేర్చవలెను.'

18. 15వ చాప్టరు తదుపరి "16 అనుబంధము" అను చాప్టరు నమోదు చేయవలెను.

19. 16వ చాప్టరు_1,2 అంశములుగా ఈ దిగువ విధముగా నమోదుచేయవలెను.

1. యు. టి. ఎఫ్. జాతీయ, అంతర్జాతీయ ఉపాధ్యాయ సంఘాలతో అనుబంధము కలిగియుండును.

2. రాష్ట్రములో ఉపాధ్యాయ సంఘాల కో _ ఆర్డినేషన్ సంఘముగా నున్న ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ సంఘాల ఫెడరేషన్‌ను(ఫ్యాప్టో)కు తన స్వతంత్ర ప్రతిపత్తికి భంగము కలుగని విధముగా అనుబంధము కలిగియుండును.

20. జనరలు నిబంధనలు చాప్టరును 17వ చాప్టరుగా పిలువవలెను.

21. 17వ చాప్టరు(జనరలు నిబంధనలు) 1 (అ) అంశము ముందు రోజును, తర్వాత రోజును "తొలగించి" ముందు, తర్వాత అను మాటలు చేర్చవలెను.

22, 17వ చాప్టరు (జనరలు నిబంధనలు)_1 (ఈ)అంశము "నాలుగు కార్యవర్గ సమావేశలకు తర్వాత యున్న మాట ఎక్కువను తొలగించి 'తక్కువ' అని చేర్చవలెను.

23, 17వ చాప్టరు (జనరలు నిబంధనలు) 2 (ఇ)అంశము చివరి వాక్యముగా "అట్టి సమావేశములలో తీసుకున్న నిర్ణయములు చెల్లవు" అని చేర్చవలెను.

24. 17వ చాప్టరు (జనరల్ నిబంధనలు) 6వ అంశము "తనిఖీ ఆడిట్" అను శీర్షికకు బదులు, అక్కౌంట్స్ నిర్వహణ_ తనిఖీ ఆడిట్ అను శీర్షికగా సవరించవలెను.

25. 17వ చాప్టరు (జనరలు నిబంధనలు) 6వ అంశము (అ), (ఆ), (ఇ)లను (ఆ), (ఇ) (ఈ)లుగా మార్చి పీటికపైన (అ) క్రింది విధముగా చేర్చవలెను.

(అ) అన్ని యు. టి. యఫ్. శాఖలు, జమా ఖర్చులకు సంబంధించిన దినసరి ఎక్కౌంట్, ఆవర్జా ఓచర్స్ ఫైలు, జమల రశీదు పుస్తకములు సక్రమముగా నిర్వహించవలెను.

26. 17 వ చాప్టరు (జనరలు నిబంధనలు)_7 వ అంశము (4) క్రింద ఈ దిగువ విధముగా చేర్చవలెను.

4. "ఈ నిబంధనావళికి యు. టి యఫ్. రాష్ట్ర సబ్ కమిటీ చెప్పిన వ్యాఖ్యానమే సరైనదిగా ఎంచబడును.

27. 17 వ చాప్టరు (జనరలు నిబంధనలు) 7 వ అంశము (5) క్రింద ఈ దిగువ విధముగా చేర్చవలెను.

నిబంధనావళితోపాటు "పాలసీ స్టేట్‌మెంట్"ను గూడ మార్గ

దర్శకముగా పెట్టుకొని అన్ని యు. టి. యఫ్. శాఖలు చిత్తశుద్ధితో అమలు జరుపుట విధిగా జరుగవలెను.

20 వ పేజీలో 2 వ అంశమునకు బదులు క్రింది శాఖ అధ్యక్ష, కార్యదర్శులలో పై శాఖ కార్యవర్గ సభ్యులు కానివారిని తప్పక పిలువవలెను.

28. 17 చాప్టరు (జనరలు నిబంధనలు) 8 వ అంశముగా "ఆస్తులు" అను శీర్షికను చేర్చవలెను. అందులో ఈ దిగువ విధముగా వుండవలెను.

8. ఆస్తులు : ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ యొక్కగాని, దాని అన్ని స్థాయిలలోని క్రింది శాఖలయొక్క గాని, స్థిర చరాస్తులన్నియు ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్‌కే చెందును. ఆయా ఆస్తులపై వచ్చు రాబడి, వాటిపై చేయు ఖర్చులకు ఆయా శాఖలే బాధ్యత వహించును. ఏ పరిస్థితిలోను రాష్ట్రశాఖ అనుమతి లేనిదే చేసిన అప్పులకు రాష్ట్రశాఖ బాధ్యత వహించదు ఆయా శాఖలు ఏ కారణముచేత రద్దు అయినా ఆయా శాఖలకు చెందిన స్థిర చరాస్తులను రాష్ట్రశాఖ అనుమతిలేనిదే ఎవ్వరు కూడా మార్పిడి చేయుటగాని, అనుభవించుటకు గాని వీలులేదు. ఆస్తులు రిజిష్టరు చేయించుకొనునపుడు ఆయా శాఖలు రాష్ట్రశాఖ అనుబంధ శాఖల ఆస్తులుగానే రిజిష్టరు చేయించుకొనవలెను.

### పాలసీ స్టేట్‌మెంటు – సవరణలు

1. పేజీ 4 విధానం శీర్షిక–2 వ అంశము "సెకండరీ" అను మాట తర్వాత "జూనియరు కాలేజీల" అను మాటను చేర్చాలి. *






ప్రకాశం జిల్లాకు :– కె. వి. నారాయణ, గ్రేడ్ 1 తెలుగు పండిట్, జడ్. పి. హైస్కూలు, మంత్రాలయం పోస్టు, ఎమ్మిగనూరు తాలూకా, కర్నూలు జిల్లా.

ఐ. వెంకటరెడ్డి, సెకండరీగ్రేడ్, పి. యస్. ఎలిమెంటరీ స్కూలు, కొండంపల్లి, రంగంపేట సమితి, పెద్దాపురం తాలూకా, తూ॥ గో॥ జిల్లా.

తూ. గో. జిల్లాకు :– బి. సంపత్‌రావు, డ్రాయింగ్ టీచర్, జడ్. పి. హైస్కూలు, చందర్లపాడు పోస్టు, నందిగామ తాలూకా, కృష్ణాజిల్లా.

గుంటూరు, కృష్ణాజిల్లాలకు :– కె. ఎస్. ఘన్నుసైదా, సెకండరీ గ్రేడ్, టి. డబ్ల్యు. ఎలిమెంటరీ స్కూలు, ఉప్పరెల్లి గ్రామం, పులిరాయుడుగూడెం పోస్టు, 534 311, ప॥ గో॥ జిల్లా.

కృష్ణాజిల్లాకు :– పి. వి. వి. యస్. వి. ప్రసాదరావు, సెకండరీగ్రేడ్, పి. యస్. ఎలిమెంటరీ స్కూలు, గోనేడపోస్టు, వయా–మాల్గాం–533433.

కె. సుధాకరరావు, సెకండరీగ్రేడ్, దాలిపాడు, అడ్డతీగల సమితి, తూ॥ గో॥

జి. సంతోషమ్మ, గ్రేడ్ II హిందీ పండిట్, జడ్. పి. హైస్కూలు, జానకిపురం, మధిర తాలూకా, ఖమ్మంజిల్లా.

కాకినాడ మునిసిపాలిటీకి :– కె. అరుణరావు, సెకండరీగ్రేడ్, యు. పి. యస్., అమలాపురం మునిసిపాలిటీ–533202.

ప॥ గో॥ జిల్లాకు :– వి. సరోజిని, గ్రేడ్ II తెలుగు పండిట్, పి. యస్, యు. పి. స్కూలు, వెల్లటూరు పోస్టు, వినుకొండ తాలూకా, గుంటూరు జిల్లా.

ఎ. రంగారావు, సెకండరీగ్రేడ్, దాలిపాడు పోస్టు, అడ్డతీగల సమితి, తూ. గో. జిల్లా.

చిత్తూరు జిల్లాకు :– సి. జగదీశ్, సెకండరీ గ్రేడ్, గండవరం పోస్టు–524317, నెల్లూరు జిల్లా.

## నేటి (వి) నాయకులు

కాఠిన్యాన్ని కడుపులో దాచుకొని
కారుణ్యాన్ని కవచంగా కప్పుకొని
నాల్కపై తేనె లొలకరిస్తూ
తియ్యతీపిగా పలుకుతున్నారు మన పాలకులు!
వాగ్దానాలెన్నో వల్లిస్తూ
అరచేతిలో వైకుంఠం చూపిస్తూ
అదే బెల్లమని.... అల్లమని
మోసగిస్తున్నారు.... మన (వి)నాయకులు!
ఈ వేషం ఎన్నాళ్ళు?
ఈ మోసం కొన్నాళ్ళే! (పి. ప్రమీల, చిత్తూరుజిల్లా.)




# సీరియల్

(గత సంచిక తరువాయి)

"వాటీజ్ యువర్ ఫాదర్ ?" అన్నాడు నాకేసి చూసి.

"మై ఫాదరీజె టీచర్.... నౌ హి ఈజ్ వర్కింగ్ యాజ్ హెడ్ మాష్టర్...." అన్నాను.

"మై ఫాదర్ ఈజ్ఎన్ అడ్వకేట్ సర్....". అందిఅరవింద.

"ఇఫ్ యూ డజంట్ మైండ్....వాటీస్ యువర్ కేస్ట్ ప్లీజ్ అన్నాడు.

"కేస్ట్ చెప్పడం అవసరమా ?"

"నో తెల్గూ ప్లీజ్!అయ్యాం రన్నింగ్ ఎన్ ఇంగ్లీష్‌మీడియం స్కూల్ ....సో యూ స్పీక్ ఇంగ్లీష్ ఓన్లీ....ఓకే?" అన్నాడు

"ఓ.కే. సర్" అన్నాను.

"సో యూ డజంట్ వాంట్ టు రివీల్ యువర్ కేస్ట్.ఓకే?"

మేమిద్దరమూ మాట్లాడలేదు.

"యువర్ నేటివ్ ప్లేస్ ప్లీజ్ ?"

"ఐ బిలాంగ్ టు దిస్ ప్లేస్ ఓన్లీ" అన్నాను.

"ఐ బిలాంగ్ టు కృష్ణా డిస్ట్రిక్ట్ ! బట్ మై ఫాదర్ సెటిల్డ్ హియర్" అంది అరవింద.

"ఓ ! యూ బిలాంగ్స్ టు కృష్ణా డిస్ట్రిక్ట్! ఐ ఆల్ సో బిలాంగ్స్ టు కృష్ణా డిస్ట్రిక్ట్, వెరీ గ్లాడ్ టు మీట్ యూ" అంటూ అరవిందతో షేక్‌హాండ్ చెయ్యబోతున్నట్లుగా చెయ్యి ముందుకు చాచాడు. అరవింద నిశ్చలంగా కూర్చుని ఉండటంతో "ఓ అయాం సారీ.... ఐ ఫర్‌గెట్స్ దట్ యూ ఆర్ వుమన్.... సారీ–" అన్నాడు వెంటనే తన చేతిని వెనక్కి తీసుకుని.

"అయాం అపాయింటింగ్ బోతాఫ్ యూ .... రేపే వచ్చి డ్యూటీలో జాయిన్‌కండి.... ప్లీజ్ హేండోవర్ యువర్ ఒరిజినల్స్...." అన్నాడు.

ఇద్దరమూ మా ఒరిజినల్ సర్టిఫికెట్స్ అతడి చేతికిచ్చాం. వాటిని తన ముందున్న డ్రాయర్లో పెట్టేశాడు.

"ఒరిజినల్స్ మాకవసరం వున్నప్పుడు ఇస్తారుగా" అన్నాను.

"రిఫెండ్స్ .... ఇవ్వడానికే ప్రయత్నిస్తాం .... మీ ఒరిజినల్స్‌తో మాకేం పని?"

"థాంక్యూసర్....వాటెబవుట్ అవర్ శాలరీ...." అన్నాను.

"శాలరీ....వాట్ శాలరీ....? మీ వర్కునిబట్టి మీ శాలరీ వుంటుంది. యూ వర్క్ హార్డ్ యూ గెట్స్ మోర్ శాలరీ...." అన్నాడు.

ఇంతలో ఫోను మోగింది.

"యూ కెన్ గో నౌ....జాయిన్ టుమారో.... హెడ్‌మాష్టర్ టైంటేబుల్ ఇస్తాడు.... తీస్కోండి...."

మేమిద్దరమూ బయటికొచ్చి మరోసారి ఒకరిమొహాలొకరం చూసుకున్నాం.

కాంగ్రాచ్యులేషన్స్ అరూ ! ఏదో ఒకటి....శాలరీ ఎంతో తెలీని ఉద్యోగం సంపాదించేశాం...." అన్నాను మెట్లు దిగుతూ–

"ఏం ఉద్యోగమో —అతడు మనతో రోజూ ఓ పదిగంటలు చాకిరీ చేయించుకొని ఓ వంద రూపాయలు మొహాన కొట్టేటట్టున్నాడు. బతకలేని వుద్యోగం—"

"బతకటానికి ఉద్యోగం—మరీఅంత తక్కువిస్తాడంటావా? "కనీసం రెండువందలైనా ఇవ్వడంటావా ?" అన్నాను.

"రెండు వందలా ? చచ్చినా ఇవ్వడు. ఇంతకుముందు ఈ స్కూల్లో పనిచేసిని ఓ అమ్మాయి చెప్పింది. అతడు ఎవరికైనా వంద, వందయాభైకంటె ఎక్కువ ఇవ్వడట"–అంది అరవింద.

"సరే చూద్దాం—ఊరికే కూర్చున్నదానికన్నా ఏదో ఒక ఉద్యోగం—నయంకదూ !" అన్నాను.

"అలా అనుకొని తృప్తిపడాల్సిందే"–అంది అరవింద.

"ఏదో రకంగా తృప్తి పడాల్సిందే– ఎం. యస్. సి. చదువుదామనుకున్నాం....బి. యస్‌సి.తో తృప్తిపడలేదూ .... ఓ లెక్చరర్ కాలేకపోతామా అనుకున్నాం. ఈ ప్రైవేట్ స్కూల్లో టీచర్‌గా దొరికింది ఇదయినా దొరికిందని తృప్తిపడాల్సిందే .... లేకపోతే ఈ ప్రపంచానికి గుడ్‌బై చెప్పెయ్యాలి....అంత సాహసం మనకు లేదు కాబట్టి ఇలా తృప్తిపడక తప్పదు....ఏమంటావే?"అన్నాను.

"అనటానికి మిగల్చకుండా అంతా నువ్వే అనేశాక నేనేమంటాను" అంది అరవింద.

"అది సరేగాని వాడి ఇంగ్లీషు చూశావా ఎంత దారుణంగా వుందో....'యూ డజంట్' అన్నప్పుడల్లా నాకు చెవులు మూసుకోవాలనిపించింది. వాడు ఇంత ప్రెస్టేజియస్ ఇంగ్లీషు మీడియం స్కూలు నడుపుతున్నాడు!"–

"వాడికి ఇంగ్లీషు వచ్చో రాదో ఎవరిక్కావాలే? డబ్బున్నవాళ్ళకు తమ పిల్లల్ని ఇంగ్లీషు మీడియం స్కూల్లో చదివించడం ఓ పెద్ద గ్లామర్. ఎంత ఫీజన్నా ఇస్తారు .... ఎంత డొనేషనన్నా కడ్తారు. అలాంటి డబ్బున్నవాళ్ళ ఇంగ్లీషు మీడియంమీది మోజును ఇలాంటి ఇంగ్లీషురాని వెధవలు ఎంతో క్లవర్‌గా ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నారు...." అంది అరవింద.

అలా మాట్లాడుకుంటూ మా ఇళ్ళకు చేరాము.

చాలాపనులు మొదటిసారి చేస్తున్నప్పుడు మనకు చాలా ఎక్సైటింగ్‌గా ఉంటుంది. మొదటిసారిగాకాలేజీకివెళ్ళినపుడు, మొదటిసారి స్టేజీఎక్కి ఉపన్యాసం ఇచ్చినపుడు, మొదటిసారి మనం రాసిన కథ యే పత్రికలోనన్నా ప్రింటయినపుడు....ఇలా ఎన్ని ఉదాహరణలైనా చెప్పొచ్చు. అలాగే ఉద్యోగంలో చేరిన మొదటిరోజు....

ఉదయం 9–30గంటలకు స్కూలు 8–30గంటలకే తయారై అరవింద ఇంటికెళ్ళాను. నేను వెళ్ళేటప్పటికి అది రడీగానే ఉంది. ఇద్దరమూ ఓ రిక్షాఎక్కి కొత్తూరులోవున్న నీల్‌కమల్ స్కూలు ముందు దిగాము.

బిలబిలమంటూ యూనిఫామ్ వేసుకున్న మల్లెపువ్వుల్లా నిగనిగలాడుతున్న చిన్నచిన్నపిల్లలు స్కూల్లోంచి బయటకు, బయట నుంచి స్కూల్లోకి పరుగెత్తుతున్నారు. అంతమంది చిన్నారి పాపల్ని ఒకేసారి చూడటం ఒక అద్భుత దృశ్యంగా వుంటుంది. వాళ్ళను చూస్తోంటే "పాపం, పుణ్యం, ప్రపంచమార్గం – కష్టం, సౌఖ్యం, శ్లేషార్థాలు–ఏమీ ఎరుగని పువ్వుల్లారా ! అయిదారేడుల పాపల్లారా!" అన్న శ్రీశ్రీ గుర్తొచ్చాడు.

సరిగ్గా 9–30కి ప్రార్థన. పిల్లలంతా వాళ్ళ వాళ్ళ క్లాసుల ప్రకారం లైనుకట్టి నిల్చున్నారు. డ్రిల్ మాస్టారు విజిలూది 'అటెన్షన్' అని అరిచాడు. పిల్లలంతా నిశ్శబ్దంగా మారిపోయి అటెన్షన్‌లో నిల్చున్నారు.

తర్వాత ఓ సీనియర్ క్లాసమ్మాయి "ఇండియా ఈజ్ మై కంట్రీ—ఆల్ ఇండియన్స్ ఆర్ మై బ్రదర్స్ అండ్ సిస్టర్స్"అని చదువుతుంటే మిగతా పిల్లలంతా ఆ అమ్మాయి ననుసరించారు. ఆ తర్వాత "జనగణమణ—" పాడారు.

డ్రిల్ మాస్టారు ఆర్డర్ ప్రకారం పిల్లలంతా వెళ్ళి ఎవరి క్లాసుల్లో వాళ్ల కూర్చున్నారు. మేం స్టాఫ్ రూంలోకెళ్ళాం.

టీచర్లంతా రిజిస్టర్లు, డస్టర్లు, చాక్‌పీసులు పట్టుకొని ఎవరి క్లాసుల్లోకి వాళ్ల వెళ్ళడానికి సిద్ధమౌతున్నారు. టీచర్లలో చాలా మంది చాలా చిన్న వయసువారే. సగం కంటే ఎక్కువమంది లేడీ టీచర్లే. హెడ్ మాస్టర్ స్థానంలో కూర్చున్న వ్యక్తి మమ్మల్ని చూసి "నిన్న అపాయింటయిన టీచర్లు మీరేకదూ ?" ఉన్నాడు.

"ఔను" అన్నాన్నేను.

"నా పేరు రాధాకిషన్– బి.ఏ., బి.ఇడి–ఈ స్కూల్లో హెడ్ మాస్టర్‌ను" అన్నాడతను చాలా వినయంగా, మర్యాదగా.

"గ్లాడ్ టు మీట్ యూ సర్" అన్నాం, నేను అరవింద ఒకేసారి.

రాధాకిషన్‌లో హెడ్‌మాస్టరు కుండాల్సిన లక్షణాలేవీ కనిపించలేదు. చాలా చిన్న వయసు– పాతికేళ్ళుంటాయేమో ! టినోపాల్ మార్కు వైట్ డ్రస్, ఇన్‌సర్టు వేసుకొని టైకట్టాడు.సన్నగా తెల్లగా చాలా ప్లెజెంట్‌గా వుంది అతని రూపం.

మీరు ఏ ఏ సబ్జెక్ట్సు చెబుతారో చెబితే మీకు టైంటేబుల్ ప్రిపేర్ చేసిస్తాను..." అన్నాడు హెడ్‌మాస్టరు.

"నేను ఇంగ్లీషు, సైన్సు,లెక్కలు చెప్పగలను" అన్నాన్నేను

"మీరూ?" అన్నాడు రాధాకిషన్ అరవిందకేసి చూసి.

తెలుగు, సోషల్, ఇంగ్లీష్...." అంది అరవింద.

వెరీగుడ్. మాకు ఈ సబ్జెక్టులు చెప్పేవారే కావాలి. ఇంటర్వెల్‌లో మీకు టైం టేబుల్ ఇస్తాను. ఈ పీరియడ్‌కి మాత్రం ప్రసన్నా, మీరు 6వ క్లాస్‌కి వెళ్ళండి. అరవిందా ! మీరు 5వ క్లాస్‌కెళ్ళండి. ఇపుడు 6కి ఇంగ్లీషే, 5 కి సోషల్ చెప్పండి." అన్నాడు రాధాకిషన్.

"అలాగే సార్" అన్నాన్నేను.

"పదండి, మీ క్లాసులు చూపిస్తాను..." అంటూ రాధాకిషన్ లేచాడు.

"నిన్న మేనేజర్‌గారు మిమ్మల్ని అపాయింట్ చేసినప్పుడు మీకుజీతంఎంతిస్తారోచెప్పలేదు మీకేమన్నా ఐడియావుందా"అన్నాను

"సారీ టీచర్....మేనేజర్‌గార్కి తప్ప ఎవరికెంత జీతం ఇస్తారో ఎవరికీ తెలీదు...." అన్నాడు రాధాకిషన్.

ఆ విషయాన్నిక పొడిగించాలనిపించలేదు.

హెడ్‌మాస్టారు మొదట నన్ను 6 th క్లాస్‌కు తీసుకెళ్ళి స్టూడెంట్సుకు పరిచయంచేసి వెళ్ళిపోయాడు.

పిల్లలంతా నిశ్శబ్దంగా, భయంభయంగా కళ్ళప్పగించి నాకేసి అదేపనిగా చూడసాగారు.

ఓ స్టూడెంట్ దగ్గరున్న ఇంగ్లీషు టెక్స్టుబుక్ తీసుకుని పాఠం చెప్పటం మొదలెట్టాను.

ఎప్పుడో తెలిసీ తెలియని వయస్సులో తప్ప టీచర్ని కావాలని నేనెప్పుడూ కలలుగనలేదు. చిన్నతనంలో యేడో, ఎనిమిదో తరగతి చదివే రోజుల్లో మా తమ్ముళ్ళని, మా ఇంటి చుట్టుపక్కలుండే మరికొంతమంది పిల్లల్ని నా ముందు కూర్చోబెట్టుకుని ఆ రోజుల్లో నన్ను బాగా ఆకర్షించిన ఆనాటి టీచర్లని అనుకరిస్తూ పాఠాలు చెప్పటం నాకెంతో సరదాగా వుండేది. ఒకసారి నేనలా టీచర్‌లా నటిస్తూ పాఠాలు చెప్పటం చూసిన మా నాన్నగారు 'చాలా మంచి టీచర్‌వయ్యే లక్షణాలు నీ దగ్గర పుష్కలంగా వున్నాయే !' అన్నాడు.

ఎంత చిన్న విషయాన్నైనా ఓపిగ్గా విడమర్చి, ఎన్నో ఉదాహరణలతో, వినేవాళ్ళను మధ్య మధ్య కొన్ని చిన్న చిన్న ప్రశ్నలడుగుతూ పసిపిల్లల కర్థమయ్యే చిన్న చిన్న జోక్స్‌తో టీచింగ్ అనేది వన్‌వే ట్రాఫిక్‌లా టీచరే బడాబడా వాగడం కాకుండా విద్యార్థుల్ని కూడా ప్రతిక్షణం మన టీచింగ్‌తో పాలుపంచుకునేలా చేస్తూ వాళ్ళను కూడా మనవెంట తీసుకెళ్తూ,పాఠం చెప్పడం అనేదిటీచర్‌కు విద్యార్థులకు మధ్య ఒక సంభాషణలా సాగిపోయేట్టుగా ఉండాలి. అలా పాఠం చెప్పడం నిజంగా ఒక కళ. ఆరోజు పాఠం చెప్పాక ఆ కళ కొద్దో గొప్పో ఉందని ఫీలయ్యాను. అందువల్లనే నేను పాఠం చెప్పడం మొదటిసారే అయినప్పటికీ ఇబ్బందిగా ఫీల్‌కాలేదు. పాఠం చెప్పటం అనేది నాకెంతో అప్రయత్నంగా, సహజంగా వచ్చేసింది.

బెల్ కొట్టగానే క్లాసులోంచి బయటకొచ్చి చాలా హాయిగా ఫీలయ్యాను. పిల్లలు కూడా నా టీచింగ్‌ను లైక్ చేశారని వాళ్ళ మొహాలే చెప్పాయి.

# ప్రశ్నోత్తరాలు

నిర్వహణ:– శ్రీ యన్. సీతారామాచారి

1. జి. యన్. కె. నిరీక్షణరాజు, ఆకివీడు. ప. గో. జిల్లా

ప్రశ్న:– నేను బి. ఏ. బియిడి యోగ్యతలు గలిగి తే1–2–78 నుండి 31–1–79 వరకునుగల సంవత్సరకాలము సి.బి.సి.యన్.సి. ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయుడుగా పనిచేసితిని జడ్.పి.ఉత్తర్వుల మేరకు ఈజిల్లాలో మొగలూరు పంచాయితీ సమితిలోగల "సరుకోడప" సమితిపాఠశాలలో జాయినుఅయి పనిచేసితిని. తదుపరి తే12.12.80న ఆకివీడు సమితి, "తరటావ" సమితి ప్రాథమిక పాఠశాలకు బదిలీ అయితిని. పైన తెలిపినట్లుగా, నాకు ఎయిడెడ్, మరియు సమితి సర్వీసుల మధ్య ఒక్కరోజుకూడా బ్రేకు ఆఫ్ సర్వీసు లేదు. నాకు "పే ప్రొటక్షను" ఇచ్చుటకు అవకాశము కలిగించు ఉత్తరువు లున్నచో తెలియపర్చండి.

జవాబు :– ఎయిడెడ్ సర్వీసునుండి పంచాయితీరాజ్ సర్వీసు నకు మారినప్పుడు "పే ప్రొటక్షను" కలిగించు జనరల్ ఉత్తరువులు ప్రస్తుతము యేమియులేవుగాని, ఎయిడెడ్ పాఠశాలనుండి సమితి పాఠశాలకు శ్రీమతి జి. బుచ్చమ్మగారికి ప్రభుత్వము స్పెషల్ కేసుగా "పే ప్రొటక్షను" కలిగిస్తూ జి. ఓ ఆర్. టి. నెం 1642 ఎడ్యుకేషన్ (హెచ్) డిపార్టుమెంటు తే 28–11–1980ను జారీ చేసింది. దీనిని 1981 సం॥ మార్చినెల "ఐక్య ఉపాధ్యాయ" 27 వ పేజీలో ప్రచురించాము– పరిశీలించండి. మీ సమితి బి. డి. ఓ. గారి ద్వారా ప్రభుత్వఎడ్యుకేషన్ డిపార్టుమెంటు సెక్రటరీగారికి పేప్రొటక్షను కొరకు దరఖాస్తుపంపి, దాని కాపీలను డి. యస్. ఇ. మరియు డి. ఇ. ఓ. గార్లకుగూడా తగు చర్యల కొరకు పంపండి.

2. శ్రీ జి. జయపాల్, ఆకివీడు, ప. గో. జిల్లా

ప్రశ్న:– సెకండరీగ్రేడు అసిస్టెంటుగా పనిచేస్తున్న నేను, దక్షిణభారత హిందీ ప్రచారసభ వారి "హిందీ విశారద" పరీక్షలో ఉత్తీర్ణుడనైతిని. అదనముగా నాకున్న యీ హిందీ యోగ్యతకు అదనపు అడ్వాన్సుఇంక్రిమెంటు నేను డ్రాచేయుటకు అవకాశమున్నదా? తెలియజేయండి.

జవాబు: లేదు, అట్లు మీరు డ్రాచేయు అవకాశము లేదు. సెకండరీగ్రేడు టీచర్లు అడ్వాన్సు యింక్రిమెంట్లు మంజూరు పొందుటకు యిందుకు సంబంధించిన జి. ఓ. లో అదనపు యోగ్యతలుగా "Graduate withS. g. BT," "Grduate with B. ed, Post graduate with MEd"లను నిర్ణయించి యున్నారు తప్ప హిందీ యోగ్యతలను నిర్ణయించి యుండలేదు జి. ఒ. యం. యస్. నెం. 928 ఏడ్యుకేషన్ తే 13–9–1977ను పరిశీలించండి.

3 శ్రీ ఆర్. వి. గున్నేశ్వరరావు, కొత్తపల్లి తూ. గో. జిల్లా

ప్రశ్న:- నేను ఎయిడెడ్ పాఠశాలైన కొత్తపల్లి ఆర్. టి. వి ఎ. అప్పరుప్రైమరీ స్కూలు హెడ్మాష్టరుగా పనిచేస్తున్నాను. బోనుప్రొక్చరుకు 8–1–81 నుండి 7–4–81 వరకును మూడునెలలు



"Commuted Medical leave" పెట్టుకున్నాను, నాకు యీ లీవు సదుపాయము యుండదని మా డి. ఇ. ఓ. గారి ఆఫీసులో అనుచున్నారు. నాకు యీ లీవు సదుపాయము వర్తించునా? వర్తించదా? తెలియజేయండి.

జవాబు: ఆంధ్రప్రదేశ్ ఎడ్యుకేషనల్ రూల్సులోని 168 వ రూలులో "The leave rules applicable to the teaching staff in schools under private management shall be those under the AndhraPradesh Leave Rules 1933 " అనియున్న ఆదేశము మేరకు ఆంధ్రప్రదేశ్ లీవు రూల్సు వర్తించగల మీకు అందులోని భాగమైన Commuted Medical Leave సదుపాయము తప్పక వర్తించగలదు. మీ డి.ఇ.ఓ. గారికి ఈ విషయమును తెలియజేసి శలవు మంజూరు పొందండి.

ప్రశ్న :– ది 17–3–81 నాటి ప్రభుత్వ మినిట్సులోయిచ్చిన జవాబులో "Orders are already issued in G.O. M.S. No. 590 Education Dt. 6-8-80 అనియును Relevant Rules for aid. relating to Elementary Schools will be amended " అనియును తెలియజేసియున్నారు గదా: జి.ఓ.యమ్. యస్. నెం. 590 ఎడ్యుకేషన్ తే 6–8–80లో తెలియజేసిన విషయమేమి? వివరించండి–

జవాబు:ఈ జి.ఓ ను 1980 సెప్టెంబరు ఐక్య ఉపాధ్యాయలో ప్రచురించాము. పరిశీలించండి– ఇందులో ఆంధ్రప్రదేశ్ ఎడ్యుకేషనల్ రూల్సులోని 168వ రూలు ననుసరించి ప్రైవేటు మేనేజిమెంటు క్రిందనున్న ఉపాధ్యాయులకు ఆంధ్రప్రదేశ్ లీవు రూల్సు వర్తించుననియును, తీవ్రవ్యాధుల విషయంలో ప్రభుత్వం జి.ఓ. యం.యస్– 30243 ఫైనాన్సు, తే 29–8–75 ఓ.ఓ.యమ్. యస్ నెం. 386 ఫైనాన్సు తే 6–9–76 జి. జి. యమ్. యస్. నెం. 449 ఫైనాన్సు అండ్ ప్లానింగు తే 28–10–76 జి.ఓ.యమ్.యస్. నెం.20 ఫైనాన్సు అండ్ ప్లానింగు తే 25–1–77ల ద్వారా జారీ చేసిన శలవు సౌకర్యములు అనగా ఆంధ్రప్రదేశ్ లీవు రూల్సునకు సంబంధించిన యీ ఉత్తరువులు గవర్నమెంటు, మునిసిపాలిటీ, పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులు మరియు ప్రయివేటు మేనేజిమెంట్ల క్రింద పని చేస్తున్న ఉపాధ్యాయు లందరికిని వర్తించగలవని యీ జీ. ఓ. వివరణ యిస్తున్నది. పరిశీలించండి.

# దాపులోనున్న గమ్యం

(స్కెచ్) — కె. యస్

ఒకనాటి రాత్రి
పడవ ప్రయాణం
నది కడ్డుగా నిలిచిన కొండ
కొండను చుట్టి ప్రవహిస్తున్న నది
పర్వతపంక్తుల క్రింద వెలుతురు
కాంతివంతంగా ప్రకాశిస్తున్న వెలుతురు-దగ్గరలోనున్నట్లున్న వెలుతురు.

"అమ్మయ్య: గమ్యం దాపులో వుంది" అన్నాను నిట్టూరుస్తూ
'అది చాలా దూరంగా వుంది' - వెలుగువైపు చూస్తూ నావికుని జవాబు

నాకు నమ్మకం కుదరలేదు.
చీకటిని చీలుస్తూ తేజోవంతంగా ప్రకాశిస్తున్నది వెలుతురు
.... కాని అతడు చెప్పింది నిజమే.
వెలుతురు దూరంగానే వున్నట్లు నిర్ధారణ అవుతున్నది.
అవును చీకటిలో వుండి చూస్తుంటే వెలుగు అలాగే కన్పిస్తుంది.

దగ్గరో వున్నట్లుంటుంది-ఆశలు రేకెత్తిస్తుంది
కొద్ది నిమిషాల్లో గమ్యం చేరగలమని పిస్తుంది.
—కాని వెలుతురు ఇంకా దూరంగానే వుంది.
కారుచీకటిలో నదిలో చాలా చాలా దూరం ప్రయాణంచేశాం
రాళ్ళగుట్టలు, సుడిగుండాలు, యిసుకదిబ్బలు చేరువవుతున్నాయి, దూరమవుతున్నాయి.
వెలుతురుదేదీవ్యంగా ప్రకాశిస్తున్నది-మార్గం చూపిస్తున్నది.
-దగ్గరలో ఉన్నట్లుంది. కాని యింకా దూరముంది.
కొండరాళ్ళ నొరసికొని పారేనది-తేజోవంతమైన కాంతి
ఎప్పుడూ నా స్మృతిపథంలో మెదులుతుంటాయి.
అంతకు ముందు ఆ తరువాత నాలో యితరులలో
వెలుగు సామీప్యతలో ఆశలను రేకెత్తిస్తూంది.
కాని జీవితం తీరాల నొరసికొని ప్రవహిస్తూనే వుంది.
వెలుతురు అల్లంతదూరాన వుంది.
తెడ్లను బలంగావేసి ముందుకు పోవలిసిందే.
వెలుతురు ఎండమావి కాదు.
ఆది కన్పిస్తున్న నిజం : చేరబోతున్నగమ్యం!






1. భారత దేశంలో అస్సామీ, బెంగాలీ, గుజరాత్, హిందీ, కన్నడ, కాశ్మీర, మళయాళ, మరాఠీ, ఒరియా, పంజాబీ, సంస్కృతం, సింధీ, తమిళం, తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు ముఖ్యమైన భాషలు. ఇవి కాకుండా 1652 భాషలు [లిపిలేనివి] దేశంలోని వివిధ ప్రాంతాలలో మాట్లాడు కుంటారు. దేశంలో హిందీ మాట్లాడేవారి సంఖ్య తర్వాత తెలుగు వారిదే పైచేయి.

2. జలాలే ఫసలీ 1079లో షహిన్ షా మనిక్షా సింహాసనాన్ని అధిష్టించి ఒక గొప్ప జ్యోతిషాలయం స్థాపించాడు. ప్రముఖ రుబాయత్ లు వ్రాసిన ఉమర్ ఖయాం అందు ప్రధానాచార్యుడై మొట్టమొదటి సారిగా క్యాలండర్ కనిపెట్టాడు.

3. రోదసిలో ఇప్పుడు 11 వేల మానవ నిర్మిత ఉపగ్రహాలు పరిభ్రమిస్తున్నాయి. వీటిలో సగం గూఢచార ఉపగ్రహాలే. శత్రు దేశాల సైనిక శక్తిని, వారి చర్యలను, సైనిక రహస్యాలను, ఎప్పటి కప్పుడు గమనించడానికి ప్రయోగించ బడ్డాయి. ప్రపంచంలోని అన్ని దేశాల కంటె అమెరికా, రష్యాలే అత్యధిక సంఖ్యలో ఉపగ్రహాలను పంపాయి.

4. రోదసిలో ఇప్పుడు 800 ఉల్కాశకలాలు పరిభ్రమిస్తున్నాయి. వీటిలో ఏ ఒక్కదానికైనా భూమినోసారి ముద్దు పెట్టుకుందాం అని కోరిక గలిగితే భూమండలం కనీసం సగం ధ్వంసమై పోతుంది. దీన్ని బట్టి ఒక శకలం ఎంత పెద్దదో, శక్తివంతమైందో ఊహించుకోవచ్చు. ఇవేకాకుండా రోదసిలో కొన్ని లక్షల గులకరాళ్ళు కూడా అటూ యిటూ షికార్లు కొడుతున్నాయి. ఇవి మహా అయితే ఓ నగరాన్నో, ఒక ప్రాంతాన్నో పూర్తిగా తుడిచి పెట్టేస్తాయి. పొరపాటున యివి భూమి కక్ష్యలోకి వస్తే అవి భూమిని తాకబోయే లోపలే దారిలోనే వాటిని పేల్చివేయాలని అమెరికాలోని అంతరిక్ష సంస్థ నాసా ప్రయత్నాలు ప్రారంభిస్తున్నది.

5. అంతరిక్షంలోకి ఉపగ్రహాలను పంపిన దేశాలలో సోవియట్ యూనియన్, అమెరికా, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సు, చైనా, ఇండియా, జపాన్ ముందుగా చెప్పుకోవచ్చు. ఒక్కొక్క ఉపగ్రహ నిర్మాణానికి సుమారు 350 కోట్ల రూపాయలు ఖర్చవుతాయి.

6. మనదేశం శ్రీహరికోట రాకెట్ కేంద్రంలోపనిచేస్తున్న శాస్త్రజ్ఞులు అందరూ 30 ఏళ్ళు దాటని వారే. ఎస్ ఎల్ వి-3 ప్రయోగాల్లో రెండేళ్ళకన్నా తక్కువ కాలంలో ప్రగతిని సాధించిన శ్రీహరికోట రాకెట్ కేంద్రం మన దేశానికే గర్వకారణం.




# రాజధానిలో రాయబారాలు

యు. టి. యఫ్. పక్షాన హైద్రాబాదులో 1981 సెప్టెంబరు 3, 4, 5, తేదీలలో వివిధ ప్రభుత్వ అధికారులను మంత్రులను కలిసి మహాసభ ఆమోదించిన 70 తీర్మానములు అందజేయటం జరిగింది. అనేక జనరల్, వ్యక్తిగత సమస్యలపై మెమోరాండములు యిచ్చి చర్చించటం జరిగింది. వారిలో విద్యాశాఖ, పంచాయితీరాజ్ శాఖామంత్రులు, విద్య పంచాయితీరాజ్, ఆర్థిక తదితర శాఖల కార్యదర్శులు, హయ్యరు ఎడ్యుకేషన్, స్కూలు ఎడ్యుకేషన్ డైరెక్టర్లు గలరు.

నెలల తరబడి జీతాలులేక యిబ్బందులు పడుతున్న ఏజన్సీ ఉపాధ్యాయులకు, ఎయిడెడ్ ఉపాధ్యాయులకు నర్సపూర్ మునిసిపాలిటీ ఉపాధ్యాయులకు, వెంటనే జీతాలు చెల్లించే ఏర్పాట్లు చేయాలని, 10వ తరగతికి 7వ తరగతికి పెంచిన స్పాట్ వాల్యుయేషన్ గ్రాంట్లు విడుదల చేయాలని, మైసూర్ భాషా శిక్షణ పొందిన వారి గురించి విడుదల చేసిన ఉత్తర్వులు అందరికి అందజేయాలని, యన్. జి.వో లకు పెంచిన 3 రోజుల సి. యల్. టీచర్లకు కూడా వర్తింపజేయాలని. ఫెడ్టో పిలుపుపై ధర్నా చేసినకాలం వరంగల్ లో డ్యూటీగా గుర్తించాలని, వరంగల్ లో అనవసరంగా రికగ్నిషను రెన్యూలు చేయుటలో కల్పించిన అడ్డంకులు తొలగించాలని, శ్రీమతి సుబ్బలక్ష్మి, రాయన్న, శ్రీరామమూర్తిగారల సమస్యలు వెంటనే పరిష్కరించాలని, పండిట్స్‌కు ట్రయినింగుతో నిమిత్తం లేకుండా రెగ్యులరైజేషన్‌కు ఉత్తర్వులు యివ్వాలని, వెంకటరెడ్డిపల్లి ఉపాధ్యాయు జీతాలు చెల్లించాలని, జూనియర్ లెక్చరర్లకు యిచ్చిన హామీలు వెంటనే అమలు జరపాలని, నెల్లూరు డి.యి.ఓ. ఆఫీసులోని అక్రమాలు అరికట్టాలని, సెలక్షన్ గ్రేడు ఫికేషనును తరువాత స్టేజీలో చేయుటకు వెంటనే ఉత్తర్వులు యివ్వాలని మొదలగు సమస్యలపై మెమోరాండములు యిచ్చి చర్చించటం జరిగింది.

ఏజన్సీ, ఎయిడెడ్ నర్సపూర్ మునిసిపల్ ఉపాధ్యాయుల గ్రాంటు విడుదలకు తగు చర్యలు గైకొనిరి. మరికొన్ని ఉత్తర్వులు యిచ్చిరి. మిగిలినవి త్వరలో పరిష్కరించగలమని తెల్పిరి. త్వరలో యు. టి. యఫ్‌తో సమన్వయ సమావేశం వేయగలమని తెల్పిరి.

రాయబారాలలో శ్రీయుతులు డి.రామిరెడ్డి, ఎ. వెంకటస్వామి జి. లక్ష్మయ్య పి. సత్యనారాయణ, యస్. ఆర్. పోలిశెట్టి, యం. నరహరి మొదలగు వారు పాల్గొనిరి.

---

**ఐక్య ఉపాధ్యాయ !**
**చదవండి !!**
**చదివించండి !!!**
**సంవత్సర చందా రు. 12-00**

---



# శ్రద్ధాంజలి

చిరకాలంగా కృష్ణాజిల్లా ఉపాధ్యాయ ఉద్యమంలో పని చేస్తున్న ముఖ్యకార్యకర్త శ్రీ సూరపనేని సత్యనారాయణ ఆగస్టు 25న హైదరాబాద్ లో గుండెపోటుతో ఆకస్మిక మరణానికి గురయ్యారు. వారి స్మారకసభ రాష్ట్రశాఖ ఉపాధ్యక్షుడు శ్రీ కె. నారాయణరావు అధ్యక్షతన విజయవాడ, చెన్నుపాటిభవన్ లో పట్టణశాఖ ఆధ్వర్యాన సెప్టెంబరు 6న జరిగింది. జిల్లా యు. టి. యఫ్. శాఖ ఉపాధ్యక్షుడుగా అయిన గతంలో సంఘ బాధ్యతల్ని నిర్వహించాడనీ, సెకండరీ రంగంలో ఉద్యమవ్యాప్తికి విశేషకృషిచేశాడని, ఆదర్శోపాధ్యాయుడుగా అందరిమన్నల్ని పొందాడనీ పలువురు వక్తలు అయన సేవల్ని ప్రస్తుతించి శ్రద్ధాంజలిఘటించారు.

---

Grams : "PADMATYPE" PHONE : 512

# SRI VENKATESWARA
# Technical Agriculture Training College

POST BOX NO : 30

## CHILAKALURIPET - 522 616

GUNTUR (Dt.)

S. S. C., INTER విద్యార్థులారా !

### ఫెయిలయిన సబ్జక్టులలో ఉచిత శిక్షణ

1981 జులైలోకాని మరి ఏ సంవత్సరములోనైనా S.S.C., INTER ఫెయిలైన విద్యార్థినీవిద్యార్థులకునుమరియు 7th Class నుండి 8th, 9th S.S.C INTER, Degree వరకు ఏ ఒక్కటి ఏ సంవత్సరములోనైనను పూర్తిచేసి ప్రస్తుతము ఖాళీగా ఉన్న విద్యార్థినీ విద్యార్థులకు ఈ క్రింది ప్రభుత్వ ఉద్యోగములలో నియమింపబడుటకు అగ్రికల్చర్ కోర్సునందు రెండు నెలలు శిక్షణ యివ్వబడుచున్నది. ఈ శిక్షణ పూర్తయిన వెంటనే రాష్ట్రసాంకేతిక విద్యాశాఖవారు నిర్వహించు పరీక్షలకు హాజరుకావచ్చును.

ఉద్యోగములు-: 1) Field Man 2) Field Asst 3) Tech Asst 4) Sub Asst ఇవిగాక పంచాయితీ సమితుల యందు, షుగర్ ఫ్యాక్టరీల యందు గల అనేక ఉద్యోగములకు అర్హతలభించును ఉద్యోగము పొందిన ప్రతి విద్యార్థికి రాష్ట్ర ప్రభుత్వ స్కేలు ననుసరించి రు. 450/- నుండి రు. 650/- వరకుఇవ్వబడును.

ఉచితములు :- మా సంస్థనుండి శిక్షణ తీసుకొను ప్రతి విద్యార్థికి భోజనము, హాస్టలు, పుస్తకములు ప్రతి నెల స్టయిఫండ్ మరియు ప్రత్యేకమైన మెరిట్ స్కాలర్ షిప్స్ ఇవ్వబడును. ఇవి గాక టైపు, షార్టుహేండ్ నేర్పబడును. ఈ సం॥ నందు S.S.C, Inter fail అయిన విద్యార్థినీ విద్యార్థులకు ఈ మా యొక్క అగ్రికల్చర్‌తో పాటు fail అయిన సబ్జక్టుల యందు ప్రత్యేక ఉచిత శిక్షణ ఏర్పాటు చేసినాము. ఇట్లు చేయుట వలన అటు తరగతి పరీక్షలను ఇటు సాంకేతిక పరీక్షలను ఒకే సారిపూర్తి చేయుటకు అవకాశము గలదు.

స్త్రీలు : వీరికి ప్రత్యేకమైన హాస్టలుకలదు. పై వసతులు అన్నియు వీరికినీ కల్పించబడినవి. శిక్షణాకాలములో వీరికి కుట్టు పనులు, అల్లికలు, ఎంబ్రాయిడరీ, టైలరింగ్ మొదలగునవి ఉచితముగా నేర్పబడును.

POSTAL TUTION ;- ప్రతి సంవత్సరము మా సంస్థ నుండి 200 మంది విద్యార్థులు ఈ అవకాశమును వినియోగించుకొనుచున్నారు. ప్రస్తుతము ఉద్యోగము చేయువారు, ఇచ్చటకు రాలేని విద్యార్థినీ, విద్యార్థులకు ఇది చాలా చక్కని అవకాశము. మరియు విద్యార్థులకు ఫీజు అందుబాటులో ఉండు విధముగా ఏర్పాటు చేసినాము.

ప్రస్తుత విద్యా సంవత్సరము నుండి ఉపాధ్యాయులయొక్క పిల్లలకు 1981 జూన్ నుండి వారి వారి జీతములను బట్టి మరియు SC/ ST/ BC విద్యార్థులకు సగము ఫీజు హాస్టలు, హోస్టలు నందు మినహాయింపు ఇవ్వబడినది.

గత 5సంవత్సరముల నుండి ఎందరో విద్యార్థినీ విద్యార్థులకు శిక్షణ ఇచ్చి మనరాష్ట్రములో అనేక ఉద్యోగములు పొందుటకు పైఅవకాశములు కల్పించిన ఏకైక సంస్థ మాది. గత సంవత్సరము మా కళాశాల నుండి ప్రభుత్వ పరీక్షకు వెళ్ళిన విద్యార్థులు 95% ఉత్తీర్ణత పొందియున్నారు.

కనుక పై ప్రభుత్వ ఉద్యోగములు చేయదలచినవిద్యార్థినీ విద్యార్థులు పై మాఅడ్రసుకు ఈప్రకటన వెలువడిన 10 రోజులు లోగా రు 4/- M.O ద్వారా పంపి అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టసును పొందవచ్చును.

ప్రిన్సిపాల్

# సోషలిస్టుపథంవైపు నడిపే విద్యా విధానం కావాలి!

### ఉపాధ్యాయుల కర్తవ్యాల్ని నిర్దేశిస్తూ భీమవరం విద్యాసదస్సులో

## శ్రీ మోటూరు హనుమంతరావుగారి ప్రసంగం



దేశాన్ని సోషలిస్టుపథంవైపు నడిపించే శాస్త్రీయ విద్యావిధానం కావాలని, నేటి విద్యావిధానం కులమతతత్వాలను, ప్రాంతీయ దురభిమానాలను, జాతి విద్వేషాలను రెచ్చగొట్టేదిగా ఉన్నదని, ఉపాధ్యాయులు పాఠ్యాంశాలకే పరిమితంగాకుండా, సమాజ అభివృద్ధికి తోడ్పడే ఇతర విషయాలనుకూడా విద్యార్థులకు తెలియజెప్పి వారిలో చైతన్యం కల్గించాలని, జాతి నిర్మాతలుగా, భావి పౌరుల్ని తీర్చిదిద్దేవాళ్ళుగా ఇది ఉపాధ్యాయులందరి కర్తవ్యమని భీమవరం విద్యామహాసభల సందర్భాన జరిగిన విద్యాసదస్సులో శ్రీ మోటూరు హనుమంతరావు ఉద్బోధించారు.

### మహాసభల ప్రత్యేకత

మహాసభల ప్రత్యేకతను ప్రశంసిస్తూ వారిలా అన్నారు. రాష్ట్రమంతటి నుండి వేలాది మంది యు.టి.యఫ్. పతాక క్రింద సమీకరింపబడటం నాకు ఆనందంగా ఉంది. ప్రత్యేకించి వృత్తిసంబంధమైన మీ సమస్యల పైననేగాక, మన అందరి ముందున్న జాతీయ కర్తవ్యాన్ని గురించి చర్చించబూనుకోవటం, ఆసందర్భంలో మాబోటి వాళ్ళ అభిప్రాయాలడగటం మరింత సంతోషంగా ఉంది అన్నారు.

### మౌలిక మార్పు అవసరం

మార్పు అవసరాన్ని గురించి చెపుతూ ఉపాధ్యాయుల హక్కులకో లేక విద్యార్థుల హక్కులకో పరిమితమై దేశం బాగుపడదనీ, అందువల్ల అంతకుమించి మనం ఆలోచించటం తప్పనిసరి అని నేడు 'మార్పు' అవసరమని అన్ని పక్షాలవాళ్ళు అంటున్నారని, అయితే ఎటువంటిమార్పుకావాలో మనం స్పష్టపరచుకోవాలనిఅన్నారు

ఈ విషయమై డోలాయమాన స్థితిలోవున్న మేధావుల ఆందోళనను ప్రస్తావిస్తూ 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో దావి ఎడిటర్ ఫ్యూచర్ ఆర్టికల్ వ్రాస్తూ' ధరలు పెరుగుతున్నవి, ద్రవ్యోల్బణం పెరుగుతున్నది, నిరుద్యోగం పెరుగుతున్నది....ఎన్ని జరిగినా ఈ సమస్యలకు పరిష్కారం కన్పించటంలేదు....ఈ దేశం బాగుపడాలంటే ఒక విప్లవమో....ఒక పెద్ద తిరుగుబాటో రావాలి....కాని అది వచ్చే దశ ఇప్పట్లో లేదు. ఏం చేద్దామ'ని నిస్పృహతో కూడిన అభిప్రాయాన్ని ఆయన వెలిబుచ్చాడు. నిహాల్‌సింగ్ లాంటి వాళ్ళకే ఆ విధంగా తోచిందీ అంటే....ఈ దశలో మార్పు జరగాల్సిన అవసరాన్ని వేరే చెప్పనక్కరలేదు.

ఇంతకీ యీ దేశం మార్పు కోరుతోంది. ఈ సమాజం మార్పు కోరుతోంది. పాత వ్యవస్థ స్థానే క్రొత్త వ్యవస్థ వస్తేతప్ప భవిష్యత్తు లేదనీ, ప్రజలకు నిష్కృతి లేదనేది అందరి భావంగా ఉంది, అంటూ మార్పు అవసరాన్ని నొక్కిచెప్పారు.

### తీరని ఆశలు - ఫలింపని ఆశయాలు

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని అనేక త్యాగాలు చేసిన దేశభక్తుల్ని, వారి ఆశయాన్ని, ఆశల్ని ప్రస్తావించి ఈ ప్రాంతంలో పుట్టి బానిస విధానంపైన తిరుగుబాటు చేసిన అల్లూరి సీతారామరాజు, దేశభక్తుడుగా ప్రసిద్ధిగాంచిన దండు నారాయణరాజు అలాగే బాల్యం నుండి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ఉద్దరాజు రామం-వీళ్ళంతా ఆశించిన దేమిటి? ఏ ఆశయాల కోసం ఈ దేశభక్తులు పోరాడేరు? అవేమైనా నెరవేరాయా? అని ప్రశ్నించి ఇంకా ఇలా అన్నారు.

వాళ్ళ ఆశలు నెరవేరలేదు. ఆశయాలు ఫలించలేదు. తద్భిన్నంగా నేడు 34 ఏళ్ళ స్వాతంత్ర్యం తర్వాత కూడా దుర్భర దారిద్ర్యంతో....అనేక అనర్థకాలతో దేశం కుమిలిపోతున్నది, క్రుంగిపోతున్నది. జాతీయోద్యమం ఆశించిన విశాల దృక్పథం....సుఖమయ స్వేచ్ఛా ప్రపంచం గగన కుసుమమైపోయింది. కుల మత జాతి విచక్షణలూ, ప్రాంతీయ దురభిమానాలూ పెచ్చరిల్లిపోతున్నాయి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఆనాడు జనాభా ఎంతవుందో....ఈనాడు నిరక్షరాస్యులు అంతకంటె ఎక్కువ ఉన్నారు. రోగిష్ఠులూ అంతే....నిషదరిద్రులూ అంతే....

కాన ప్రస్తుత వ్యవస్థ మారితీరితే తప్ప ఎవరికీ సుఖసంతోషాలుండవనేది స్పష్టమవుతున్నది. దాన్ని విప్లవమనండి, పెద్ద మార్పు అనండి....ఏ పేరు పెట్టినా మౌలికమైన మార్పు మాత్రం అవసరం...

### కబుర్లతో కడుపునిండుతుందా?

ప్రస్తుత పాలకుల మాటలు మాత్రం కోటలు దాటుతున్నాయి గాని...కాళ్ళగడపలు దాటటం లేదని వివిధ ఉదాహరణలిస్తూ ఇలా అన్నారు.

మార్పులు చేస్తున్నామని అందరికంటె మించి కబుర్లు చెప్తున్నారు మన పాలకులు. దేశాన్ని ఉద్ధరిస్తున్నామంటున్నారు. కాని ఆచరణలో మిగిలిన విషయాల సంగతి అటుంచి విద్యారంగం సంగతే తీసుకొంటే వీళ్ళు సాధించిందేమిటి? తెచ్చిన మౌలిక మార్పుఏమిటి?

'పది సంవత్సరాలలో అందరికీ చదువు' 34 ఏళ్ళ తర్వాత మళ్ళీ వాగ్దానం, దాన్నిబట్టే మనం గ్రహించవచ్చు. ఈ రోజుకు అందరికీ చదువులేదని. 84 శాతం బళ్ళలో చేరుతున్నారు. పదో తరగతికి వచ్చేలోగా ఎందరో చదువు మానుకొంటున్నారు. చివరిదాకా మిగిలినవాళ్ళు చాలా తక్కువ. వచ్చే 5 సం॥లలో 95శాతం పిల్లల్ని బళ్ళో చేర్పిస్తారట. ఇలా ఉన్నవి వీళ్ళ కబుర్లు. ఆశించిన ఆశయం నెరవేరలేదనేది దీన్నిబట్టి రూఢి అవుతున్నది.

ఇక మార్పుసంగతి చూద్దాం. బ్రిటిష్ పాలకులు తమ స్వార్థ ప్రయోజనాల కనుగుణంగా తమ దోపిడీకి పనికివచ్చే విద్యనే నేర్పారనేది మనకు తెలుసు. అయితే ప్రస్తుత పాలకవర్గం 34 ఏళ్ళల్లో తెచ్చిన మార్పు నాకు కన్పించటం లేదు. ఇదీ ప్రత్యామ్నాయ – విద్యా విధానం.. ఇదివరకటికంటె భిన్నమైనదని చెప్పుకొనేదికూడా ఏమీలేదు.

## అసమగ్ర విద్యాబిల్లు

సమగ్ర విద్యాబిల్లు అన్నారు. అది ఎంత అసమగ్రంగా ఉన్నదో మీరే చూశారు. దీంట్లో అన్ని స్కూళ్ళను ఒకే మేనేజిమెంటులోకి తెచ్చే పద్ధతిగాని, ఎయిడెడ్ టీచర్లకు సూటిగా జీతం వచ్చే సదుపాయంగాని, మైనారిటీ మేనేజిమెంట్లలోని టీచర్లకు రక్షణలుగాని లేవు. ఆపైన కొన్ని అభివృద్ధికరభావాలుంటే ఉద్యోగులకు ఉద్వాసనచెప్పే క్లాజు చేర్చారు. మేనేజిమెంట్లకు ఈ సాకుచూపి ఉపాధ్యాయులమీద దాడిచేసే అవకాశం కల్పించారు.

## పనికిమాలిన పాఠ్యాంశాలు

పోనీ జాతీయాశయాల కనుగుణంగా విద్యార్థుల్ని బాగుచేయటానికి పాఠ్యాంశాలు రూపొందిస్తున్నారా అంటే అదీలేదు. కులమత తత్వాల్ని, ప్రాంతీయ దురభిమానాల్ని రెచ్చగొట్టే పనులు చెయ్యగూడదని చెప్పే ఒక్క పాఠ్యాంశంకూడా లేదు. ఆపైన గాంధీ కోమటైపుట్టాడని, నెహ్రూ బ్రాహ్మణుడై పుట్టాడనీ ప్రతిదీ కుల ప్రసక్తే.

పబ్లిక్ స్కూల్లో పెట్టిన 9వ తరగతి పుస్తకం చూశాను. అందులో శృంగార నైషధం పాఠం ఉంది. యవ్వనంలో స్త్రీ పురుషులు కన్ను మీటుకోవటం దగ్గర నుండి .... తలుపు సందుల నుండి చూసుకోవటం దగ్గరనుండి.... వెన్నెల రాత్రులూ, చీకటి రాత్రులూ, వాళ్ళ సరసాలూ– ఇవీ దానిలో వర్ణనలు.

అలాగే 'పదివేలు' అనే మరో పాఠం. ఓ దోపిడీ ముఠా నాయకుడు ఓ కుర్రవాణ్ణి ఎత్తుకుపోయి....పదివేలిస్తేనే స్వాధీనం చేసామంటాడు. తండ్రి ఇవ్వనని పెనుగులాడతాడు. తల్లి పదివేలు పోతేపోయినయ్..,.బిడ్డను తీసుకురండి అంటుంది ఈ పాఠ్యాంశం ఏ నీతిని బోధించటానికి ప్రవేశపెట్టినట్లు ?

మహోన్నతమైన ఆశయాలకు నిలబడటం....మంచికోసం ప్రాణాల్ని సైతం త్యాగం చేయటం... ధర్మానికి కట్టుబడి ఉండటం... అందరినీ సమానంగా గౌరవించటం.... ఈ విధంగా సమాజాభివృద్ధికి ఉపయోగపడే భావితరాన్ని తయారుచేయాల్సిందిపోయి.... ఇటువంటి పాఠాలు చెప్తే బిడ్డలు ఎలా బాగుపడతారు ? వాళ్ళ మనస్సులు నిర్మలంగా....ఆటుపోటులను తట్టుకొని,,,.ఎలా నిలబడగల్గుతాయి.

## విజ్ఞానులనుకొనేవాళ్ళు మాత్రం...

అంతే కాదు. విద్యాధనులు, విజ్ఞానులు అనుకొనేవాళ్ళు జ్ఞానులుగా ప్రవర్తిస్తున్నారా ? అనేది మరో ప్రశ్న. కుల మత తత్వాలను ఎవరు రెచ్చగొడుతున్నారు. నిరక్షరాస్యులైన వాళ్ళు వాటిని రెచ్చగొట్టడంలేదు. ఉద్యోగాల కోసం....సీట్లకోసం...పదవుల కోసం.,..తమ స్వార్థంకోసం విద్యాధికులయినవాళ్ళే వీటిని రెచ్చగొట్టుతున్నారు. ఇది చాలా విచారకరం. ప్రతి మంత్రీ ఇప్పుడు రాష్ట్ర సమైక్యత గురించి మాట్లాడుతున్నాడు. పదేళ్ళనాడు వీళ్ళే ప్రాంతీయ తత్వాలను రెచ్చగొట్టినవాళ్ళు కాదా ? వాటిని తమ పదవులకు పాచికలుగా ఉపయోగించుకోలేదా ? గద్దెలెక్కి ఇప్పుడు నీతులు చెప్తున్నారు ఇదీ జరుగుతున్న తంతు.

## ఉపాధ్యాయుల కర్తవ్యాలు

ఈ స్థితిలో సమాజ ప్రయోజనాలు కాపాడటం కోసం ఉపాధ్యాయుల కర్తవ్యాలేమిటి ?

సోషలిజం .... ఈ రోజు అందరూ ఆమోదించినట్టిది. రాజ్యాంగ లక్ష్యంగా పేర్కొనబడినట్టిది. దీనికి వ్యతిరేకంగా ప్రబోధం చేయాలా? అనుకూలంగా చేయాలా? సరియైన అవగాహన కలగాలంటే ప్రస్తుతమున్న పాఠ్యాంశాలకే పరిమితమైఉంటే లాభం లేదు. దాన్నిమించి సోషలిజాన్ని గురించి చెప్తే తప్పేమిటి ? పాఠాల్లో ఉన్న లోపాలు చెప్పి... పరీక్షల్లో ఎలా వ్రాసినా. ..నిజం మాత్రం ఇదీ అని స్పష్టంగా చెప్పాల్సి వుంది,

## ప్రజాస్వామ్యం – నిరంకుశత్వం

ఉదాహరణకు 'భారతదేశంలో ప్రజాస్వామ్యం —రష్యాలో నిరంకుశత్వం' అంటూ ప్రచారం చేస్తున్న విషయమే తీసుకుందాం. ప్రజాస్వామ్యం అంటే ప్రజల హక్కులు కాపాడబడాలి గదా.... తిండీ, బట్టా, చదువూ, సంధ్యా ఉండాలిగదా ! అవేమీ లేకుండా ప్రజాస్వామ్యానికి అర్థమేమిటి? తిండిపెట్టరు, అందరూ బళ్ళోకి వెళ్ళే అవకాశాలు కల్పించరు, ఉద్యోగాలివ్వరు, దొంగ కరెన్సీకి అడ్డుపెట్టరు, బ్లాక్‌మార్కెట్ నిరోధించరు, ధరల్ని అదుపులో పెట్టరు, బడాచోర్లనూ, దోపిడీగాళ్ళనూ అరికట్టరు. మరి వీటన్నిటినీ అరికట్టి, అందరికీ అన్ని అవకాశాలు కల్పించిన రష్యాయేమో నిరంకుశ ప్రభుత్వమట! వీళ్ళదేమో ప్రజాస్వామ్యమట! సోషలిజంపాఠం వచ్చినపుడు ఇదంతా చెప్తే తప్పేమిటి ? ఈ సందర్భంలో ఎన్నికలసంగతి కూడా మనం చెప్పాలి. అందరూ ఎన్నుకొనబడినవాళ్ళే కాని ఒక్కళ్ళు తమ బుర్ర ఉపయోగించి నిర్ణయాలు చేస్తున్నారా అనేది ప్రశ్న. ప్రతిదీ అమ్మగారే నిర్ణయించాలి. ఆమె చుట్టూ ప్రదక్షిణలు చెయ్యాలి. ఆమె కూర్చోమంటే కూర్చోవాలి. నిల్చోమంటే నిల్చోవాలి. ఇది ఎలా ప్రజాస్వామ్యమవుతుంది ? ఒకే వ్యక్తి నిర్ణయాలు అమలు జరిగేప్పుడు ఆ పార్టీ కూడా ఆవ్యక్తి పేరనే నడుస్తున్నప్పుడు ఇది ఏకవ్యక్తి పాలనా? ప్రజాస్వామ్యమా ?

'మేన్ డస్‌నాట్ ఎలీవ్ బై బ్రెడ్ ఎలోన్' అని పాఠాలు చెప్తుంటారు 'బ్రెడ్' ఇచ్చి దాని ఒక్కదానివల్లే బ్రతకలేము. మిగతావి కూడా కావాలంటే అర్థం జేసుకోవచ్చు. కాని అన్నం పెట్టకుండా ఆ బాధ్యత స్వీకరింపకుండా స్వాతంత్ర్యం.... స్వేచ్ఛ అంటే అర్థం లేదు.

కాని సోషలిస్టు దేశాలలో తిండిపెట్టి, బట్టలిచ్చి, ఇంటి సదుపాయం కల్గించి, ప్రజల జీవన స్థాయిని పెంచి, విజ్ఞానాన్ని వృద్ధిచేసి, అవసరాలు తీరుస్తుంటే అదేమో నిరంకుశత్వమట! మనదేమో ప్రజాస్వామ్యమట!

ఈ మాటల్లో బూటకాల్ని బయటపెట్టి, నిజంతెల్పే అవకాశం



75

అందరికంటే ఉపాధ్యాయులకే ఎక్కువ ఉన్నది. మనవల్లగాక పోయినా మన భావితరాలవల్లనైనా మంచి జరగాలి. కాన ఉద్యోప భవిష్యత్తును ఎలా తీర్చిదిద్దాలనుకొంటున్నామో ఆ విధంగానే జాతి భవిష్యత్తును కూడా తీర్చిదిద్దే కర్తవ్యం మీముందుంది.

### మౌలిక మార్పురాని కారణం

అంతేకాదు...బ్రిటిష్‌వాళ్ళు తమ దోపిడీ ప్రయోజనాల్ని కాపాడుకోవటానికి విద్యా విధానాల్ని ఉపయోగించుకొంటే....మన పాలకవర్గం కూడా తమ స్వార్థ ప్రయోజనాలకు అనుగుణమైన పద్ధతి అవలంబిస్తున్నారనేది అతి స్పష్టంగా తెలుతున్నది.

34 ఏళ్ల స్వతంత్ర పాలనలో దరిద్రులు మరింత దరిద్రు లయ్యారని, ధనవంతులు మరింత ధనవంతులయ్యారనీ అధికారిక లెఖ్ఖలు చెపుతున్నాయి. ఈ ధనవంతుల ప్రయోజనాన్ని కాపాడే వాళ్ళనే విద్యద్వారా తయారుచేయాలనేదే వీళ్ళ లక్ష్యం.

### దేశమంటే ధనికులేనా ?

'దేశమంటే మట్టికాదు....మనుషులు' అన్నారు గురజాడ. మరికోట్లాది సామాన్య ప్రజల స్థితిగతులేమిటి? నిష్దారిద్ర్యం...నిరక్ష రాస్యత.కారుచీకటి బ్రతుకు. ఆ కారుచీకటిని బ్రద్దలుకొట్టే కర్తవ్యం ఉపాధ్యాయ వర్గంమీదే ఉంది. మీరు ఆశాజ్యోతులుగా ఉండి.,..భావి తరాల్లో ఆ జ్యోతుల్ని వెలిగించాల్సి ఉంది. చక్కటి ఆరోగ్య సంప న్నుల్ని....క్రీడాకారుల్ని....మేధావుల్ని....ఉన్నత భావ సంపన్నుల్ని మీరు అప్పుడే తయారుచేయగలరు.

దేశంలో ఉన్న పెద్దచట్రంలో విద్య ఒక చిన్న భాగం. కాని దాని కర్తవ్యం చాలాపెద్దది. గొప్పదీ కూడా. ఇంక్రిమెంటనో... జీత మనోతారట్లాడటం మనం చూస్తున్నాం. ఆ రూపాయి విలువ కాస్తా రోజురోజుకూ దిగజారుతున్నది. దానివెంట మనం పడటం జరుగు తున్నది. ఇటువంటి వాటితో సమాజం బాగుపడుతుందా ? సమాజం బాగే మన బాగు అన్న అవగాహనతో ముందుకుపోయి, నూతన సమాజసృష్టికి తోడ్పడటం జాతినిర్మాతలైన మీ ప్రధాన కర్తవ్యం.

# విద్యపట్ల కేంద్రం నిర్లక్ష్యం:

## బెంగాల్ విద్యా మంత్రి శ్రీ పార్థడే విమర్శ



విద్యను రాష్ట్ర ప్రభుత్వ పరిధినుండి తప్పించి ఉమ్మడి జాబితాలో చేర్చిన తర్వాత కేంద్ర ప్రభుత్వం విద్యారంగానికై ఒక్కనయా పైసా ఖర్చు పెట్టిందా? అని పశ్చిమబెంగాల్ రాష్ట్ర విద్యాశాఖా మంత్రి శ్రీ పార్థడే సూటిగాప్రశ్నిస్తూ ఇలాఅన్నారు.

విద్యను ఉమ్మడి జాబితాలో చేర్చిన అనంతరం రాష్ట్రాలు విద్యపై చట్టాలు చేసే అధికారం కోల్పోవటంతో అనేక సమస్యలు అపరిష్కృతంగా వుండిపోయాయని అన్నారు.

ఆయన ఇంకా ఇలా అన్నారు :

పశ్చిమబెంగాల్‌లోవిద్యారంగంపై పత్రికలలో అనేక వార్తలు వెలువడుతున్నాయి. ఈ దృష్ట్యా బెంగాల్ విద్యారంగ పరిస్థితిని సమగ్రంగా వివరిస్తాను.

### పశ్చిమబెంగాల్‌లో విద్యాభివృద్ధికి చర్యలు

సామాజిక మార్పులు సాధించటానికీ, ప్రజలను విద్యావంతుల్ని చేయడానికి విద్య ప్రధానమని యునెస్కో చేసిన సూచనను బెంగాల్ ప్రభుత్వం పూర్తిగా సమర్థిస్తున్నది.

ఈ దృష్ట్యానే దళితవర్గాల ప్రజల్ని ఎలా విద్యావంతుల్ని చేయాలన్న అంశాన్ని సునిశితంగా ఆలోచించి, కొన్ని నిర్ణయాలు గైకొని, విద్యావ్యవస్థలో మార్పులు చేయటానికి ఉపక్రమించాం.

ప్రథమంగా పాఠశాలలు లేని గ్రామాలలో పాఠశాలలను స్థాపించాం. ఇప్పుడు పాఠశాలలేని గ్రామం బెంగాల్‌లో లేదు.

### 35 లక్షల మంది బాలలకు భోజన సౌకర్యం

కాగా, గ్రామీణ ప్రాంతాలలోని పేదలకు, వ్యవసాయ కార్మికులకు తమ పిల్లలకు చదువు చెప్పించుకునే స్తోమతు లేదు. వీరికి విద్య, మధ్యాహ్న భోజన సౌకర్యాలు కల్పించటానికి అవసరమైన నిధులు మంజూరు చేయవలసినదిగా కేంద్రాన్ని కోరాము. కేంద్రం అంగీకరించలేదు. అయినప్పటికీ రాష్ట్రంలోని 70 లక్షల మందిలో 35 లక్షల మంది బాలలకు మధ్యాహ్న భోజన సౌకర్యం కల్పించాలని రాష్ట్రప్రభుత్వం నిర్ణయించి అమలు జరుపుతున్నది.

అలాగే ప్రయిమరీ పాఠశాల విద్యార్థులకు ఉచితంగా పాఠ్య పుస్తకాలు సరఫరా చేయటానికి ఏడాదికి రు. 250కోట్లు వ్యయపరుస్తున్నాం.

### 12వ తరగతి వరకు ఉచిత విద్య

బెంగాల్‌లో వామపక్ష ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత 12వ తరగతి వరకు ఉచిత విద్యాసౌకర్యాలు కల్పించటానికి అవసరమైన చర్యలు గైకొన్నాం.

అంతేకాదు. మేము అధికారంలోకి రాకముందు విద్యాసంస్థలు కుల, మత ద్వేషాలతో కలుషితమై వున్నాయి. మేం వచ్చాక విద్యాసంస్థలలో కలుషిత వాతావరణంరూపుమాపి, విద్యాబోధనకు అనువైన పరిస్థితులను ఏర్పరచాం.

### రాజకీయ హక్కులు

ఉపాధ్యాయులకు, విద్యార్థులకు రాజకీయ హక్కులు కల్పించాం. ప్రస్తుతం వారు తమ ఇష్టం వచ్చిన రాజకీయ పార్టీలో చేరవచ్చు.

ప్రాథమిక స్థాయినుంచి ఉన్నత విద్యాస్థాయి వరకు బెంగాల్ విద్యారంగంలో ప్రశాంత వాతావరణం నెలకొల్పటానికి విద్యార్థులకు ఉపాధ్యాయులకు, విద్యార్థుల తల్లిదండ్రులకు ఆయా కమిటీలలో ప్రాధాన్యత కల్పించాము. అందువల్ల విద్యార్థులు, ఉపాధ్యాయులు సమిష్టి కృషి జరపటంవలన విద్యా వ్యవస్థలో సత్ఫలితాలు వచ్చాయి.

### ఉద్యోగ భద్రత

ప్రయివేటు యాజమాన్యంలో వున్న విద్యాసంస్థలలో ఉపాధ్యాయులకు ఉద్యోగ భద్రత కల్పించటానికి అవసరమైన కమిటీలు ఏర్పరిచాం. ఫలితంగా గత నాలుగేండ్లుగా ప్రయివేటు యాజమాన్యంలో వున్న విద్యాసంస్థలలో ఉపాధ్యాయుల ఉద్యోగభద్రతకు ముప్పు వాటిల్లిన ఘటన ఒకటికూడా లేదు.

ఉపాధ్యాయులకు క్రమబద్ధంగా నెలవారి జీతాలు నేరుగా చెల్లించటానికి ఏర్పాట్లు చేశాం. ఆంధ్రప్రదేశ్‌లో కూడా నేరుగా జీతాయి చెల్లించాలని కోరుతున్నారని తెలిసింది. ఇందుకు చర్యలు గైకొనటం అవసరం.

### శాస్త్రీయ విద్యాబోధన

"శాస్త్రీయ విజ్ఞానం" పెంపొందించాలన్నది బెంగాల్ ప్రభుత్వ లక్ష్యం. కొఠారీ కమిషన్ సిఫారసులను మేము అంగీకరిస్తున్నాం.

(తరువాయి 73వ పేజీలో)



79

# శ్రీ పార్థడే ఉపన్యాసం

మాతృభాషలో విద్యాబోధన జరగాలన్న వాదనను మేము అంగీక రిస్తున్నాం.

విద్యారంగంలో మేము చేస్తున్న మార్పులపై మా పై విమర్శలు తీవ్రస్థాయిలో వస్తున్నాయి. రవీంద్రనాథ్ టాగూర్ వ్రాసిన పుస్తకాలను పాఠ్య పుస్తకాలుగా తొలగిస్తున్నామని మా పై ఆరోపణ వచ్చింది. కాని రవీంద్రనాథ్ వ్రాసిన "సహజపాఠ్" అనే పుస్తకాన్ని 1964లో పాఠ్య పుస్తకంగా తీసుకువచ్చింది వామ పక్ష ప్రభుత్వమేనన్న అంశం విమర్శకులు గ్రహించాలి.

అంతే కాదు. "కిషలే" అనే రవీంద్రనాథ్ వ్రాసిన మరో పుస్తకాన్ని కూడా అనుబంధ పాఠ్యాంశంగా ముద్రించి విద్యా ర్థులకు 19 లక్షల కాపీలను ఉచితంగా పంపిణీ చేస్తున్నాం.

పోతే, శాస్త్రీయ విజ్ఞానం పెంపొందించటానికి మాతృభాష లోనే విద్యాబోధన జరగాలి.

కొందరు మేధావులు, రాజకీయ పార్టీలవారు నేడు భాషావివాదం లేవదీస్తున్నారు. అనేక కమిటీల నివేదికలలో మాతృభాషలోనే విద్యాబోధన జరగాలని పేర్కొన్నపుడు వారు ఎందుకు వ్యతిరేకించ లేదని నేను ప్రశ్నిస్తున్నాను.

## 7వ తరగతి నుండి ఇంగ్లీషు

అయితే ఆంగ్లభాషను మేము వ్యతిరేకించటంలేదు. 7వ తర గతినుండి విద్యార్థులకు రెండవ భాషగా ఆంగ్లభాషను బోధించటానికి చర్యలు గైకొన్నాం.

విద్యారంగంలో రాజకీయ జోక్యం పెరిగిందన్న వివాదాన్ని మీకు వివరిస్తాను. విశ్వవిద్యాలయాల, విద్యాసంస్థల సక్రమ నిర్వహ ణకు, పర్యవేక్షణకు కమిటీలు ఏర్పాటుచేశాం.

## విద్యాపాలనలో ప్రజాస్వామిక పద్ధతులు

కాంగ్రెస్ (ఐ), జనతా, లోక్‌దళ్, సి. పి. ఐ.తో సహా అన్ని రాజకీయ పార్టీల ప్రతినిధుల్ని ఈ కమిటీలలో సభ్యులుగా నియమించాం. వీరందరూ భిన్న రాజకీయ పార్టీలకు చెందినవారు అయినప్పటికీ విద్య విషయంలో ఏకాభిప్రాయం కలిగివున్నారు:

ఈ కమిటీల సభ్యులను ప్రభుత్వమే నియమించటం కాదు, ఎన్నికలు నిర్వహించాలన్నది ప్రభుత్వ ధ్యేయం. ప్రస్తుతం కొన్ని కమిటీలకు ఎన్నికలు జరుగుతున్నాయి. అయినప్పటికీ విమర్శలు వస్తూనే వున్నాయి.

విద్యాసంస్థలలో సిబ్బంది నియామకాలకు కళాశాల సర్వీసు కమిషన్ ఏర్పాటుచేశాం.

సెకండరీ, ప్రాథమిక స్థాయి పాఠశాలల్లో ఉపాధ్యాయులను నియమించటానికి ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిద్వారా పేర్లు తీసుకుం టున్నాం. 30 వేల మంది పేర్లను ఈ విధంగా తీసుకున్నాం. నియా మకాలు నిజాయితీతో జరుగుతున్నాయి.

## ప్రజల తోడ్పాటు

అయితే ఇతర రాష్ట్రాల బడ్జెట్టు కేటాయింపులలో పశ్చిమ బెంగాల్ రాష్ట్ర విద్యాశాఖ కేటాయింపులో తేడాలుండవచ్చు. మొత్తం బడ్జెట్టులో 25 శాతం నిధుల్ని విద్యారంగానికి కేటాయిస్తు న్నాం. ఈ ఏడాది 18 శాతం నిధుల్ని కేటాయించాం.

# శ్రద్ధాంజలి



**శ్రీమతి యన్. వి. రమణమ్మ**

గత 26సంవత్సరాలుగా ఉపాధ్యాయఉద్యమంలో పనిచేస్తున్న సీనియర్ కార్యకర్త శ్రీమతి యన్. వి. రమణమ్మ కర్నూలులో 81 ఆగస్టు12వ తేదీన మరణించారు. ఆమె. యు. టి. యఫ్. రాష్ట్ర కార్యవర్గసభ్యురాలు. ఆమె మరణవార్త వినగానే జిల్లా అంతటినుండి వందలాది కార్యకర్తలు వచ్చి యు. టి. యఫ్. పతాకంతో భౌతిక కాయాన్ని ఊరేగించి అంత్యక్రియలలో పాల్గొని శ్రద్ధాంజలి ఘటిం చారు. ఆ సందర్భాన జరిగిన స్మారకసభకు శ్రీ జి.గోవిందప్ప అధ్య క్షత వహించారు. పలువురు కార్యకర్తలు ఆమె పట్టుదలనూ, కార్య దీక్షను ఉద్యమోత్సాహాన్ని ప్రస్తుతించారు. ఆమె మరణం జిల్లా, రాష్ట్ర ఉద్యమాలకు తీరనిలోటుగా అందరూ పేర్కొన్నారు.

---

నిధులతో సంబంధం లేకుండా విద్యారంగంలో స్పష్టమైన, నిర్దిష్టమైన నిర్ణయాలు గైకొనటంద్వారా మార్పులు తీసుకురావటానికి ప్రయత్నిస్తున్నాం.

గత నాలుగేండ్ల వామపక్ష ప్రభుత్వ హయాంలో ప్రజల సహకారంతో 8,500 పాఠశాల భవనాలను నిర్మించాం. ఇటువంటి ప్రజాస్వామ్య చర్యల ద్వారా విద్యారంగంలో మార్పులు ప్రవేశ పెట్టడం వలననే ప్రజలు విద్యా సంస్థల్ని నేడు గౌరవిస్తున్నారు.

గత నాలుగేండ్లుగా బెంగాల్‌లోని విద్యాసంస్థలలో, ఫ్యాక్టరీ లలో, రాష్ట్రప్రభుత్వ కార్యాలయాలలో సమ్మెలు జరగలేదు.

ఈ విధమైన చర్యలద్వారా ప్రజలతో మా సంబంధాలు పాతుకుపోతున్నందువలననే ఈర్ష్య, అసూయలతో బెంగాల్ ప్రభు త్వాన్ని కూలద్రోయాలని కేంద్రం ప్రయత్నిస్తున్నది.

## ఎన్నికల ప్రణాళిక అమలు

ఎన్నికల ముందు మా పార్టీ 36 అంశాల ప్రణాళికను ప్రజల ముందుంచింది. నాలుగేండ్ల పాలనలో ప్రణాళికలోని 28 అంశాలను నెరవేర్చాం. మిగిలినవి ఒక్క ఏడాదిలో పూర్తిచేస్తాం. దేశంలోనే యిది అపూర్వమైన విషయం.

తొలుత శ్రీ పార్థడే తెలంగాణా వీరయోధులకు జోహార్లు అర్పించారు. చివరిలో ఆంధ్ర ప్రజలకు శుభాకాంక్షలు తెలిపారు.

జయప్రదంగా విద్యా మహాసభలు జరుపుకున్న యు. టి. యఫ్. కి

మా శుభాకాంక్షలు

# అమలాపురం మునిసిపల్ ఎంప్లాయీస్ కో-ఆపరేటివ్ క్రెడిట్ సొసైటి లిమిటెడ్

## నెం. డి 1181 అమలాపురం

—: పాలకవర్గ సభ్యులు :—

(1) శ్రీ కె. వెంకటేశ్వరరావు B. A; (కమీషనర్) ప్రెసిడెంటు

(2) శ్రీ టి. గణేశ్వరరావు, సెక్రటరీ

(3) శ్రీ వి. సూర్యనారాయణరాజు, జాయింటు సెక్రటరీ

(4) శ్రీ జి. సత్యనారాయణ, డైరెక్టరు

(5) శ్రీ ఎమ్. మీరాసాహెబు, డైరెక్టరు

(6) శ్రీ ఎమ్. నరసింహమూర్తి, డైరెక్టరు

